# సాహిత్య సోపానములు

(కావ్యవిషయ సంగ్రహము)

లక్షణవిభాగము





ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్. హైదరాబాద్-500 001.

# సాహిత్య సోపానములు

(కావ్యవిషయ సంగ్రహము)

లక్షణ విభాగము



డా॥ దివాకర్ల వేంకటావధాని, ఎం.ఏ. (ఆనర్సు) పి.హెచ్.డి.
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు (రిటైర్డు)
ఉస్మానియా విశ్వవిద్యాలయము

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైద్రాబాద్-500 001.

# తొలిపలుకు

ఆంధ్రమున కావ్యలక్షణాదులను వివరించు గ్రంథముల సంఖ్య చాల తక్కువ. ఉన్నవైనను సంస్కృత లక్షణ గ్రంథములకు ప్రతిబింబములే కాని స్వతంత్రములైనవి కావు. సుమారు రెండు శతాబ్దుల క్రిందటి వరకు తెలుఁగు వారు సర్వ సాహిత్య మార్గములందును సంస్కృతమునే అనుసరించుచుండిరి. ఆంగ్ల భాషాభ్యాస మారంభమైన తరువాత భారతదేశము నందలి యితర వాఙ్మయములందు వలెనే ఆంధ్రవాఙ్మయము నందుఁ గూడ నాంగ్లసాహిత్య ప్రక్రియల ప్రభావము గోచరించు చున్నది. అందుచే సంస్కృతాంగ్ల లక్షణములను రెండింటిని దృష్టియం దుంచుకొని సాహిత్యశాస్త్రమును నిర్మింప వలసిన అక్కఱ యేర్పడు చున్నది. అట్టిసమన్వయ దృష్టితో వ్రాయబడిన గ్రంథ మిది.

ఇందు కావ్య రస ధ్వన్యాది సోపానము లైదున్నవి. వీనియందు రసధ్వన్యాదులకు సంబంధించిన లక్షణము లన్నియు వివరింపఁబడినవి. అందుచేతనే దీనిని లక్షణ విభాగమని పేర్కొంటిని. ముందు వ్రాయఁబోవు ప్రక్రియా విభాగ మను రెండవ భాగమున ప్రస్తుత మాంధ్ర వాఙ్మయమునఁ గనవచ్చు ప్రక్రియల స్వరూప స్వభావము లన్నియు వివరింతును.

ఈగ్రంథము వ్రాయుటలో నాకు పూజ్యులు శ్రీసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రులవారు రచించిన కావ్యాలంకార సంగ్రహ వివరణ మెన్నో విధములఁ దోడ్పడి యున్నది. సంస్కృత లక్షణమునకు సంబంధించి నంత వఱకు విషయము నంతను దానినుండియే గ్రహించి యుంటిని. తదుపరి హడ్సను రచించిన Introduction to English Literature అను గ్రంథమును తెలుఁగు భాషా సమితి వారి ఆంధ్ర విజ్ఞాన కోశము నందలి ఆఱవ సంపుటమును, ప్రతాపరుద్రీయము. సాహిత్య దర్పణము, ధ్వన్యాలోకము మున్నగు ప్రసిద్ధ లక్షణ

గ్రంథములను బరిశీలించితిని. ఆగ్రంథకర్తల కందఱికినినా హృదయ పూర్వక కృతజ్ఞతా నమస్కారము లర్పించు చున్నాను.

ఆంధ్ర సారస్వత పరిష దధికారులైన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారును, శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారును విశారద పరీక్షలకు కావ్య విషయములను దెల్పి అలంకార శాస్త్రమును గూడ కొంతవఱకు పాఠ్యముగా నిర్ణయింప వలెనను సందర్భమున నన్నీ గ్రంథమును రచించుటకుఁ బ్రేరేచి యుండిరి. ఒక్క విశారద విద్యార్థులకే కాక కళాశాలా విద్యార్థులకుఁ గూడ నుపయుక్తమగునట్లుగా నీ గ్రంథమును రచించితిని. దీనిని దయతోఁ బ్రకటింప నంగీకరించిన ఆంధ్ర సారస్వత పరిషత్తువారికి నా కృతజ్ఞతలు.

విషయ వివరణమునఁ గాని, పారిభాషిక పద నిర్వచనమునఁ గాని యిందేవైన లోపములు చొచ్చియుండ వచ్చును. విద్వాంసులు దయతో వానిని దెల్పినచో ముందు ముద్రణములందు సవరించు కొందును. జిజ్ఞాసువులు దీనియెడఁ దగిన యాదరాభిమానములు చూపి ప్రక్రియా విభాగమును గూడఁ ద్వరలో వెల్వరింపఁ బ్రోత్సహింతురని ప్రార్థించు చున్నాను.

ఇట్లు

గ్రంథకర్త

# విజ్ఞప్తి

తెలుగులో కావ్యలక్షణములగు చక్కగా వివరించు స్వతంత్ర గ్రంథములు చాలతక్కువగా ఉన్నవి. సుమారు ఏబదిఏండ్లక్రిందట స్వర్గీయ కొమాండూరి అనంతాచార్యులగారు కావ్య విషయ సంగ్రహమును మిగుల సంగ్రహముగా వ్రాసి ప్రకటించియుండిరి మరికొందరును సంగ్రహరూపమున కావ్య విషయములను వ్రాసినారు. అవన్నియు సంస్కృత లక్షణగ్రంథములననుసరించి వ్రాయఁబడినవి.

ప్రస్తుతకాలమున ఆంధ్రవాఙ్మయముపై సంస్కృత సాహిత్యప్రభావమే కాక ఆంగ్లసాహిత్యప్రభావము గూడకలదు. కావున నేటివిద్యార్థులకు సంస్కృతాంగ్ల కావ్యమర్యాదలు బాగుగా తెలియవలసియున్నది. ఆ దృష్టితో ఉభయమర్యాదలను సమన్వయించి ఈ "సాహిత్యసోపానములు" అను "కావ్యవిషయసంగ్రహము" స్వతంత్రముగా వ్రాయఁబడినది.

పాఠశాలలో తెలుఁగు పండితులుగా విశారద విద్యార్థులకు తక్కిన విషయములతో పాటు కావ్యలక్షణములుగూడ తెలిసియుండవలెనను ఉద్దేశముతో దీనిని ప్రకటించుచున్నాము. కేవలము విద్యార్థులకే కాక సాహిత్యజిజ్ఞాసువు లందరికిని ఇది మహోపయోగకరముగా నుండఁగలదు. ఇందు లక్షణవిభాగము మాత్రమే కలదు. ప్రక్రియావిభాగముతో రెండవ సంపుటము వెలువడవలసియున్నది ఆంధ్రలోకము ఈప్రథమభాగమును సముచితముగ నాదరించి ప్రోత్సహించినచో త్వరలోనే ద్వితీయ భాగము కూడ వెలువడఁగలదని విన్నవించుకొనుచున్నాము.

కోరిన వెంటనే ఈగ్రంథమును వ్రాసియిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు. డా॥ దివాకర్ల వెంకటావధానిగారికి. ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షమున కృతజ్ఞతావందనములు సమర్పించుచున్నాను.

పరాభవ కార్తీకము )
నవంబరు 1966. )

గడియారం రామకృష్ణశర్మ
కార్యదర్శి
ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైద్రాబాదు.

# విషయసూచిక

## 4. ధ్వని సోపానము 111-144



## 5. గుణరీతి వృత్త్యాది సోపానము 145-176



---

* గుర్తులుగలవి మాత్రమే విశారద పరీక్షకుఁ బఠనీయములు.

# సాహిత్య సోపానములు

అను

## కావ్యవిషయ సంగ్రహము

### ప్రథమ సోపానము

**1. విమర్శ యనఁగా నేమి?**

విమర్శ లేక విమర్శనము అను శబ్దము 'వి' అను నుపసర్గతోఁ గూడిన 'మృశ్' ధాతువునుండి యేర్పడినది. ఆ ధాతువునకు పరామర్శించుట, ఆలోచించుట, పరిశీలించుట, పరీక్షించుట, చర్చించుట మున్నగు నర్థము లున్నవి. వీని నన్నిటిని గలపి చూచినచో విమర్శన మనఁగా నేదైన గ్రంథమును గాని కళా రూపమును గాని లెస్సగాఁ బరిశీలించి, దానిని గూర్చి మననముచేసి, చర్చాపురస్సరముగా నందలి బాగోగులను బ్రదర్శించుట యని గ్రహింపవచ్చును. ఇంతే కాక యేదైనఁ గావ్యమును గూర్చి విశ్లేషణ పూర్వకముగాఁ గాని, వివరణపూర్వకముగాఁ గాని, వ్యాఖ్యానపూర్వకముగాఁగాని, తారతమ్య నిర్ధారణపూర్వకముగా గాని వ్రాయు వ్రాఁత యంతయు విమర్శగానే పరిగణింపఁబడుచున్నది. కావ్య నాటకకథాఖ్యాన రూపమైన సాహిత్యము మానవ జీవితమును వర్ణించుచు వ్యాఖ్యానము చేయుచుండును. విమర్శన మా సాహిత్యము పైనే కాక యది చేయు మానవ జీవిత వ్యాఖ్యానముపైఁ గూడ వ్యాఖ్యానము చేయుచుండును. ఈ విధముగా ప్రత్యక్షముగాఁ గాకున్నఁ బరోక్షముగానైన దానికిని మానవజీవితమునకును గొంత సంబంధమున్నదని చెప్పవచ్చును.

మన ప్రాచీనులు సాహిత్యమునకు ప్రారంభమే ఎంత ప్రాధాన్య
మిచ్చిరో విమర్శనమునకు అంత ప్రాముఖ్య మిచ్చిరి.
విమర్శ గూర్చి [illegible] - [illegible] పరిభాషలో [illegible]
[illegible] కావ్యగతమగు [illegible] విచారము విమర్శ.



విమర్శన మనఁగా ఖండనము లేక దోషైకప్రదర్శనము అను నభిప్రాయము లోకమున వ్యాప్తిచెంది యున్నది. సాధారణముగాఁ బలువురు దాని నా యర్థముననే వాడుచుందురు. పెక్కు విమర్శలు విమర్శనీయ వస్తువునందలిదోషములను మాత్రము ప్రదర్శించి గుణముల విషయమునఁ దూష్ణీంభావము వహించుటయు. విమర్శకులయందుఁ బ్రకటముగాఁ గానవచ్చు పురోభాగిత్వపరాయణతయు నందుకుఁ గారణములు. కాని యది సరికాదు. విమర్శకుఁడు వస్తువునందలి దోషములను బ్రకటించుటలో, దప్పులేదు. అతఁడు దానిని బాగుగాఁ బరిశీలించి, దాని సంపూర్ణతత్త్వము నవగాహనము చేసికొని యందలి దోషములతోపాటు గుణములనుగూడఁ బ్రదర్శింప వలయును. అప్పుడు కాని యతని విమర్శ సమగ్రము కాఁజాలదు కొందఱు వస్తువునందలి గుణములను మాత్రము పేర్కొని దోషములను జెప్ప నొప్పరికించుటయో వానిని మఱుగు పుచ్చుటయో చేయుచుందురు. ఇట్టివారి విమర్శకూడ నసమగ్ర మైనట్టిదే. కొందఱు వైయక్తికమైన రాగద్వేషములకు గుఱియై గుణములను దోషములుగను దోషములను గుణములుగను బ్రదర్శించుచు విమర్శలు వెలయింతురు. ఇవియు నుత్తమ విమర్శలు కాక పోవుటయే కాక కొన్ని యెడలఁ గువిమర్శలు కూడ నగును. నిజమైన విమర్శ యనఁగా వస్తుస్వరూపము నవగాహనము చేసికొని యందలి గుణదోషములను యథాస్థితముగా వెల్లడి చేయుటయే.

విమర్శకుడు కావ్యమునందలి గుణదోషములను నిర్ణయించి చెప్పుటకేదో యొక ప్రమాణ ముండవలయును. ఈ నిర్ణయమున నతనికి స్వీయాభిరుచులు కొంతవరకు సహాయములగుట నిజమే కాని కేవలము వానిని బట్టియే యాతఁడు నిర్ణయము కావించుచో నతని విమర్శ ప్రామాణికము కాఁజాలదు. అందుచే సునిశ్చితములైన కొన్ని సూత్రముల ననుసరించి యాతఁడు విమర్శ సాగింపవలయును ఈ సూత్రములు రెండు తెఱగులు-పూర్వలాక్షణికు లేర్పఱిచినవి; కావ్య కర్త స్వయముగా నేర్పఱుచుకొనినవి. పూర్వలాక్షణికులు తమకు ముందున్న కావ్యజాలమును బరిశీలించి కావ్యలక్షణాదులను నిశ్చయించి యుండిరి.

ఆంగ్లంలో కూడా Literary Criticism 'Poetry is the criticism of life' కవిత్వము జీవిత వ్యాఖ్యానము అన్నాడో ప్రసిద్ధ ఆంగ్ల(కవి) విమర్శకుడు. [illegible] ఆనాడే తప్పులు వెదకుట' ఒకటే సాహిత్య విమర్శగా [illegible]

వానిని బట్టి విమర్శకుడు తాను విమర్శించు కావ్యము నందలి మంచి చెడ్డలను జెప్ప వచ్చును. లేదా యీ కావ్యమును జదివి తత్కర్త యే సూత్రములపై దానిని రచింప సంకల్పించెనో తెలిసికొని యందతడు పొందిన కృతకృత్యతను బట్టి కావ్యగుణదోషములను నిర్ణయింప వచ్చును. ఇందు మొదటిది కవి స్వాతంత్ర్యము నించుకైన సహింపనిదియు రెండవది లాక్షణికుల ప్రామాణికత్వమునకు భంగము చేకూర్చునదియు నగుటచే నీ రెండు తెఱంగులును లోపభూయిష్ఠములుగనే కనిపించును అందుచే విమర్శకుడు లాక్షణికులు చెప్పిన నియమములను బాగుగాఁదెలిసికొని, దేశకాలములను బట్టి వానియందెట్టి మార్పుచేర్పులు చేయవలెనో నిర్ణయించుకొని, కవి కావించుకొన్న స్వీయసూత్రములను గూడ మనసునందుంచుకొని కావ్యపరిశీలనము కావింపవలయును పూర్వులు చెప్పినలక్షణములను బూర్తిగా నుపేక్షించుట యుక్తముకాదు. ఏలయన వానిలో సర్వజనీనములును సర్వకాలీనములు నైనవి కొన్ని యుండును. అవి రామాయణ మహాభారతాదులందు సుప్రతిష్ఠితములై తరువాతి కవుల కందఱికి శిరోధార్యములైనట్టివి. వానిని గూర్చి యెవ్వరికి నెట్టి యాక్షేపము నుండదు. విమర్శకుఁడట్టి వాని నాదర్శములుగా గ్రహించుటలో దోషములేదు. అవి లోపించినచో నితర లక్షణము లెన్ని యున్నను కావ్యము ప్రశంసా పాత్రము కాకపోవును. వానితోఁ బ్రతిభావంతులైన యనంతర కవీంద్రుల రచనలలోఁ గాలము పరీక్షకు నిల్వఁజాలిన నూత్న గుణములను జతచేసి యారెండింటిని బ్రమాణములుగా గ్రహించి విమర్శకుఁడు తన కర్తవ్యమును గొనసాగింపవచ్చును. అప్పుడతనివిమర్శ యా ప్రత్యేక కావ్యము యొక్క గుణదోషములను జక్కగాఁ బ్రదర్శించునదే కాక తరువాతి కవులకు మార్గదర్శకముగాఁ గూడ నుండఁ జాలును.

విమర్శ కావించుటకు ముందు విమర్శకులు మూలగ్రంథములను సమగ్రముగాఁబఠించి వాని తత్త్వమును లెస్సగా నవగాహనము చేసికొన వలయును మూలగ్రంథములను సరిగాఁ జదువక యెవ్వరో వ్రాసిన వాని సారాంశములనో, సంగ్రహరూపములనో మాత్రము పఠించి విమర్శకుఁ గడంగుట మంచి పద్ధతి

విమర్శకుని దృష్టి పాక్షికముగా నుండ కూడదు. అతను సర్వాంగ దర్శియై
యుండవలెను. కల్పనాశక్తి యుండవలెనని విధింపలేము.
కల్పనాశక్తి యుండిన కవియే యగును. నిరంతరమగు పరిశ్రమ
పఠనము - అనుశీలనము తో నిర్మలమగు దృష్టి యుండవలెను
4
కాదు. కాలాభావము చేతనో సౌలభ్యకాంక్ష చేతనో కొందఱట్లు చేయుచుండుట కలదు. కాని యది మూలగ్రంథమున కన్యాయము చేయుటయే యగును. ఏల యననవి మూలగ్రంథ తత్త్వమును సంపూర్ణముగా నందీయఁజాలవు. అదిగాక విమర్శకులు మూలగ్రంథములను స్వయముగాఁ జదువునప్పు డా సారాంశ సంగ్రహకర్తలకుఁ దోఁచి యుండని కొన్ని నూతనాంశములు వారికి స్ఫురించుట కవకాశ మున్నది. మూలగ్రంథములను జదివి వానిని స్వాయత్తము చేసికొన్న పిమ్మట వానిని గూర్చి మఱింత నిశితముగా నెఱుంగుటకై యా సారాంశ సంగ్రహాదులను గూడాఁ జదివినఁ జదవ వచ్చును. అంతే కాని వానిని మాత్రమే చదివి తృప్తి నొందుట స్వచ్ఛ జలప్రవాహమగు నది చెంతనుండ నందు స్నానము చేయక కడవతోఁ దెచ్చుకొన్న నీట స్నానముచేయుట వంటిది.

కొందఱేదైన కావ్యమును విమర్శించుటకా కావ్యమును గూర్చి యితరులు కావించు పూర్వవిమర్శలపై నాధారపడుచుందురు. అట్టివారిపై నా పూర్వ విమర్శల ప్రభావ మధికముగాఁ గనిపించును. ఆ పూర్వ విమర్శకులు లబ్ధ ప్రతిష్ఠులైనచో నా ప్రభావము మఱింత హానికరముగాఁ బరిణమించును. ఏలయన నప్పుడు విమర్శకులు తమకును పూర్వ విమర్శకులకును విద్వత్తలోఁ గల తారతమ్య మెఱింగిన వారు కావున వారు చెప్పిన భావములనే నిశ్శంకముగా ననువదింతురు. అట్టియెడ వారికిఁ దోఁచిన భావములే వీరికిని దోఁచుటయు, వా రుపేక్షించిన వానిని వీరును ఉపేక్షించుటయు సంభవించును అనగా వారు మూల గ్రంథమును స్వీయ బుద్ధితోఁగాక పరుల బుద్ధితోఁ బరిశీలించి నట్లగును. ఈ విధముగా పూర్వ విమర్శలు సహాయములుగాఁగాక యంతరాయములుగా నేర్పడుచుండును. అప్పుడు మూల గ్రంథముతోఁ బ్రత్యక్ష పరిచయ ముండదు కావున విమర్శకుల స్వతంత్రాలోచన కెట్టి యవకాశము నుండదు. ఒక విద్యార్థి మనుచరిత్రపై వ్యాసము వ్రాయఁ దలంచి యందుకే గ్రంథము చదువుట మంచిదని యాచార్యు నడిగెనఁట. అప్పు డా యాచార్యుడు మను చరిత్రమునే చదువుట మంచిదని సమాధానము

తత్త్వములందు గలిగిన విమర్శనమునందును subjective and objective ఆత్మాశ్రయ - పరాశ్రయ విధానముల ననుసరింప వచ్చును. విమర్శకులకు వేదము లనదగు ఇష్టానిష్టములయాధారమున కావ్యవివేచనము నొనర్చుటను శైలిశిల్ప - ఫలితములు నుపాంతము కానేరవన్నారు.
చెప్పెనఁట. దీనిని బట్టి విమర్శకులు మూల గ్రంథములను నిశితముగాఁ బరిశీలించుట యెంత యవసరమో తెలియుచున్నది.

అయినచో విమర్శల వలనఁ బ్రయోజన మేమి యను ప్రశ్న యుదయించును మెలఁకువతోఁ జదివినచో వానివలనఁ గలుగు లాభ మపారముగానుండును. వానివి సారస్వత ప్రియులు పూర్తిగా నిరసించుట తమకంటె ధీమంతు లెవ్వరు నుండరనియు నితరుల విశిష్ట విజ్ఞానానుభవముల వలనఁ దమ కెట్టి లాభము కలుగదనియుఁ దలంచినట్లగును. ఉత్తమమైన విమర్శ పఠితలకు విజ్ఞాన వికాసములు చేకూర్చుటయే కాక వారియందు నూత్న చైతన్యము రేకెత్తించును. మహాకవులు తమ కావ్యములద్వారా మానవజీవిత పరమార్థమును జూపిన లోసంగ విమర్శకులు తమ విమర్శలద్వారా సారస్వత పరమార్థమును జూపి యిచ్చుచుందురు. ఉత్తమ విమర్శకులు పఠితల యవగాహనశక్తికిఁ గలిగించు దోహదము పలువిధములుగా నుండును. వారు వారికిఁ గ్రొత్తభావము లందింతురు; వారిలో నస్పష్టములు సంశయాస్పదములునైన యభిప్రాయములను సందేహములను తొలగించి దృఢపఱుతురు; వారొకవేళ పెడదారిని బట్టుచో సన్మార్గమును జూపుదురు; వారికి మూల గ్రంథమును నూత్న దృక్పథముతోఁ బఠించి యానందించు నవకాశమొసంగుదురు; మధువిక్రేత సరఘాసంకులమైన క్షౌద్ర పటలమునుండి యచ్ఛ మధురమైన తేనె నొడ్చి యందిచ్చునట్లు వారు దురవగాహార్థ భావసంపన్నములైన కావ్యములనుండి మధురోజ్జ్వల రసభావములను సేకరించి యాస్వాద యోగ్యములు కావింతురు. విమర్శకుల యభిప్రాయములతోఁ బఠిత లేకీభవించి తీరవలె నను నిర్బంధము లేదు. వారు విమర్శలు విచక్షణతోఁ జదివి యోగ్య భావములను గ్రహింపవచ్చును. అయోగ్యములైన వానిని త్యజింప వచ్చును. విమర్శల విషయమున నంధానుకరణము హానికరము కాని యాలోచనా సహితమైన పఠన మెప్పుడును అసర్థము కాఁజాలదు

విమర్శక లక్షణములు : కావ్య విమర్శ చేయఁగడంగు వారందుకుఁ దగిన యధికారమును సంపాదింప వలసిన యావశ్యక మెంతైన నున్నది. వారు

విమర్శకులు చేయ్యవాస్త్రి యూంగ్ల భాషనుగ్ అంతగా తెలియనంతవారై యుంగ్లభాషను. కల్పనాశక్తి లేంగ వారినని విధింపతేము. కల్పనాశక్తి లేంటే తెలివదు అసలు. విరంతరమయి ప్రతాపవ్వ పత్రికలు - అనుశీలనము లో నిర్మలమ్మ దయుటకై యాలాంగా వారి కాదు. కాలాభావము చేతనో సౌలభ్యకాంక్ష చేతనో కొందఱట్లు చేయుచుండుట కలదు. కాని యది మూలగ్రంథమున కన్యాయము చేయుటయే యగును. ఏల యనని మూలగ్రంథ తత్త్వమును సంపూర్ణముగా నందీయఁజాలవు. అదిగాక విమర్శకులు మూలగ్రంథములను స్వయముగాఁ జదువునప్పు డా సారాంశ సంగ్రహకర్తలకుఁ దోఁచి యుండని కొన్ని నూతనాంశములు వారికి స్ఫురించుట కవకాశ మున్నది. మూలగ్రంథములను జదివి వానిని స్వాయత్తము చేసికొన్న పిమ్మట వానిని గూర్చి మఱింత నిశితముగా నెఱుంగుటకై యా సారాంశ సంగ్రహాదులను గూడాఁ జదివినఁ జదవ వచ్చును. అంతే కాని వానిని మాత్రమే చదివి తృప్తి నొందుట స్వచ్ఛ జలప్రవాహయగు నది చెంతనుండ నందు స్నానము చేయక కడవతోఁ దెచ్చుకొన్న నీట స్నానముచేయుట వంటిది.

కొందఱేదైన కావ్యమును విమర్శించుటకా కావ్యమును గూర్చి యితరులు కావించు పూర్వవిమర్శలపై నాధారపడుచుందురు. అట్టివారిపై నా పూర్వ విమర్శల ప్రభావ మధికముగాఁ గనిపించును. ఆ పూర్వ విమర్శకులు లబ్ధ ప్రతిష్ఠులైనచో నా ప్రభావము మఱింత హానికరముగాఁ బరిణమించును. ఏలయన నప్పుడు విమర్శకులు తమకును పూర్వ విమర్శకులకును విద్వత్తలోఁ గల తారతమ్యమెఱింగిన వారు కావున వారు చెప్పిన భావములనే నిశ్శంకముగా ననువదింతురు. అట్టియెడ వారికిఁ దోచిన భావములే వీరికిని దోచుటయు, వా రుపేక్షించిన వానిని వీరును ఉపేక్షించుటయు సంభవించును అనగా వారు మూల గ్రంథమును స్వీయ బుద్ధితోఁ గాక పరుల బుద్ధితోఁ బరిశీలించి నట్లగును. ఈ విధముగా పూర్వ విమర్శలు సహాయములుగాఁ గాక యంతరాయములుగా నేర్పడుచుండును. అప్పుడు మూల గ్రంథముతోఁ బ్రత్యక్ష పరిచయ ముండదు కావున విమర్శకుల స్వతంత్రాలోచన కెట్టి యవకాశము నుండదు. ఒక విద్యార్థి మనుచరిత్రపై వ్యాసము వ్రాయఁ దలంచి యందుకే గ్రంథము చదువుట మంచిదని యాచార్యు నడిగెనఁట. అప్పుడా యాచార్యుడు మను చరిత్రమునే చదువుట మంచిదని సమాధానము

తత్త్వములందు వలెనే విమర్శనములందును Subjective and objective ఆత్మాశ్రయ - పరాశ్రయ విధానముల ననుసరింప వచ్చును. విమర్శకులు తమ మనసులు ఇష్టానిష్టముల యాధారముగ కావ్య విశేషణములను చెప్పుచు తీర్పులో - ఫలితము సుఖాంతము కానేకాదని చెప్పెనఁట. దీనిని బట్టి విమర్శకులు మూల గ్రంథమును నిశితముగాఁ బరిశీలించుట యెంత యవసరమో తెలియుచున్నది.

అయినచో విమర్శల వలనఁ బ్రయోజన మేమి యను ప్రశ్న యుదయించును. మెలఁకువతోఁ జదివినచో వానివలనఁ గలుగు లాభ మపారముగానుండును. వానిని సారస్వత ప్రియులు పూర్తిగా నిరసించుట తమకంటె ధీమంతు లెవ్వరు నుండరనియు నితరుల విశిష్ట విజ్ఞానానుభవముల వలనఁ దమ కెట్టి లాభము కలుగదనియుఁ దలంచినట్లగును. ఉత్తమమైన విమర్శ పఠితలకు విజ్ఞాన వికాసములు చేకూర్చుటయే కాక వారియందు నూత్న చైతన్యము రేకెత్తించును. మహాకవులు తమ కావ్యములద్వారా మానవజీవిత పరమార్థమును జూపి లోసంగ విమర్శకులు తమ విమర్శలద్వారా సారస్వత పరమార్థమును జూపి యిచ్చుచుందురు. ఉత్తమ విమర్శకులు పఠితల యవగాహనశక్తికిఁ గలిగించు దోహదము పలువిధములుగా నుండును. వారు వారికిఁ గ్రొత్తభావము లందింతురు; వానిలో నస్పష్టములు సంశయాస్పదములునైన యభిప్రాయములను సందేహములను తొలగించి దృఢపఱుతురు; వారొకవేళ పెడదారిని బట్టుచో సన్మార్గమును జూపుదురు; వారికి మూల గ్రంథమును నూత్న దృక్పథముతోఁ బఠించి యానందించు నవకాశ మొసంగుదురు; మధువిక్రేత సరఘాసంకులమైన క్షౌద్ర పటలమునుండి యచ్చ మధురమైన తేనె నోడ్చి యందిచ్చునట్లు వారు దురవగాహార్థ భావసంపన్నములైన కావ్యములనుండి మధురోజ్జ్వల రసభావములను సేకరించి యాస్వాద యోగ్యములు కావింతురు. విమర్శకుల యభిప్రాయములతోఁ బఠిత లేకీభవించి తీరవలె నను నిర్బంధము లేదు. వారు విమర్శలు విచక్షణతోఁ జదివి యోగ్య భావములను గ్రహింపవచ్చును. అయోగ్యములైన వానిని త్యజింప వచ్చును. విమర్శల విషయమున నంధానుకరణము హానికరము కాని యాలోచనా సహితమైన పఠన మెప్పుడును అనర్థము కాఁజాలదు

విమర్శక లక్షణములు : కావ్య విమర్శ చేయఁగడంగు వారందుకుఁ దగిన యధికారమును సంపాదింప వలసిన యావశ్యక మెంతైన నున్నది. వారు

విమర్శకులు - రసజ్ఞులు [illegible] [illegible]
సహృదయులు

నిరపేక్ష విమర్శనను, సాపేక్ష విమర్శ [illegible]

సాహిత్య శాస్త్ర నిష్ణాతులైన విద్వాంసులై పూర్వ కవి రచిత మహాకావ్యములతో బరిచయము కలిగి యుండవలయును. వారు విమర్శనీయ కావ్యమును సానుభూతితోఁ బరిశీలించు సహృదయులై యుండవలయును. వారు విమర్శనీయాంశము కావ్య ప్రవృత్తియే కాని కవి ప్రవృత్తి కాదని గుర్తించుకొన వలయును. అనఁగా వారు గ్రంథస్థ విషయమునే కాని గ్రంథకర్త రూపశీల వర్తనాది విషయములను విమర్శింపఁగూడదు. వారు కావ్య విమర్శ చేయునప్పుడు తమ్ము తమ భావములను విస్మరించి 'అహంకార' పరిత్యాగము చేయవలయును. ఒక కవి సంపెంగ పూవును జక్కగా వర్ణించును. విమర్శకుడు సంపెంగపూవు రూపము కాని వాసన కాని గిట్టక పోవచ్చును. అట్టియెడ విమర్శకుడు కవి నాకిష్టములేని సంపెంగ నింత రమ్యముగా వర్ణించినాఁడేమని యాతని దూయఁబట్టరాదు. కవి సంపెంగ రూపవాసనాదుల నెంతగాఁ బరిశీలించి యనుభవించి యెంత స్పష్టముగా వర్ణించినాఁడనునదియే యాతఁడు పరిశీలింప వలసిన విషయము. ఇట్టి రసజ్ఞత "అహంకార పరిత్యాగ" మెంతైన నవసరము. అది లేనిచో నతఁడు కవి కవిత్వమును దా నాస్వాదింప లేక పోవుటయే కాక దాని విషయమునఁ దన విమర్శ పఠించు వారి భావములను గూడఁ గలుషీకరించును. విమర్శకులు రాగద్వేషములకు లోనుగాక సమదర్శనులై యుండవలయును. అనఁగా గ్రంథకర్త మీఁద వ్యక్తిగతముగాఁ దమకుఁగల ఆదరము చేతనో యనాదరము చేతనో వారు గ్రంథముల నాకాశమున కెత్తుటయో యధఃపాతాళమున కణఁచుటయో చేయరాదు. నిష్పక్షపాతముగా వారు సత్యమును జెప్పుటకు యత్నింప వలయును. జీవితములోఁగల స్నేహవైరములను మొగమాటములను విమర్శన సందర్భమున వారు లేశమైనను బరిగణింపరాదు విమర్శ నిర్మాణాత్మకముగా నుండవలయునే కాని విధ్వంసనాత్మకముగా నుండరాదు. అప్పుడది యువక రచయితల కాదర్శప్రాయమై సారస్వతాభివృద్ధికి దోహదము చేకూర్చును. ఇట్టి గుణములుగల విమర్శకులు సారస్వత రసాస్వాదనమున కెన్నియో విధములఁ దోడ్పడి పఠితృగౌరవాదర పాత్రులగుదురనుటకు సందేహింప నక్కఱలేదు.

మాత్రమే ... [illegible] స్వరూపం [illegible]
[illegible] కవి [illegible] - [illegible]
[illegible] ...
ప్రాచ్య [illegible] - 7 [illegible] ... etc.

ప్రాక్ప్రతీచీ విమర్శన విధానములు : ఉత్తమ విమర్శన మే కాలమందైన నేదేశమందైన నొక్క విధముగనే యుండు ననుట నిజమే కాని యాయా దేశములందలి విమర్శకులు విమర్శన సందర్భమున నాయా యంశముల కిచ్చు ప్రాధాన్యమునుబట్టి వారి విమర్శన విధానములలోఁ గొంత తారతమ్యము గోచరించును. పాశ్చాత్యులతోఁ బోల్చి చూచినచో విమర్శన సందర్భమున భారతీయులకుఁ జారిత్రకదృష్టి తక్కువగాఁ గనిపించును. పాశ్చాత్యులేదైన గ్రంథమును విమర్శించుటకు ముందాగ్రంథమును రచించిన కర్త యే దేశమందే కాలమందు నివసించెనో యప్పటి మత రాజకీయ సాంఘిక పరిస్థితు లెట్లుండెనో కర్త రచనపై వానికిఁగల ప్రభావ మెట్టిదో పరిశీలన చేయుదురు. అందుచేఁ బాశ్చాత్య దేశములందలి విమర్శలలోఁ గావ్యముల చరిత్రతోపాటు కవుల చరిత్రకూడఁ దెలిసికొనుట కవకాశ ముండును. భారతీయులు కావ్య పరిశీలనమున కిచ్చినంత ప్రాధాన్యము కవి చరిత్ర పరిశీలన కిచ్చియుండలేదు. అందుచేతనే పలువురు భారతీయ మహాకవుల నామములుతప్ప వారినిగూర్చి మనకింకేమియుఁదెలియదు. పాశ్చాత్యులు కావ్యములకుఁ జరిత్రకుఁ దత్సమకాల జీవితమునకుఁ గల సంబంధమును విశేషముగాఁ జర్చింతురు. భారతీయులలో నా పరిశీలన మల్పముగా నుండును.

కావ్యములకుశబ్దచ్ఛందములు బాహ్యరూపములనియు రసభావాదులాంతర రూపములనియుఁ జెప్పవచ్చును. భారతీయులు విమర్శ సందర్భమున నీ బహిరంతస్స్వరూపములు రెండింటికిని సమప్రాధాన్యము నొసంగుదురు అనగా గవులు శబ్దము లెట్లుపయోగించినారు అవి వ్యాకరణమున కనుగుణముగా నున్నవా లేవా యని వారు విశదముగాఁ బరిశీలించి శబ్దదోషము లున్నచోఁ గావ్యము దుష్టమని నిరసింతురు అందుచేతనే సుగుణములు అదోషములునైన శబ్దార్థములే కావ్యమని యొకలాక్షణికుఁడు నిర్వచించినాడు. పాశ్చాత్యులాంతరస్వరూప విమర్శనమున కిచ్చునంత ప్రాధాన్యము బహిస్స్వరూప విమర్శనమున కొసంగరు.

రసము, ధ్వని, అలంకారములు, గుణములు, దోషములు, ఔచిత్యము మున్నగువానినిగూర్చి భారతీయ లాక్షణికులు కావించిన పరిశీలన మపారమైనది.

వారు రచించిన లక్షణ గ్రంథముల నవలోడించిన వారగుటచే భారతీయ విమర్శకులుకూడ వాని విషయమున నత్యంత శ్రద్ధ వహింతురు. పాశ్చాత్యులు మొన్న మొన్నటివఱకు రసధ్వన్యాదులనుగూర్చి యంతగాఁబరిశ్రమ చేసియుండ లేదు. వారి విమర్శలు మనోభావపరిశీలనము, ఔచిత్యము, సౌందర్యము మున్నగు వానికి సంబంధించి యుండును.

భారతీయ విమర్శకులలో లక్షణానుసరణ మెక్కువగాఁ గనిపించును. చిరప్రతిష్ఠితములైన లక్షణములు కావ్యములలో మృగ్యములైనచో వారు వాని నప్పములుగాఁ బరిగణింతురు. రసపాత్ర వర్ణనాదుల సందర్భమునఁ గవుల స్వాతంత్ర్యమును వా రంతగా నంగీకరింపరు. అనఁగా వారికి సమయ సంప్రదాయాభిమాన మెక్కువ. పాశ్చాత్యవిమర్శకులలోఁ గూడఁ గొందఱు సంప్రదాయాభిమాను లున్నను గొందఱు నూతనప్రయోగములను, ఉత్కర్షావహమైన స్వాతంత్ర్యమును నిరసింపక పోవుటయేకాక యధికముగాఁ బ్రశంసింతురు.

కావ్యమున కానందోపదేశములు రెండును ప్రయోజనములే. భారతీయులు కావ్యపఠన సందర్భమున సద్యఃపరనిర్వృతితోపాటు సదుపదేశమును గూడ వాంఛింతురు. పాశ్చాత్యులుపదేశ ప్రధానముకంటె నానంద సంధాన దక్షత్వమున కెక్కువ ప్రాధాన్య మొసంగుదురు.

భారతీయుల విమర్శ లొక్కొక్కప్పుడు కావ్యవస్తువునుండి కావ్యకర్త జీవితము వఱకు వ్యాపించుచుండును. అనగా నందుఁ గావ్య విమర్శతోపాటు వ్యక్తిగతమైన కావ్యకర్తృ విమర్శకూడఁ బ్రవేశించు చుండును. ఇది ప్రశస్త విమర్శనపద్ధతికాదు. విమర్శకుల విమర్శకుఁ బాత్రము కావ్యవస్తువే కాని కావ్యకర్తృ జీవితముకాదు. పాశ్చాత్యులలో వ్యక్తిగత దూషణాదులత్యల్పముగా గోచరించును. వారు కవి జీవితమునకును కావ్యవస్తువునకునుగల సంబంధమును బరిశీలింతురు. గాని కవి వ్యక్తిగత గుణదోషముల జోలికిఁబోరు.

ఆంగ్లభాషాభ్యాస మధికమైన పిమ్మట భారతీయులు ప్రాక్ప్రతీచీ విమర్శన విధానములను మేళవించి సద్విమర్శలు వెలయించుచున్నారు. ఈ విధానమునకు స్వభాషాభివృద్ధి కెంతయు శుభసూచకము. గుణములు వైదేశికములైనను ఆదరణీయములే: దోషములు స్వదేశీయములైనను విసర్జింపఁదగినవే.

## 2. లలితకళలు - కవిత్వము

అనాది కాలమునుండియు మానవుఁడు తనజీవితమును సౌఖ్యానందమయ మొనరించుకొనుటకై యనేక కృత్యము లాచరించుచునే యున్నాఁడు. వీనిలోఁ గొన్ని యుపయోగదృష్టితోడను గొన్ని సౌందర్య దృష్టితోడను జేయఁబడు చున్నట్లుకానవచ్చును. ప్రతిభానైపుణ్యములకుఁ దావలములైన వీనికన్నింటికినిగళలను సామాన్య నామ మేర్పడినది. వీనిని వర్గీకరించి మనపూర్వులివి యఱువది నాలుగు తెఱంగులని వివరించినారు. ఇందుఁగొన్ని మానవజీవితమున కవరిహార్యములైనవి కొన్ని యపరిహార్యములు కాకపోయినను ఆనంద ప్రదములగుటచే నాకర్షకములైనట్టివి. వీనిలో మొదటితెగకుఁ జెందినవి మానవశరీర సౌఖ్యము నకును, రెండవ తెగకుఁజెందినవి మానవహృదయానందమునకును దోడ్పడును. మొదటి తెగవానిని సామాన్య కళలనియు, రెండవ తెగవానిని లలితకళలనియుఁ జెప్పుచుందురు. ఈ యిరుతెగల కళలనుగూర్చియు రచింపఁబడిన గ్రంథములు సంస్కృతములో ననేకములున్నవి. కాని వానిలోఁ బెక్కు ముద్రితములు గాక కాలగర్భమున నే యడఁగియుండుట మన దురదృష్టము.

లలితకళ అను మాట యాంగ్లభాషయందలి 'Fine Arts' అను పదమునకుఁ బర్యాయముగా వాడఁబడుచున్నది. చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, నృత్యము, కవిత్వము అను నైదును ఈ తెగకుఁ జెందినట్టివి. ఇవి యన్నియు నానంద సంధాయకములే యైనను సూక్ష్మముగాఁ బరిశీలించినచో వీనియందించుక తారతమ్యము గోచరించును. ఇవి యొసంగు నానందపరిణామమునుబట్టియు, వీని

స్వరూప స్వభావములను బట్టియు, వీని యందలి హెచ్చుతగ్గులను నిర్ణయింప వచ్చును. ఆకార లక్షణములందు వీనికి సామ్యము లేకపోయినను నిర్వహించు ప్రయోజనమునందు మాత్రము వీనికి సాధర్మ్య మున్నది. అది తమ్మాశ్రయించు వారికి బ్రహ్మానంద సబ్రహ్మచారియైన యానందము నొసంగు సామర్థ్యము నందుఁ గాననగును.

లలితకళ లింద్రియముల ద్వారా మానవ మానసముల కానందముచేకూర్చి త మ్ముపాసించువారికిఁ గించిత్కాలమైన నక్షయము విగళిత వేద్యాంతరమునైన బ్రహ్మానందము యొక్క పరమార్థము నెఱింగించును. బుద్ధిమంతులైన వారా విషయము గ్రహించి తాత్కాలికమైన కళానందమునుండి శాశ్వతమైన బ్రహ్మానందమునకు దారిచూపు ప్రయత్నము లాచరింపవలయును. అట్లు చేసిననాఁడే వారి కళోపాసన సంపూర్ణ సాఫల్యము నందినదని చెప్పవచ్చును. లేనిచోఁ గళోపాసనా సమయమున నానందలోకమున విహరించి యది ముగిసినంతనే వారు మరల సుఖదుఃఖరాగద్వేషాది ద్వంద్వములతోఁ గూడిన దృశ్యమానలోకమున కరుదెంచు చుందురు. యోగీశ్వరులకును గళోపాసకులకును నిదియే భేదము. వారు నిరంతరము బ్రహ్మానంద సాగరమున నోలలాడుచుండ వీరెడనెడ దానిని జవిచూచి వికృతిని బొరయుచుందురు.

చిత్రలేఖనము చక్షురింద్రియముద్వారామానసమున కానందముచేకూర్చును. కన్నులు భావగంభీరమైన సుందర చిత్రమును జూచినంతనే యావర్జితములై మానసమును బహిర్లోక విస్మారకమైన యానంద రసమున నోలలార్చును చిత్రలేఖనమున మనము చిత్రిత వస్తువుయొక్క సంపూర్ణమైన యాకారమును గాక యందలి యేకదేశమును మాత్రమే దర్శింపఁ జాలుదుము. అదియునుగాక చిత్రకారుఁడు దృశ్యమును బాగుగా పరిశీలించి తన మానసమునకు మెచ్చుగొల్పిన యొకానొక సమయమునందలి దాని విన్యాసమును మాత్రమే తన చిత్రమున రూపొందించును. ఆ క్షణము గడచి పోయినచో నాదృశ్యము యొక్క స్థితియందుఁ

గొంత మార్పు సంఘటిల్లును. ఈ మార్పును గూడ సూచింపఁ దలఁచినచోఁ జిత్రకారుఁడు మఱియొక చిత్రమును రచింప వలసినదే. ఇట్లే వస్తువుల దశలును క్షణక్షణ చాంచల్య మానము లగుచుండును గావునఁ జిత్రకారుఁ డా దశల నన్నిటిని దన చిత్రమునఁ జూపఁ జాలఁడు. అతని చిత్రము వస్తువు యొక్క ఏకైక దశా విన్యాసమును మనకుఁ బ్రదర్శింపఁ జాలు నంతే.

శిల్పము కూడఁ గొంచెమించుమించుగాఁ జిత్రలేఖనము వంటిదే ఇదియుఁ జక్షురింద్రియము ద్వారా మానసమును రంజించునట్టిదే. ఇందును వస్తువుయొక్క కించిత్కాల స్థేయమైన యేకైక విన్యాసమే ప్రదర్శింపబడును కాని శిల్పి యందు వస్తువును సంపూర్ణాకృతిగాఁ బ్రదర్శింపఁ జాలును. శిల్పి చెక్కిన సమగ్ర విగ్రహములందు మనము ముందు వెనుకలను పార్శ్వములను గూడ దర్శింపఁ జాలుదుము. చిత్రలేఖనమునకు దీనికిని గల మఱియొక విశేష మేమనఁ జిత్ర లేఖనమునవలెఁ గాక యిది త్వగింద్రియమునకుఁ గూడ గోచరించుట కవకాశము కలదు. చిత్రలేఖనమును మనము స్పృశించి చూచినచో నందలి విశేష మేమియును గ్రహింపఁజాలము. శిల్పమున నట్లుగాక స్పర్శచే నందలి నిమ్నోన్నత భాగముల గుర్తించి పరిశీలింపఁగలము. అందునకు జిత్రలేఖనమును దదాలంబనమైన పట పత్రాదికమును నిర్విశేషమే. శిల్పమునైనచో నాతఁడు చేతితోఁ దడవి చూచి స్పర్శప్రభావముచే దాని రామణీయకము నంతను గాక పోయినను గొంచెమైన గ్రహించి యానందించుట కవకాశ మున్నది.

సంగీతము శ్రవణేంద్రియముద్వారా మానసమునకానంద ముసత్పాదించును. ఇది కేవల స్వరమయమై యున్నది. వివిధ స్వరముల విన్యాసముచేఁ గలుగు నొకానొక యనిర్వచనీయమైనసామరస్యముచే నిది వినువారి డెందముల నాకర్షించి వారికం దేకాగ్రత కలిగించును. ఇది భావాశ్రయము కాని రసాశ్రము కాని కాదు. కేవలము స్వరాశ్రయమైనట్టిది. ఇది యొకవిధముగాఁ జూచినచోఁ దాళలయాశ్రయ మైన నృత్తము వంటిదని చెప్పవచ్చును. అయ్యు నిది చిత్తాకర్షకత్వమున నితర

కళలకుఁ దీసిపోదు. ఇది మానవులనేకాక ప్రాణవంతమైన జంతుజాలమునంతను దన దెస కాకర్షించుకొనఁగలదు. అందుచేతనే "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గాన రసం ఫణిః" అను నానుడి యేర్పడినది. పంచేంద్రియములలో నితరములైనవాని కన్న శ్రవణేంద్రియమునకెక్కువ బలసామర్థ్యములున్నట్లుగోచరించును. రంజకమైన రాగాలాపము నాలించినంతనే యది విషయాంతర మగ్నమైయున్నదానినైన మనమును బలవంతముగానాకర్షించి తదేకపరాయణముకావించును. పాశ్చాత్యులు లలితకళ లన్నిటికిని సమానమైన ప్రాధాన్యమునే యొసంగుదురు. భారతీయులట్లుకాక చిత్రలేఖన శిల్పములకంటె సంగీతమునకును,సంగీతమునకంటె నృత్య కవిత్వములకును నధికమైన ప్రాధాన్య మొసంగుచుందురు. దీనికి శ్రవణేంద్రియ సమ్మోదము ద్వారా మానసమునకుఁ గలుగు నానందమున వారికిఁ గల యభిమానయే కారణమై యుండును.

నృత్యము భావాశ్రయమైనది. ఇది పదార్థాభినయాత్మకమైమార్గమని ప్రసిద్ధి నందియున్నది. జనులు సాధారణముగా నృత్య నాట్యములందలి భేదము నారయఁజాలక రెంటిని సమానార్థకములుగా వాడుచుందురు. కాని దశరూపకకారుఁడు "అన్యద్భావాశ్రయంనృత్య" మ్మనియు, ధనికుఁడు "రసాశ్రయాన్నాట్యాద్భావాశ్రయం నృత్య మన్యదేవ" యనియు నా రెంటికిని భేదము నిరూపించియున్నారు. నాట్యము రసాశ్రయమైనది. ఇందు కావ్యార్థాభినయము గోచరించును. నృత్యమున నాంగికాభినయము ప్రాధాన్యము వహింప నాట్యము సాత్త్వికాభినయ బహుళమై యొప్పారుచుండును. 'అత్రనృత్యేదర్శనీయ మేవసర్వం భవతి.నతుశ్రవణీయమ్ నృత్యేకావ్యసంబంధాభావా దిత్యర్థః'' అని దశరూపకవ్యాఖ్యలలో నొకటగుప్రభలో వివరింపబడియున్నది. దీనినిబట్టి నృత్యముకూడ నృత్తమువలెనే శ్రవణేంద్రియమునకంటెఁ జక్షురింద్రియమునకే యెక్కువప్రీతి కలిగించునని తెలియుచున్నది. నృత్త నృత్యములకు గాత్రవిక్షేప సామ్య మున్నప్పటికి నృత్తమున లేని యను కరణము నృత్యమున నుండుటచే నిది సర్వవిధముల దానికంటె నతిశయించుచున్నది. నృత్య మాంగికాభినయ బాహుళ్యమగుటచేఁ జిత్రలేఖన శిల్పములవలెనే

చక్షువులకుఁ బ్రీతి సంధించును. కాని యవి వస్తువుయొక్క యేకక్షణ వ్యక్త మగు స్థిరవిన్యాసమునే సూచింపఁ గల్గియుండ నృత్యము క్షణక్షణచాంచల్యమాన దశావిపర్యయమునుగూడ సూచింపఁ జాలియుండును.

కావ్యము రసాత్మకమయినది. ఇది శ్రవణేంద్రియమున కపారప్రీతి కలిగించి మనస్సు నధికముగా నాకర్షించును. ఇతర లలితకళలం దెచ్చటనులేని వాక్సాహాయ్యము దీనికిఁ గలదు. ఈ సాహాయ్యముచే గవి దృశ్యములను సమగ్రముగా వర్ణించి వానిని బతితల మనఃఫలకముల సాక్షాత్కరింపఁ జేయును ఈ విధముగా నిందు సంగీతమును జిత్రలేఖనమును మిశ్రితములై యుండి మానసమున కమేయానందము సందించుచున్నవి. కవి వాక్కుల సాయమున బమ్మెరపోతనవలె దివ్యసంగీతమును వినిపింపఁగలఁడు. తిక్కనామాత్యునివలె క్షణక్షణముమార్పు చెందుచుండు దృశ్యముల దశావిన్యాసములను జక్కగాఁ జిత్రింపఁగలఁడు. వాక్ప్రభావ మింతింతని చెప్పనలవికాదు. ఈ వాక్కే లలితకళలలోఁ గావ్యమున కగ్రస్థాన మొసంగుచున్నది,

సప్తసంతానములందే కాక లలితకళలలోఁ గూడఁ బ్రశస్తిగాంచి క్షీణము గాకుండ శాశ్వతముగా నుండునది కవిత్వమే. సంగీతనాట్యములు రెండునుదత్కర్తలు పాడుచుఁ బ్రదర్శించుచు నుండునంతకాలమే మన కానంద మొసంగఁ జాలును. చిత్రలేఖనము కాలక్రమమున మాసిపోవుట కవకాశమున్నది శిల్పము శిలామయమగుటచేఁ గొంత దీర్ఘకాల ముండఁజాలినను శాశ్వతము మాత్రము కాదు. కవిత్వము శబ్దమయమగుటచేఁ బ్రపంచమున శబ్దముండునంతకాల మక్షరమైయుండఁజాలును. ఈవిధముగా శాశ్వతత్వమునుబట్టి చూచినను లలితకళలలోఁ గవిత్వమునకే యగ్రస్థానము.

నాటకముకూడ నొక కావ్యభేదమే. కాని యిది దృశ్యకావ్యము, శ్రవ్య కావ్యములలో శ్రవణేంద్రియమునకుఁ బ్రీతి సంధించు శక్తియే హెచ్చు. దృశ్య కావ్యమగు నాటకము చక్షుః శ్రవణేంద్రియములు రెండింటికిని సంపూర్ణమైన

యానందము చేకూర్చును. ఇది లలితకళలైదును ఏకత్ర మూర్తీభవించియుండు సమాహారకళ. శ్రవ్యకావ్యములలో మనోనయనమాత్ర గోచరములగు దృశ్యములు దృశ్యకావ్యములందుఁ జర్మచక్షువులకుఁ గూడ గోచరించి యింతిం తన రాని సంతోషము సంతరించును. అందుచేతనే లలితకళలలోఁ గావ్యమునకువలెఁ గావ్యములలో నాటకమున కగ్రతాంబూలము లభించుచున్నది

# 2. కావ్యసోపానము

## 1. కావ్యస్వరూప నిర్వచనములు.

కవి శబ్దము మొదట వేదములందుఁ బరమాత్మ పరముగా వాడఁబడినది తరువాత నది పరమాత్మ సాక్షాత్కారము నందిన ఋషులకు వాడఁబడినది. వేద మంత్రములను దర్శించిన మహర్షులు కవులు. వారి కావ్యము లుపనిషదాదులు. లౌకికకావ్యములైన రామాయణ మహాభారతములను రచించిన వాల్మీకియు వ్యాసుఁడును గూడ ఋషులే. వారు దివ్యదృష్టిచే ప్రపంచరహస్యము లారసి, లోకజ్ఞులై, లోకోత్తర వర్ణనాత్మకములైన మహాకావ్యములు రచించిరి. ఆరంభమున వేదములదర్శించినవారు ఋషులగుటచేతను, తరువాత లౌకిక కావ్యములను రచించినవారుగూడ ఋషులే యగుటచేతను, ఋషి కానివాఁడు కావ్యము రచింపఁ జాలఁ (నాఽనృషిః కురుతే కావ్యమ్) డనియుఁ, గవి క్రాంతదర్శి యనియు నానుడు లేర్పడినవి. క్రాంతదర్శి యనఁగాఁ జర్మచక్షువుల కతీతములైన విషయములను గూడఁ జూడఁజాలిన వాఁడని యర్థము.

దర్శనమాత్రముచే నెవ్వరును గవులు కాఁజాలరు. ముందు దర్శించి తరువాత దర్శించిన దానిని వర్ణింపవలయును. దర్శనవర్ణనములవలన లోకమునఁ గవి యను ప్రసిద్ధికలుగుననియు (దర్శనా ద్వర్ణనాచ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః) ద్రష్టయైన వాల్మీకి వర్ణనానంతరమే (రామాయణ రచనానంతరమే) కవియను యశస్సు నార్జించెననియు, భట్టతౌతుఁడు చెప్పియున్నాఁడు. ప్రతిభాశాలియై నిపుణముగా వర్ణించువాఁడే కవియని భామహుని యభిప్రాయము. ప్రతిభావంతుఁడుకాని వస్తువులను లెస్సగా దర్శింపఁ జాలఁడు. వస్తువులను లెస్సగా దర్శించినవానికిఁ

గాని వానిని జక్కఁగా వర్ణించుశక్తి సమకూఁడదు కావున వస్తువులను దర్శించుట, దర్శించిన వస్తువులను వర్ణించుట కవియొక్క ముఖ్య లక్షణములు.

కవనీయము (వర్ణనీయము) కావ్యము. లోకోత్తర వర్ణనా నిపుణుడైన కవి కర్మ కావ్యమని మమ్మటుడు. లోకోత్తర వర్ణనా నైపుణ్యము ప్రతిభైకసాధ్యము. ప్రతిభ దేవతానుగ్రహ సంపాద్యము. దేవతానుగ్రహము తపస్సంపాద్యము. తపస్సు ఋషి వ్యాపారము అందుచేతనే ఋషి కానివాఁడు కావ్యము నిర్మింపఁ జాలఁడనుమాట కలిగినది కావ్యాంగముగాని శబ్దముగాని, న్యాయము గాని, విద్యగాని, కళగాని లేదు. అందుచేఁ గవిపై మహత్తరభారమున్నది[1]. కవి కాకపోవుటతో నధర్మమేమియులేదు అందువలన మృతిగాని శిక్షగాని కలుగ నేరదు కాని కుకవిత్వము మాత్రము సాక్షాన్మరణమే[2]. కుకవిత్వము చెప్పుటకంటె నసలు కవిత్వము చెప్పకుండుటే మేలని దీని యభిప్రాయము.

కవికర్మ కావ్యమని తేలినది, ఇంక దాని స్వరూపము నారయుదము. కావ్యము నొకవ్యక్తితోఁ బోల్చి పూర్వలాక్షణికులు దాని స్వరూపము నిర్ణయించుటకు యత్నించిరి వ్యక్తికివలెనే కావ్యమునకుఁ గూడ దేహాత్మలు గుణాలంకారములు మున్నగునవి యుండును. ప్రాచ్య లాక్షణికుల కాద్యుడైన భరతుఁడు కావ్యమున కితివృత్తము శరీరమనియు రసము తత్సౌందర్య హేతువనియు నుడివెను. క్రీ.శ. ౫వ శతాబ్దికిఁజెందిన భామహుఁడు శ్రవ్యకావ్యముఖ్యముగా నెంచి "సహితములైన శబ్దార్థములు" కావ్యమని చెప్పెను. ఇతని యభిప్రాయము ననుసరించి శబ్దార్థయుగళమే కావ్యశరీరము. అలంకారములు దీనికి సౌందర్యము కలిగించును

క్రీ.శ. ౬వ శతాబ్దియందలి దండి "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన పదసమూహమే" కావ్యమని చెప్పెను. రమణీయమైన యర్థముతోఁ గూడిన పదముల

---

1. న స శబ్దో న స న్యాయో న సా విద్యా న సా కళా
జాయతే యన్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః

2. నాకవిత్వ మధర్మాయ మృతయే దండనాయ చ
కుకవిత్వం పునః సాక్షాత్ మృతి మాహు ర్మనీషిణః.

సమూహము కావ్యమని దీని యర్థము. ఇష్టార్థవ్యవచ్ఛిన్నమను విశేషణము వాడినను ఇతఁడు పదసమూహమునకే యెక్కువ ప్రాధాన్య మొసంగెను. ఇతని మతమునఁ బదసమూహమే కావ్యశరీరము. గుణములు తత్సౌందర్య హేతువులు

క్రీ. శ. ౯వ శతాబ్దివాఁ డగు వామనుడుఁ గుణములచే నేర్పడు రీతి కావ్యాత్మ యనియు నలంకారములు తత్సౌందర్యపోషకము లనియు నుడివెను. ఇతఁడు భామహు ననుసరించి శబ్దార్థముల సమాహారమే కావ్యశరీరమని యభిప్రాయపడెను.

ధ్వన్యాలోక కర్తయైన యానందవర్ధనుఁడు కావ్యశరీరమునుగూర్చి యిద మిత్థమని చెప్పియుండలేదు. కాని తరువాతి వ్యాఖ్యాతలు కొందఱు శబ్దార్థయుగళమును గొందఱు చారుత్వాతిశయముతోఁ గూడిన విశిష్టార్థమును బ్రకాశింపఁ జేయు శబ్దమును అతఁడు కావ్యశరీరముగాఁ జెప్పిన ట్లూహించిరి. ఇందలి రెండవ యభిప్రాయమునకును దండి యభిప్రాయమునకును భేదమేలేదు లోచనకర్తయైన అభినవగుప్తుఁడు కూడ శబ్దమే కావ్యశరీర మని భావించెను.

తరువాతి లాక్షణికులలోఁ బ్రధానులైన మహిమభట్టు, కుంతకుఁడు మున్నగువారు శబ్దార్థయుగళమే కావ్యశరీరమని సూచించిరి. రసగంగాధర కర్తయైన జగన్నాథుఁడు దండివలె శబ్దమునకే ప్రాధాన్య మొసంగెను.

శబ్దార్థములు రెండును అవినాభావసంబంధమును కలిగియుండు ననుమాట నిజమే అందుచేతనే కాళిదాసు పార్వతీపరమేశ్వరులను "వాగర్థా వివ సంపృక్తౌ" అని వర్ణించెను. కాని శబ్దము కావ్య బహిస్స్వరూపమును మాత్రమే సూచించును, అర్థము దాని యాంతరప్రవృత్తిని సూచించును లాక్షణికులు కావ్యాత్మ యని చెప్పిన రసాలంకారగుణరీతిధ్వన్యనుమానౌచిత్యాదు లన్నియు నర్థము నాశ్రయించినవే అందుచేఁ గావ్య బహిస్స్వరూపము శబ్దమే యనియు వ్యక్తిసామ్యమునుబట్టి చూచినచో నదే కావ్యశరీరమగు ననియు నూహింపవచ్చును.

మన లాక్షణికులు పలువురు కావ్యమును బలువిధముల నిర్వచించియుండిరి. అందుఁగొన్ని ముఖ్యములైనవి క్రింద నొసంగబడుచున్నవి.

సహితములైన శబ్దార్థములు కావ్యము (భామహుడు). ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన పదావళి కావ్యము. (దండి). గుణాలంకార యుక్తములైన శబ్దార్థములు కావ్యము (వామనుఁడు). అదోషములు. సగుణములు. సాలంకారములు అయిన శబ్దార్థములు కావ్యము. అవి యొక్కొక్కప్పు డనలంకారములుగూడఁ గావచ్చును (మమ్మటుడు) రసాత్మకమైన వాక్యము కావ్యము (విశ్వనాథుఁడు.) నిర్దోషము గుణాలంకార రసవంతము నగు వాక్యము కావ్యము (భోజరాజు.) గుణాలంకారరీతి రసోపేతమైన సాధుశబ్దార్థ సందర్భము కావ్యము పీయూష వర్షుడు ) రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యము (జగన్నాథుఁడు ) రసాలంకారయుక్తము సుఖవిశేషసాధనము నైనది కావ్యము (కేశవమిశ్రుఁడు)

పై నిర్వచనములలో దేహాత్మలతోఁ గూడిన కావ్య సమగ్రస్వరూపము చెప్పఁబడినది ఈ నిర్వచనములను గావించునప్పు డాయా లాక్షణికులు తమకుఁ బూర్వమందుండిన లాక్షణికులు చెప్పిన వానియందలి దోషములను జూపి యంతకంటె నుత్తమమైన నిర్వచనమును జెప్పుటకు యత్నించిరి. ఆ యభిప్రాయములు దిఙ్మాత్రముగా నిట సూచింపఁబడుచున్నవి.

దండి మనోహరార్థ సమలంకృతమైన పదసమూహము కావ్యమని చెప్పి యందల్పమైన దోషమును గూడ నుపేక్షింపరాదని భావించెను. మమ్మటుఁడు శబ్దార్థ యుగళము కావ్యమని చెప్పి యా శబ్దార్థములు సగుణములు నిర్దోషములు సాలంకారములునై యుండవలెనని సూచించెను. ''అనలంకృతే పునః క్వాపిః'' యనుటవలన నొకానొకచో నలంకారములు స్ఫుటముగా లేకున్నను గావ్యత్వమునకు హానిరాదని వ్యాఖ్యాత సూచించెను. దండిమమ్మటు లిరువురును గావ్యము నిర్దోషమై యుండవలెనని నొక్కిచెప్పిరి. మమ్మటుఁడది యదోషమై యుండుటే కాక సుగుణము సాలంకారమునై కూడ నుండవలెనని భావించెను.

లోకమున దోషరహితమైన కావ్య మేదియు నుండదనియు. సదోషత్వమే కావ్యమునకుఁ బ్రధానలక్షణమైనచో ధ్వనిప్రాధాన్యమునుబట్టియుత్తమకావ్యములు గావలసినవి పెక్కులు కావ్యములే కాకపోవలసి వచ్చుననియుఁ జెప్పి పై వారి యభిప్రాయములను విశ్వనాథు డాక్షేపించెను. మఱియు నతఁడు రసము కావ్యమున కాత్మభూతమని యంగీకరించి నప్పుడు గుణములు లేనిచో రస ముండదు కావున

గావ్యము సగుణమై యుండవలెనని వేఁతే చెప్పనక్కఱలేదని భావించెను. అలంకారములు గుణములవలె రసధర్మములు కాకపోవుటచే నలంకారములు లేకున్నను గావ్యము రసవంతము కావచ్చుననియు, నందుచేఁ గావ్యము సాలంకారమైయుండ వలె ననుటయు ననవసరమే యనియు నతఁడు తెలిపి రసాత్మకమైన వాక్యము కావ్యమను నిర్వచనము కావించెను.

జగన్నాథుఁడు మమ్మట విశ్వనాథుల నిర్వచనముల రెంటిని ఖండించెను. లోకమున "ఈ కావ్యము దుష్ట" మను వ్యవహారముండుటచే దుష్టత్వము కావ్యము నకు హానిచేకూర్పదనియు గుణాలంకారసహితములు కాకున్నను వ్యంగ్యార్థ భూయిష్ఠములై యుత్తమకావ్యము లనిపించుకొనునవి పెక్కుండుటచేఁ గావ్యము సాలంకారము సగుణమునై యుండవలె ననుట వ్యర్థమనియు నాతఁడు మమ్మటుని నిర్వచనము నధిక్షేపించెను. రసాత్మకమైన వాక్యమే కావ్య మన్నచో రస స్పర్శలేని వస్త్వలంకారధ్వనియుక్తములైన కావ్యములు కావ్యములు కాకపోవలస వచ్చుననియుఁ, బ్రాచీనులు కపిబాల విలాస జలపాతాదులనుగూర్చి వర్ణించిన వస్త్వలంకారధ్వని ప్రధానములైన కావ్యములు పెక్కుగలవనియుఁ దెల్పి యతఁడు విశ్వనాథుని నిర్వచనమును గూడ ఖండించెను. రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యమని జగన్నాథుని నిర్వచనము. దీనికిని దండి నిర్వచనమునకును భేదమేమియు లేదు.

మన లాక్షణికులవలెనే పాశ్చాత్య విమర్శకులు కూడఁ గవిత్వమును నిర్వచింప యత్నించియుండిరి. వారు రసధ్వన్యలంకారాదులనుగూర్చి ప్రాచ్య లాక్షణికులవలె స్పష్టముగా నిశితముగాఁ బరిశీలనము చేయనప్పటికిని వారు కావించిన నిర్వచనములలోఁ గొన్ని యలంకారమతమునకును, గొన్ని రసమతమునకును జెందినట్లు కన్పించును. గోల్డుస్మిత్తు, జేహన్సు మొదలగువా రలంకారమతమున కును. వర్డ్సువర్తు, జాన్‌కేబెల్ మొదలైనవారు రసమతమునకును సంబంధించిన వారని చెప్పవచ్చును. మొదటి తెగవారు కావ్య బహిస్స్వరూపమును మాత్రమే చెప్పియుండ రెండవ మతమువారు దానియాంతరిక స్వరూపమునుగూడ భావించినట్లు గోచరించును.

భావనావ్యక్తీకరణమే కవిత్వము (The expression of imagination.) భావన కొకవిధమైన భ్రాంతిని గలిగించునట్లు పదముల నుపయోగించు

కళయే కవిత్వము ( The art of employing the words in such a monner as to produce an illusion on the imagination.) సౌందర్యమును గణబద్ధముగా సృజించుటయే కవిత్వము (The rhythmic creation of beauty) అనునవి మొదటి తెగవా రొనరించిన నిర్వచనములు. ఆవేశ మప్రయత్నముగా మూర్తీభవించియుండు పదములును భావములునుగాక కవిత్వ మనఁగా వింకేమియని జాన్ స్టూవర్ట్ మిల్ సూచించియుండెను[1]. శక్తిమంతములగు భావములు సహజముగా నుప్పొంగుటయే కవిత్వమని వర్డ్సువర్తు[2]ను, ఉప్పొంగి పోవు భావప్రవాహమునకుఁ బరీవాహమే కవిత్వమని[3] జాన్ కెబెల్ అనువాదుఁడును గవిత్వమును నిర్వచించియుండిరి. ఈ నిర్వచనములు క్రౌంచద్వంద్వ వియోగోత్థమైన యాదికవి శోకమే శ్లోకత్వ మందెనను నానందవర్ధనుని భావమునకుఁ బ్రతిబింబముగా నున్నవి ఇందు రసపిద్ధాంతము పూర్తిగా వ్యక్తము చేయఁబడ కున్నను దాని ఛాయలు మాత్రము గోచరించుచున్న వనుటలో సందేహములేదు.

ఈ విధముగాఁ బ్రాచ్యలాక్షణికులును బాశ్చాత్య విమర్శకులును గావించిన నిర్వచనములలోఁ గావ్యముయొక్క దేహాత్మలు రెండును స్పృశింపఁబడినవి. కొందఱు శబ్దార్థములు రెండునుగలసి కావ్యమనిరి; మఱికొందఱు విశిష్ట లక్షణములు గల శబ్దమే కావ్యమనిరి. మొదటివారు కావ్యముయొక్క బహిరంతః స్వరూపములు రెండింటిని జతచేసిరి. రెండవవారు బహిస్స్వరూపమునుమాత్రమే వ్యక్తము చేసిరి. సూక్ష్మముగాఁ బరిశీలించినఁ బై యిరు తెగల వారి యభిప్రాయములును యథార్థములే.

## 3. కావ్య హేతువులు :

భగవంతుని సృష్టిలో మానవునికిఁ గల విశిష్టత కితర జీవులకు లేని జ్ఞానమాతనికిఁ గల్గుటయే కారణము. ఇట్టి జ్ఞానము పుష్కలముగా నున్నను మానవు

1. What is poetry but the thoughts and words in which emotion spontaneously embodies itself.
2. Poetry is the spontaneous overflow of powerful feelings.
3. Poetry is a vent for over-charged feelings.

ఎల్లరును కవులు కాఁజాలరు. కవితా కౌశల మబ్బుటకుఁ గొన్ని హేతువు లుండ వలయును. వీనినే సంస్కృత లాక్షణికులు కావ్య హేతువులని పేర్కొనియుండిరి.

> శక్తి ర్నిపుణతా లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
> కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతిహేతు స్తదుద్భవే.

అని కావ్యప్రకాశమున కావ్య హేతు వుగ్గడింపఁబడినది. శక్తి, లోకమును శాస్త్రములను గావ్యాదులను జూచుటవలనఁ గలుగు నైపుణ్యము, కావ్య తత్త్వము నెఱుంగు పెద్దల శిక్షను బొంది తదనుగుణముగా నభ్యాస మొనర్చుట అను మూఁడును కలసి కావ్య హేతువని దీని భావము "ఇతి హేతు స్తదుద్భవే" అని యేకవచనము వాడుటచే నీమూఁడును భిన్న భిన్న హేతువులు కావనియు, నీమూఁడింటి కలయిక వలన నేర్పడిన గుణ విశేషమే కావ్యోత్పత్తికి హేతు వనియు వ్యక్త మగుచున్నది. ఇందలి శక్తి నభినవగుప్తుఁడు ప్రతిభ యని పేర్కొనియది అపూర్వ వస్తునిర్మాణ క్షమమైన ప్రజ్ఞయని నిర్వచించి యుండెను. భామహుఁడు నవనవోన్మేష శాలినియైన ప్రజ్ఞయే ప్రతిభ యని వక్కాణించెను ఈ ప్రజ్ఞగల మానవుఁడు లోకోత్తర చమత్కారకారియైన కావ్యమును సృష్టింపఁజాలును. ఇది లేనిచో నితర గుణము లెన్ని యున్నను ఉత్తమ కావ్య రచనాదక్షత కలుగ నేరదు. అందుచేతనే "కావ్యం తు జాయతే జాతు కస్యచి త్ప్రతిభావతః" అని భామహుఁడు చెప్పియుండెను. ఈ ప్రతిభ కావ్య హేతువులో నేకదేశము.

కావ్య హేతువులోని రెండవ భాగము నిపుణత. తాము నివసించు లోకములోని వ్యక్తులను వస్తువులను దత్ప్రవృత్తులనుసూక్ష్మముగాఁ బరిశీలించుట వలనను, శాస్త్రములను శ్రద్ధగాఁ బఠించుట వలనను దనకు ముందు జనించిన మహాకవుల కావ్యములను బఠించుట వలనను మానవులకుఁ గొంత నిపుణత లేదా జ్ఞానము కలుగును. దీనికి వ్యుత్పత్తి లేక పాండిత్యమని పేరు. ఇవి సహజమైన ప్రతిభాశక్తి కనేక విధముల వన్నె చేకూర్చును. ఇది కలవారే విద్వత్కవులు. "విద్వత్కవయః కవయః కేవల కవయ స్తు కేవలం కపయః" అను వాక్యమును బట్టి కావ్యహేతువున వ్యుత్పత్తి కెంత ప్రాముఖ్య మున్నదో తెలియ వచ్చుచున్నది. మానవుఁడెంత ధనసంపన్నుఁడైనను విద్యాభ్యాసము

లేకున్నచోఁ బండితుఁడు కాఁజాలనట్లెంత ప్రజ్ఞావంతుడైనను పాండిత్యములేనిచో నుత్తమ కావ్య నిర్మాణదక్షుఁడు గాఁజాలడు.

కావ్యహేతువు నందలి మూఁడవ భాగము కావ్యజ్ఞులైనపెద్దలశిక్షనుబొంది తదనుసారముగా నభ్యాసము కావించుట. కావ్యజ్ఞులైన పెద్దల శిక్షను బొందుట యొక విధముగా వ్యుత్పత్తిలోనిభాగమే. ప్రతిభాపాండిత్యము లెంత యధికముగా నున్నను అభ్యాసము లేనిచో మానవుఁడు కావ్యము రచింపలేఁడు. ఒకవేళ రచించినను అభ్యాసహీనతచేతనతనికి సరళసుందరమైనశైలి యలవడదు. అనఁగనఁగ రాగ మతిశయిల్లు నట్లును, వ్రాయఁగా వ్రాయఁగా నక్షరముల క్రమము సుందరమగునట్లును, అభ్యాసము చేయఁగాఁ జేయఁగా ధారాళమైన కవిత్వ మలవడును. అందుచేఁ గావ్యహేతువున నభ్యాసమునకుఁ గూడ నుచితమైన స్థానము కలదు.

ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసముల కలయికయే కావ్యహేతువని తేలినది. రూపలావణ్యములవలెఁ బ్రతిభా వ్యుత్పత్తు లన్యోన్య సంబంధము కలిగి యుండు నని రాజశేఖరుడు కావ్యమీమాంసలో జెప్పియున్నాఁడు. పై మూఁడు గుణములను సమాన భాగములుగాఁ గలవారే మహాకవులు కాఁజాలుదురు. అట్లు లేనిచోఁ గావ్యరచనా దక్షత యున్నను అట్టివారు మహాకవి శబ్దమున కర్హులు కాఁజాలరు. కాళిదాసాది సంస్కృతకవుల యందును, నన్నయ తిక్కనాది పూర్వాంధ్రకవుల యందును త్రిగుణాత్మకమైన యీ కావ్యహేతువు సమగ్రముగాఁ గానఁబడును. అందుచేతనే వారు మహాకవులు కాఁజాలిరి. అట్టివారినిగూర్చియే ఆనందవర్ధనుఁడు "అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః" అని నుడివి యుండెను.

కావ్య ప్రకాశమున ప్రతిభకుఁ గారణము విరూపింపఁబడి యుండలేదు. పండితరాయలు దానికిరెండు కారణములను నిరూపించెను. వ్యుత్పత్త్యభ్యాసములు దేవతానుగ్రహము. ఒకానొకఁడు తొలుత ప్రతిభాహీనుడైనను పాండిత్యము సంపాదించిన పిమ్మటఁ బ్రతిభాశాలియై కావ్యరచన కావింపజాలుచున్నాఁడు. ఇచ్చట నతని ప్రతిభకు వ్యుత్పత్త్యభ్యాసములే కారణములని చెప్పవచ్చును. ఒకానొకఁడు వ్యుత్పన్నుఁడు కాలేకపోయినను దేవతాప్రసాదమువలన నపూర్వమైన ప్రతిభకుఁ దావలమై మహాకావ్య రచనాదక్షుఁ డగుచున్నాఁడు. కాళిదాసు, తెనాలి రామకృష్ణుడు మున్నగువారినిగూర్చి లోకమునఁ బ్రచారమున నున్న

కథ లిందుకుఁ దార్కాణములు. ఇచ్చటఁ బ్రతిభ దేవతా ప్రసాద లబ్ధమైనది. కారణమైన ప్రతిభ యందలి ద్వైవిధ్యమును బట్టి కార్యమైన కవిత్వ మందును ద్వైవిధ్య మేర్పడును.

రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ శ్రేష్ఠమని యానందవర్ధనుఁ డభిప్రాయ పడినట్లు సూచించెను. దేవతా ప్రసాద లబ్ధమైన ప్రతిభ వ్యుత్పత్తి కృతమైన దోషమును మఱుగు పుచ్చఁజాలును.

అవ్యుత్పత్తి కృతో దోషః శక్త్యా సంవ్రియతె కవేః
య స్త్వశక్తికృత స్తస్య ఝుడిత్యే వావభాసతే.

వ్యుత్పత్తి లోపముచేఁ గలుగు దోషము ప్రతిభచేఁ గప్పి వేయఁబడును. ప్రతిభాలోపముచేఁ గలుగునది వెంటనే బయలుపడునని దీని యర్థము దీని వలన వ్యుత్పత్తి కంటెఁ బ్రతిభయ వ్యుత్పత్త్యభ్యాసజనితమైన ప్రతిభ కంటె దేవతా వర ప్రసాద లబ్ధమైన ప్రతిభయు నెక్కువ శ్రేష్ఠములని వ్యక్తమగు చున్నది. ఈ ప్రతిభా గుణసంపదచేతనే పరిచిత పూర్వములైన వస్తువులైనను గావ్యమున నిత్య నూతనములుగా గోచరించుచున్నవి. కవియై పుట్టిన వానియందే యీ గుణ విశేషము పుష్కలముగాఁ గానిపించు చుండును.

## 2. కావ్యాత్మ :

సాధారణముగాఁ గావ్యమును గాంతతోఁ బోల్చుచుందురు. కాంతకు దేహ గుణభూషణాదులన్నియు సౌందర్యవహములేయైనను అందు ఆత్మ లేదా ప్రాణము ప్రధానమైనది. అది లోపించినచో వితరాంగము లెన్ని యున్నను సౌందర్యము సిద్ధింపదు. కావ్యాంగములైన రసాలంకార గుణాదులలో నాత్మ స్థానీయ మేదను విషయమునఁ బూర్వకాలమునుండియు లాక్షణికులలో భిన్నాభిప్రాయములు గోచరించుచున్నవి. తేనె యెల్లరకును మధురముగానే యుండునట్లు కావ్యాస్వాదము కూడ నెల్లరకు నానందదాయకముగనే యుండును. కాని యీ యానందానుభూతిని మాటలతో వ్యక్తము చేయవలసి వచ్చినప్పుడు మతభేదము లుత్పతిల్లినవి.

నుపయోగింప వలెననియుఁ దెల్పి రసము నెడనే యించుక మ్రొగ్గుచూపి యున్నాఁడు. అగ్నిపురాణమున నంతకుఁ బూర్వమున్న మతములన్నియుఁ గ్రోడీకరింపఁబడి యున్నవి. దాని వలనఁ దత్కర్తకు గల ప్రత్యేకాభిప్రాయ మేమో తేల్చి చెప్పుటకవకాశములేదు

గావ్యాత్మవిషయమును నిశితముగాఁబరిశీలించి, తనకుఁ బూర్వము వెలసిన మతముల నన్నిటిని సమన్వయించి, సర్వ సమ్మతమైన ధ్వని సిద్ధాంతమును నెల కొల్పినవాఁ డానందవర్ధనుఁడు. ఇతని లక్షణ గ్రంథము ధ్వన్యాలోకము. గావ్య శరీరమున కాత్మ ధ్వని యనియు, నది రసాలంకార ధ్వన్యాత్మకమై మూఁడు విధములుగా నుండుననియు నితఁడు ధ్వన్యాలోకమున నిరూపించెను. ఇతని మతమున గుణాలంకార రీత్యాదు లంగి యగు ధ్వని కంగభూతములు ప్రాణ మున్నప్పుడే శరీరమున కలంకా రాదులు సౌందర్య హేతువు లగునట్లు కావ్య మునందుఁగూడ ప్రాణ భూతమైన ధ్వని యున్నప్పుడే యలంకారాదులు దానికి సౌందర్య మాపాదించునని యితని యభిప్రాయము రూపకములందువలె శ్రవ్య ములందును రసమే ప్రధానమని యితఁడు సూచించి రస మలంకార మాత్రము కాదనియు, నది కావ్యజీవిత మనియు, నది వాచ్యముగాఁ గాక వ్యంగ్యముగా నుండవలెననియు, రసదోషములను వర్జింపవలెననియు, రసవ్యంగ్యమువలె వస్త్వలంకార వ్యంగ్యములు కూడ గ్రాహ్యములే యనియు వివరించెను. ఇతని మతము రససిద్ధాంతమునకు వ్యాఖ్యానము వంటిదేకాని తద్వ్యతిరేకి కాదు

ధ్వన్యాలోకమునకు లోచన మను వ్యాఖ్య రచించిన వాఁడభినవగుప్త పాదుఁడు. ఇతఁడును ఆనందవర్ధనునివలె ధ్వని ప్రాధాన్య వాదియేకాని యితఁడు వస్త్వలంకారధ్వనుల కంటె రసధ్వని కెక్కువ ప్రాధాన్యమొసంగెను. "రసము చేతనే సర్వ కావ్యములు జీవించును. రసములేని కావ్య ముండదు. రసమే ఆత్మ. వస్త్వలంకార ధ్వనులు కూడ రసపర్యవసాయులే" అని యాతని వాక్యములు. విశ్వనాథుఁడు కూడ నితనివలెనే రసస్పర్శలేని వస్త్వలం కారధ్వను లుండవని భావించెను.

అభినవగుప్తుని యనంతరము ధ్వని సిద్ధాంతమును ఖండించుచు మహిమ భట్టు వ్యక్తివివేకమును రచించెను. ఇతఁ డానందవర్ధనుఁడు చెప్పిన వ్యంజనా

వృత్తి యనవసర మనియు, నతవి ధ్వను లన్నియు ననుమానములోనే యంతర్భవించుననియు. నీయనుమానము ధూమాగ్న్యనుమానము కంటె భిన్నమైన కావ్యానుమితియనియు వివరించెను. ఇతఁడు ధ్వనివాదమును ఖండించినను గావ్యమున కాత్మ రసాదిరూప మనుటలో విప్రతిపత్తి లేదని యంగీకరించెను. ఇతని మతమున రస మనుమితమే కాని యభివ్యక్తము కాదు.

ప్రతిహారేందురా జుద్భటుని కావ్యాలంకారమునకు వ్యాఖ్యానము రచించినవాఁడు. ఇతఁ డుద్భటుని యలంకారమతమును బలపఱిచెను. ఇతని మతమున ధ్వని కూడ నొక యలంకారమే. భట్టనాయకుఁడు ధ్వని సిద్ధాంతమునకుఁ బ్రతిపక్షి యైనను రస సిద్ధాంతమున కనుయాయియే. ఇతఁడు రసానుభూతికి ధ్వని కారుఁడు చెప్పిన వ్యంగ్యముకాక భావనాభోగీకృతులను మఱి రెండు ప్రక్రియలు కారణములని యభిప్రాయపడెను. దశరూపకకర్తయైన ధనంజయుఁడును తద్వ్యాఖ్యాతయైన ధనికుఁడును రసమతమునకుఁ జెందినవారే. వారు కావ్యమునకును దర్శితమైన రసమునకును వ్యంగ్య వ్యంజక భావము కాక భావ్య భావక సంబంధమని భావించిరి.

అభినవగుప్తునికి సమకాలికుఁడైన కుంతకుఁడు వక్రోక్తి ప్రాధాన్యవాది. ఇతని గ్రంథము వక్రోక్తి జీవితము. భామహుని వక్రోక్తి నితఁడు కవి వ్యాపార వక్రత యని పేర్కొని యది వర్ణవిన్యాస, పూర్వార్ధ, ప్రత్యయ, వాక్య, ప్రకరణ, ప్రబంధ గతమై యాఱు విధములుగా నుండునని తెల్పెను. అనుమతి మతము వలెనే యిదియు నెక్కువగాఁ బ్రచారము పొంది యుండలేదు.

కుంతకుని యనంతరము క్షేమేంద్రుఁడు '' అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగస్య కారణ'' మ్మను ధ్వన్యాలోక కారికను బీజముగా గ్రహించి రససిద్ధమైన కావ్యమున కౌచిత్యమే జీవితమని ప్రతిపాదించెను. ఇతని గ్రంథ మౌచిత్యవిచార చర్చ. ఔచిత్య సహితములై యుండు నప్పుడే గుణాలంకారాదులు సార్థక్యము వహించునని యితని భావము. ఇతఁడు ధ్వని మతమును బ్రత్యక్షముగా బలపఱుపక పోయినను దానికి విరోధి మాత్రము కాఁడు.

ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతము తరువాత వెల్వరింపఁబడిన నూతన మతములన్నియు దత్కర్తలతోడనే సమసిపోయినవి. పిమ్మట విశ్వనాథ విద్యానాథ జగన్నాథాదులు ధ్వని సిద్ధాంతమునే యంగీకరించి పోషించిరి. 'కావ్యమున కాత్మధ్వని'యను నా సిద్ధాంతమే యిప్పటినికి సర్వపండిత సమ్మతమై నిల్చియున్నది. రస ధ్వనులకుఁ గల ముఖ్య భేద మేమన రసము సహృదయాశ్రయము. ధ్వని కావ్యాశ్రయమునై యుండుటయే. ఈ భేదమును నిరూపించుటలో నానందవర్ధనుఁడు చూపిన నేర్పు నిరుపమాన మైనది. సహృదయుని హృదయమును నాకర్షించి కవి యుద్దేశించిన యానందము నతనిచే ననుభవింపఁజేయు కావ్యగుణమునకే ధ్వని యని పేరు.

## 4. కావ్య ప్రయోజనము :

ప్రతిభావంతులైన కవులు రచించు కావ్యములను సహృదయులైన జనులు పలుమార్లు చదువుచుందురు. లోకమున బుద్ధిమంతు లెవ్వరైన నే పనిని గాని నిష్ప్రయోజనముగా నాచరింపరు. అందుచేఁ గావ్య పఠనము వలనఁ బతిత లేదో యొక ప్రయోజనము నాశింతురని చెప్పక తప్పదు. ఆ ప్రయోజనమేది ?

పూర్వ లాక్షణికులు వాఙ్మయమును వేదము, పురాణము, కావ్యము అని మూఁడు తెఱంగులుగా విభజించి తత్స్వరూప స్వభావములను వివరించిరి. వేదము శబ్ద ప్రధానము. ప్రభు సమ్మతము ప్రభు శాసనమువలె వేద శాసనము కూడ నుల్లంఘించుటకు వీలులేనిది. హేతువాద పూర్వకముగా దానియందలి మంచిచెడ్డలను గూర్చి విమర్శించుటకు మన కధికారములేదు. వేద వాఙ్మయము శబ్ద ప్రధానమగుటచే నందలి శబ్దములను బతిత యిచ్చవచ్చినట్లు మార్పరాదు. ఏలయన షత్వాతాన్యథా పాఠముల వలనఁ బ్రత్యవాయము కలుగును. పురాణము లర్థ ప్రధానములు, మిత్ర సమ్మితములు. అవి వేదము లందుఁ జెప్పఁబడిన యంశములనే సుబోధముగఁ గథారూపమునఁ జెప్పి మిత్రులు వలెఁ గర్తవ్యాకర్తవ్యోపదేశము కావించును. కావ్యము లుక్తి ప్రధానములు, కాంతాసమ్మితములు సాధుశీలయగు కాంత తన రూపగుణ ప్రవర్తనలచే భర్త మనస్సు నావర్జించి సవినయములైన మధురవాక్కులచే పెడత్రోవఁ బట్టు వానిని సన్మార్గమునకు

ప్రిప్పురీతిఁ గావ్యమును శైలీ గుణాలంకారాదులచే, బరిత మనస్సు నాకర్షించి వ్యంగ్యరీతి నాతనికిఁ గర్తవ్యోపదేశ మొనరించును. అందు శబ్దార్థములకుఁ గాక ఉక్తి వైచిత్రికిఁ బ్రాధాన్య మెక్కువ. వేదపురాణ కావ్యములు మూఁడును గావించు కర్తవ్యోపదేశము సమానమే యైనను అవి వానిని జెప్పు రీతిలో భేద మున్నది. వేదములు శాసించును, పురాణములు బోధించును. కావ్యములు రంజించును మూఁడింటను ఉపదేశము సమానమే, కాని రంజనముతోఁ గూడిన యుపదేశము కావ్యము నందలి విశేషము.

పై దానినిబట్టి హృదయమును రంజింపఁజేయుట, ఉపదేశించుట, కావ్య ధర్మము లని తెల్లమగుచున్నది. ఇవి పఠితల కానందోపదేశములను గలిగించును. భామహుఁడు సత్కావ్యము ధర్మార్థ కామ మోక్షములందును గళలయందును, నేర్పును, కీర్తిని, ప్రీతిని గలిగించునని చెప్పియుండెను1. చతుర్వర్గ వ్యుత్పత్తియుఁ, గళాపరిజ్ఞానమును, గీర్తియు, ఆనందమును, గావ్య ప్రయోజన ములని యాతని యభిప్రాయము. కావ్యప్రకాశ కర్తయైనమమ్మటుఁడు కావ్యము వలన యశస్సును అర్థమును, వ్యవహార జ్ఞానమును, అమంగళ పరిహారమును, సద్యః పరనిర్వృతియు, నుపదేశమును గలుగునని చెప్పియున్నాడు.2 పై యిరువురి యభిప్రాయమును గొంచెమించుమించుగా నొక్కటే. పరనిర్వృతి యనఁగా బరమానందము. దీనినే భామహుఁడు ప్రీతియని పేర్కొనెను. అతఁడు కళాచతుర్వర్గ వ్యుత్పత్తియని చెప్ప మమ్మటుఁడు దానికి బదులు వ్యవహార వేత్తృతా శివేతరక్ష త్యుపదేశములను జేర్చియుండెను. కీర్తి రెండింటను సమానమే. ఆంగ్లేయులుకూడ నుపదేశానంద ప్రదానములే కావ్య ప్రయోజనము లని నుడివి యుండిరి.

ఈ విధముగా నానందోపదేశములు రెండును గావ్య ప్రయోజనము లని సాధారణముగా నెల్లరు నంగీకరించినను మరల నా రెండింటిలో దేనికిఁ బ్రాధాన్య

---

1. ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యం కళాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధు కావ్య నిషేవణమ్.

2. కావ్యం యశసేఽర్థ కృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితత యోపదేశయుజే.

మను విషయమున ద్వైవిధ్యము కానవచ్చుచున్నది. అభినవగుప్తుడు 'ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్య'' మను నుక్తి ననుసరించి కావ్యమువలన శ్రోతలకు వ్యుత్పత్తి కలుగుచున్నప్పటికిని ప్రీతియే ప్రధానమైనది. అట్లుకానిచో ప్రభుసమ్మితములైన వేదములకంటెను, మిత్రసమ్మితములైన పురాణములకంటెను, కావ్యరూపమైన యీ వ్యుత్పత్తి హేతువుయొక్క జాయా సమ్మితత్వ లక్షణమైన విశేషమేమి? అందుచే ప్రధానముగా ఆనందమే ప్రయోజనమని చెప్పఁబడినది. చతుర్వర్గవ్యుత్పత్తికిఁ గూడ నానందమే పార్యంతికమైన ఫల' మని చెప్పియున్నాఁడు. కావ్య శ్రవణ సమనంతరమే కలుగు రసాస్వాదన ముద్భూతము విగళితవేద్యాంతరమునైన యానందమే సకలప్రయోజనమౌళిభూతమైనదని యాతని యభిప్రాయము. దశరూపకకర్త ''ఆనంద నిష్యందులైన రూపకములకు నితిహాసాదులకువలె వ్యుత్పత్తియే ఫలమని చెప్పు రస పరాఙ్ముఖునికొక్క నమస్కార'' మని తెల్పి యానందమునకే ప్రాధాన్యము ప్రకటించినాఁడు. తిక్కన సోమయాజి ''కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ'' నని చెప్పుటలోఁ గూడ నానంద ప్రాధాన్యమే స్ఫురించుచున్నది.

ఆనందవర్ధనుఁడు భరతాది మునులు పామరజన హితార్థమే సదాచారోపదేశ నిబంధనమైన నాటకాది గోష్ఠి నవతరింపఁజేసినారని చెప్పియున్నాఁడు. ''నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్''. ''ఈ బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్'' అను వాక్యములందలి జగద్ధితమనుమాట యుపదేశ ప్రాధాన్యమునే యుగ్గడించుచున్నది ఆంధ్ర శబ్ద చింతామణి కర్త ''విశ్వశ్రేయఃకావ్య'' మ్మని చెప్పుటలోఁ గూడ నుపదేశ ప్రాధాన్యము వ్యంజిత మగుచున్నది. ''కావ్యాలాపాంశ్చ వర్జయేత్'' అను స్మృతివాక్య మొకటున్నది. ఇందలి కావ్యము క్షుద్రకావ్య పరము. నీతి ధర్మముల నుపదేశింపని కావ్యములు రసవంతములయ్యును బరిత్యాజ్యములే యని పై స్మృతి వాక్యము సర్థము విద్యానాథుఁడు కావ్య ముత్తమపురుష చరిత నిబంధన పూర్వకమై యుండవలెనని చెప్పుటయు నుపదేశ పక్షపాతముచేతనే. ఏలయన నుత్తమపురుషుల చరిత్రలు మాత్రమే యుపదేశకరణదక్షములై యుండఁ జాలును. పాశ్చాత్యులలో లావెల్ అనునతఁడు ''ఏదోయొకవిధమునఁ దత్త్వబోధ

చేయని కావ్యమును నేను మన్నింపఁజాల'' నని చెప్పియున్నాడు. ఈ విధముగాఁ గావ్యమున నుపదేశమునకుఁ గూడ నున్నతస్థాన మిచ్చువారు కొందఱున్నారు.

నిజముగాఁ గావ్యము వలన నొక్క యుపదేశమే వాంఛితవ్య మగుచో నది వేదశాస్త్రముల వలననే లభించునుగదా! అందుకు వేఱే కావ్యమేల? యను ప్రశ్న యుదయించును. దానికి సాహిత్య దర్పణకారుఁ డిట్లు సమాధానము చెప్పు చున్నాడు. ''వేదశాస్త్రముల వలనఁ జతుర్వర్గ ఫల ప్రాప్తి నీరసముగా నతిక్లేశ పూర్వకముగాఁ బరిణత బుద్ధులకు మాత్రమే కలుగు చున్నది. పరమానంద సందోహజనకమైన కావ్యము వలన నైనచో నది సుకుమార బుద్ధులకు నైతము సుఖముగాఁ గలుగుచున్న'' దని యా సమాధానము. దీనిని బట్టి వేదశాస్త్రముల వలనఁ గేవల ముపదేశప్రవృత్తులే లభించుమండఁ గావ్యము వలన నానందోపదేశములు రెండును లభించుచున్నవని తెలియుచున్నది. ఆనంద ప్రాధాన్యవాదులు కూడ ''తదేవ కావ్య ముత్కృష్ట ముపదేశైర్వినా కృత'' మ్మని విష్ణుధర్మోత్తర పురాణమువలెఁ గావ్యమున నుపదేశ ముండరాదని పూర్తిగా నిషేధించుటలేదు. ఆనందము ప్రధాన మనియు నుపదేశ మానుషంగిక మనియు వారి యభిప్రాయము. కావ్య మానందముతోపాటుపదేశమును గూడ నొసఁగిన వారి కెట్టి యాక్షేపమును లేదు. కేవల కావ్యముకంటె శాస్త్ర కావ్య ముత్తమమని చెప్పఁబడుట యిందు చేతనే. ఏలయన నది శాస్త్రము వలెఁ బురుషార్థ నిరూపణము చేయుచుఁ గావ్యము వలె రసానంద ప్రధాన దక్షము కూడ నై యుండును.

కాల స్వభావమును బట్టి యొక్కొక్కప్పుడు కావ్య ప్రయోజనము లందలి ప్రాధాన్యము తారుమాఱగుచుండును. జాతి స్వధర్మ భ్రష్టమై పతనోన్ముఖ మగు చున్నప్పుడు కవులు ధర్మమును రమణీయముగా బోధించి జాత్యుద్ధరణ మొనర్చ వలసి యుండును. అట్టియెడఁ గావ్యమునం దుపదేశము ప్రధాన మగుటయు నానంద మానుషంగిక మగుటయు సంభవించును. నన్నయగారి కాలమున వేదమత పునరుద్ధరణమునకుఁ బ్రయత్నములు జరుగుచుండెను. అందుచేతనే యతఁడు తన రచన జగద్ధిత ప్రయోజనమని చెప్పియుండెను. ప్రబంధముల కాలమున జాతి వీర్యవంతమై భోగభాగ్యములతోఁ దులతూగుచుండెను. అందుచే నప్పటికావ్యములలో నానంద ప్రాధాన్యమే గోచరించును. వానియందుపదేశ మప్రధానము.

దక్షిణాంధ్ర యుగమున నప్పటి పరిస్థితులను బట్టి యుపదేశము పూర్తిగా విసర్జింపఁబడుటయే సంభవించెను. దానికిఁ గాల ప్రభావమే కారణము. అట్లే యిటీవలఁ గళ కళ కొఱకే యను సిద్ధాంతము బయలుదేఱెను. అది కుతర్క-మనియుఁ గవిత్వ మభ్యుదయ హేతువు కావలె నన్న విశ్వ శ్రేయస్సాధనమై యుండ వలెననియు కొందఱు వాదించిరి. ✓

దేశకాలములతో సంబంధము లేకుండఁ గావ్య ప్రయోజనము నిర్ణయింప వలెనన్న నానందము ప్రధానప్రయోజన మనియు నుపదేశ మవాంతర ప్రయోజనమనియుఁ జెప్పవలెను. కావ్యము వేదశాస్త్రములకంటె విలక్షణమై యుండుట కందానంద ప్రధాన దక్షత్వ మపరిహార్యము. కావ్య ముపదేశము నొసంగనిచోఁ గావ్యత్వమున కెట్టి భంగమును గలుగదు. కాని యం దానంద ప్రధానమే లోపించినచో నది కావ్యమే కాక పోవును. అది యానందముతో పాటుపదేశమును గూడ నొసంగఁ జాలిన బంగారమునకుఁ బరిమళ మబ్బిన ట్లుండును.

సత్కావ్యమును బఠించునప్పుడు సహృదయుఁడు బ్రహ్మానంద సబ్రహ్మచారియైన యానందము ననుభవించును. కావ్యపఠనము ముగియఁగనే యతఁడు మరల లోక ప్రవృత్తికిఁ గడంగి సుఖదుఃఖములకు లోనగుచుండును. అందుచేఁ గావ్యపఠనావసరమునఁ దాత్కాలికముగనైన నానందసౌఖ్యము చవిచూచిన సహృదయుఁడు శాశ్వతమైన యట్టి యానందమును బొందుటకు యత్నింప వలెను. సత్కావ్యములు సహృదయుల నట్టి ప్రయత్నము చేయుటకై పురికొల్పును. నిజమున కదియే కావ్యముయొక్క పరమ ప్రయోజనము.

## 5. కావ్యము : శాస్త్రము :

ఆంగ్ల మహాకవియైన కోలెరిడ్జి కవిత్వమునకు నిర్వచన మొసఁగుచు "శాస్త్రమునకుఁ గేవల విరుద్ధమైనదే కావ్య" మని చెప్పియున్నాడు "శాస్త్రేష్వపిహి వాః కవయో భవన్తి" "కావ్యేన హన్యతే శాస్త్ర" మ్మను సంస్కృతి మందలి యభియుక్తోక్తులుకూడ శాస్త్రకావ్యములకుఁ గల వైరుధ్యమును ప్రకటించుచున్నవి ఇట్లవి పరస్పర విరుద్ధములుగాఁ గనవ్పట్టుటకు వాని స్వరూప స్వభావములే కారణములు శాస్త్రకారుఁడు సృష్టిని బరిశీలించి యందలి మూలసూత్రములను వస్తు

స్వరూపములను యథాతథముగాఁ బ్రకటించును. అనఁగా వస్తుతత్త్వమును బరిశీలించి సత్యమును బ్రకటించుటయే యాతనిపని. అతఁడు సుందరమైన వస్తువును సుందరముగను, వికృతమైన వస్తువును వికృతముగను మాత్రమే ప్రదర్శించును. కవికిఁ గావ్యమున సత్యమునే చెప్పవలయునను నియమములేదు. వస్తువునందలి తన రుచిని దెల్పుటయే యతని పని గాని రూపస్వభావములను యథాతథముగాఁ జెప్పవలసిన యక్కఱ యతనికిలేదు. సృష్టియందలి వికృత వస్తువులను గూడ నతఁ డతిసుందరములుగాఁ దీర్చిదిద్దును. అందుచేతనే దృష్టపూర్వములైన పరిచిత వస్తువులుకూడఁ గావ్యమున రసపరిగ్రహణముచే వసంత సంపర్కముచే వృక్షములవలె నూతనములుగాఁ గనిపించునని ఆనందవర్ధనుఁడు చెప్పియున్నాడు. శాస్త్రకారుఁడు వ్యుత్పత్త్యనుగుణముగాఁ బరిశీలించి ప్రతిపాదించిన యర్థమని కవి రుచ్యనుగుణముగా గ్రహించి వర్ణించును. సత్యమును దర్శించు శాస్త్రకారుని యందలి ప్రజ్ఞయే కవియందు సౌందర్యదర్శినియు నవనవోన్మేష శాలినియు నగు ప్రతిభ యగుచున్నది.

శాస్త్రకారునికి గుణాలంకారములతోఁ బనిలేదు. అతఁడు తాను గ్రహించిన సత్యమును నగ్నముగాఁ బ్రకటించును. అతనికి వస్తువే ప్రధానము. కవికి వస్తువు కాక యందలి రుచి కనుగుణమైన చిత్తవృత్తియే ప్రధానమగుటచే నతఁడు దాని నలంకార సుందరముగాఁ బ్రకటించును. ఉదాహరణమునకు శాస్త్రకర్త చంద్రుఁ డెఱ్ఱని బింబముతోఁ దూర్పునఁ గనిపించుచున్నాఁడని చెప్పును. ఆ సత్యమునే కవి రక్తుఁడైన చంద్రుఁ డైంద్రీ ముఖమును ముద్దుగొనుచున్నాఁడని వర్ణించును. ఇరువురును జెప్పు విషయ మొక్కటే. కాని కవి సమాసోక్తి చాతుర్యముచేఁ జంద్రుని నాయకత్వమును, తూర్పుదిక్కునందు నాయికాత్వమును, ఎఱ్ఱఁదనమం దనురక్తత్వమును ఆరోపించి రమణీయముగాఁ జెప్పుచున్నాడు. ఈ రామణీయక మంతయుఁ గవి యభూతకల్పనముగా గోచరించును. అందుచేతనే "కావ్య మసత్యములకుఁ గన్నతల్లి" యని కొందఱభిప్రాయపడియున్నారు.

క్షేమేంద్రుఁడు శాస్త్ర సత్యములనుగూడ రమణీయముగాఁ జెప్ప వలెనను నాసక్తి కొందఱు శాస్త్రకర్తలకు లేక పోలేదనియు వారుతిక్తమైన యౌషథము నాస్వాద్యముగాఁ జేయుటకై పంచదారతోఁ గలుపు నట్లు శాస్త్ర విషయములను

గవిత్వముతోఁ గలిపి చెప్పుదు రనియుఁ దెల్పియున్నాఁడు. ఇట్టివానినే శాస్త్ర కావ్యములో కావ్యశాస్త్రములో యందురు. 'కావ్యేన హన్యతే శాస్త్రం' మ్మను మాట యిట్టివాని యెడనే వర్తించును. ఏలయనఁ బఠిత లిందు శాస్త్రవిషయ ముచేఁ గాక కావ్య సౌందర్యముచేతనే యెక్కువగా నాకర్షింపఁబడుదురు.

శాస్త్రకారుని దృష్టిలో వస్తువుల స్వరూప స్వభావములు నియతములు. అతనికిఁ జంద్రుఁ డెప్పుడును శీత దీధితియైన యొక గ్రహముగనే కనిపించును; కవి కతఁడు వివిధరూపములలో గోచరించును ఒకప్పు డతఁడు సుధాకరుఁడు ఇంకొకప్పుడు దోషాకరుఁడు; ఒకప్పుడు తారాపతి; ఒకప్పుడు నిశాపతి; ఒక ప్పుడు ప్రియా ముఖము; మఱొకప్పుడు గగన సరోవరమందలి సిత పుండరీకము.

(శాస్త్రము జ్ఞాన ప్రధానమై బుద్ధిని రంజింపఁజేయును.) శాస్త్రకారుని నూతన పరిశోధనలను, అపూర్వ నిర్మాణములను గాంచి మానవుఁ డాశ్చర్య చకితుఁడై 'ఓహో' యని మెచ్చుకొనును. (కావ్యము రస ప్రధానమై పఠితల హృదయముల రంజింపఁ జేయును.) కవుల యపూర్వ సౌందర్య శోభితమైన కావ్య సృష్టిని బరిశీలించి మానవు లానంద పరవశులై "ఆహా" యని విగళిత వేద్యాంతర స్థితి పొందుదురు. శాస్త్రమునకు భౌతిక ప్రపంచమే పరమావధి. కావ్య వ్యాప్తి నిరవధికము. రూపమునఁ గూడ శాస్త్రకావ్యములకు భేద మున్నది. వస్తు ప్రధానమైన శాస్త్రమునకు గద్యమే యుచితమైన వ్యక్తీకరణ సాధనము. రస ప్రధానమైన కావ్యమునకుఁ బద్యమో పద్య ప్రాయమైన గద్యమో వ్యక్తీకరణ సాధనమై యుండుట లెస్స

కావ్యమునకు యశస్సు, అర్థలాభము. లోకవ్యవహార విత్త్వము, అమంగళ పరిహారము, ఆనంద పారవశ్యము ఫలితములుగాఁ జెప్పబడినవి. శాస్త్రమువలనఁ గూడ వీనిలోఁ గొన్ని సమకూడుచున్నవి. శాస్త్రములు బాగుగాఁబఠించి నూతనము లైన నిర్వచనములు గావించినచోఁ గీర్తియుఁ గలుగును. దానివలన నైహికమైన యుపయోగమును గొంతవఱకు సంభవించును. కావ్యమువలన లోక వ్యవహారము లన్నియు నవగతము లగుటయే కాక, కొన్ని క్లిష్ట పరిస్థితులలో నెట్లు మెలఁగ వలయునో యది కూడఁ దెలియును. శాస్త్రము కూడ నీ ప్రయోజనమును గావ్య మంత కాకపోయినను గొంతవఱకు సాధింపఁ జాలును. ఇంక మిగిలిన రెండు

ఫలితములందును, శాస్త్రము కావ్యముతో సరి తూఁగఁ జాలదు. పైఁగా నది శ్వేత పక్షతి విషయమునఁ గావ్యమునకుఁ గేవల విరోధి. ఋషితుల్యుఁడైన కవి విశాలమైన హృదయముతో సర్వలోకమంగళము నాకాంక్షించుచుఁ గావ్యమును వ్రాయును. తన వలనఁగాని తన కావ్యము వలనఁ గాని లోకమున కమంగళము ప్రాప్తించుచో నతఁడట్టి కావ్యమును రచించుటయే మానును. పాశ్చాత్యులు విషాదాంత కావ్యములు వ్రాయుటకు వెనుదీయలేదు. మనవా రట్టి కావ్యముల వలనఁ బఠితల హృదయము శ్వేతరాశంకియై నిరుత్సాహాంకితమగు నేమోయని యట్టివానిఁ బరిహరించిరి. శాస్త్రము కూడఁ దత్త్వనిష్ణాతులకు సేవించిన కొలంది సంతోషము నొసంగును. కాని యా సంతోషమునకును బ్రహ్మానంద సహోదరమైన కావ్యానందమునకును జాల వ్యత్యాస మున్నది. ఒకటి యాశ్చర్య మూలమైన సంతోషము; రెండవ దాత్మ వికాస కారణమైన యానందము. శాస్త్రము కేవల మొక్కయైహిక సౌఖ్యమునే చేకూర్చును; కావ్యమైహిక పార లౌకిక సౌఖ్యములకు రెండింటికి దారి చూపును. 'స్వస్తి ప్రజాభ్యః' "లోకా స్సమస్తాస్సుఖినో భవన్తు" అను నవియే యెల్ల యెడల మనవారి యాదర్శములు. ఇంక శాస్త్రము లోకమంగళమునకై స్వాభివృద్ధిని బరిత్యజించుట కిచ్చగింపదు. ప్రపంచ మంతయుఁ బ్రళయాగతిచే భిన్నభిన్నమై పోయినను స్వోజ్జృంభణము ముందది దానిని లెక్కచేయదు. యుద్ధాది సమయములో శాస్త్ర సాహాయ్యముచేఁ జేయఁబడు ప్రాణి కంటకములగు పరికరములే దీనికిఁ దార్కాణము.

దయామయుఁడైన పరమేశ్వరుఁడు సర్వజీవ సౌఖ్యము నుద్దేశించి ప్రకృతిని సృజించెను. కవి యా కరుణామూర్తి యౌదార్యమును బ్రశంసించుచుఁ దన దివ్యమైన దృష్టితో సందలి రహస్యముల నెఱింగి తన కావ్యమున వానిని ద్విగుణీకృత సౌందర్యముతోఁ జూపట్టఁ జేయును. పఠిత లీతఁడు కావించిన యీ శాంత సుందరమైన ప్రకృతిని జూచి యచ్చెరు వంది తన్నిర్మాత యగు పురుషుని వంకకుఁ దమ దృష్టిని ద్రిప్పుటకు బ్రయత్నింతురు అది వారి మనశ్శాంతికిని ధర్మ జీవితమునకును హేతు వగును పైఁగాఁ గవి ప్రకృతి వలనఁ దన కావ్యమునకుఁ గలిగిన శోభను దలంచి యానంద మగ్నుఁడై దానిని దేవతవలె నుపాసించును. ఉపాసించిన కొలఁది ప్రకృతిదేవి యాతనికి సాక్షా

తర్కించి యభిమతార్థము లోన గూర్చుచుండును. శాస్త్రమునకును ప్రకృతికిని గల సంబంధ మిట్టిదికాదు. శాస్త్రజ్ఞుడు ప్రకృతి సౌందర్యమును జూచి యానందింపడు. దానివలన దనకు గాగల యుపయోగమును లాభమును దలంచి యానందించును. తన కది యొసంగు చున్న మేలునకు ప్రతిగా నాతడు కృతజ్ఞత చూపక దానిని వశపఱుచుకొని యధిపతియై తన మనసు వచ్చినట్లు దాన బరివర్తనము కలిగించును. అతడు ప్రకృతిని వికృతను గావించుటకు సైతము వెనుదీయడు. ప్రకృతియు నాతని దౌర్జన్యము నూహించి కోప ఘూర్ణితయై వికార ముఖముతో బరికించును. మొత్తము మీద గవికిని ప్రకృతికిని గల సంబంధము భక్త దేవతా సంబంధము. శాస్త్రికిని ప్రకృతికిని స్వామి సేవక సంబంధము.

కవిత్వము సర్వమానవ సంతోషదాయి. నిరక్ష రాస్యులు కూడ గవితామతల్లి మాధుర్య ధురీణమగు మాట పొందిక నాలించి మనస్సులో నానందింతురు. శాస్త్రము తత్పారిభాషికులకు మాత్రమే లొంగును. పెద్దపెద్ద పండితులు కూడ దాని నవగాహనము చేసికొనజాలరు. కాగా దాని ప్రయోజనము పరిమిత మని చెప్పవచ్చును. కవిత దూరమున నున్న వారిని సైతము నగుమోముతో నాహ్వానించి యాకర్షించును శాస్త్రము చెంత జేరినవారిని సైతము బొమముడిపాటుతో దనలో ప్రవేశింప నీక విసుగు పుట్టించి వెడల గొట్టును. కవితా శాస్త్రములు రెండింటను ప్రయోగింపబడు శబ్దములు సమానములే. అవలంబన తారతమ్యమును బట్టి యవి సరసములు, కఠినములు నగుచుండును. తప లోహ పతితమగు కంకణము నీరూపమును శుక్తిపతిత మగునది ముక్తామణియు నగుట కలదు కదా!

## 6. కావ్యము - చరిత్ర

ఏదైన వస్తువును దర్శించి దానినిగూర్చి మననము చేసినపిమ్మట ననుభవమును జోడించి వర్ణించువాడు కవి. అట్టి కవికర్మ, కావ్యము. 'ఇతిహ ఆస' 'ఇట్లాయెను' అని చెప్పునది యితిహాసము లేక చరిత్ర. దీనినిబట్టి జరిగిన దానిని జరిగినట్లు కాలక్రమము ననుసరించి చెప్పునది చరిత్రయనియు, గావ్యకారణ భావానుగుణముగా దాని నమర్చి సుందరముగా జెప్పునది కావ్యమనియు దేలుచున్నది చరిత్రకు బూర్వాపర సంబంధమే కాని కార్యకారణ సంబంధ మక్కఱ

దు. అందుచేతనే చారిత్రకవస్తువును గ్రహించి కావ్యమును వ్రాయునప్పుడు నిని గార్య కారణ సంబంధానుగుణముగాఁ దీర్చిదిద్దవలసిన యావశ్యకము కల్గును. చరిత్రకును గర్త యనుభవములకును ఎట్టి సంబంధము నుండదు. వ్యమునఁ గవి చిత్తవృత్త్యనుభవముల కపారమైన ప్రాధాన్య ముండును. వ్య మనగాఁ కవి వ్యాపారమే కదా.

శాస్త్రమువలెనే చరిత్రయు విషయప్రధానము. పఠితలు దానిని విషయ పరిజ్ఞానముకొఱకే పఠింతురు కావ్య మట్లుగాక రసప్రధానము. సహృదయు లానందార్థులై దానిని బఠింతురు. అందుచేతనే భట్టనాయకుఁడు "కావ్య మెల్లరను రసింపఁ జేయును (ఆనందింపఁ జేయును). ఇతిహాసమువలె బోధింపదు. వేదమువలె శాసింపదు" అని చెప్పియున్నాడు. చరిత్ర బోధించు ననగాఁ బూర్వ మిట్టి పరిస్థితులలో నిట్లు చేసిన నిట్లు జరిగినది ఇప్పుడును అట్టి పరిస్థితులలో నట్లుచేసిన నదే పరిణామము కల్గునని వ్యక్తము చేయును.

చరిత్ర అర్థ (విషయ) ప్రధానము. కావ్య ముక్తి ప్రధానము. చరిత్ర కారుఁడు జరిగిన విషయమును నిరలంకారముగా, నిర్గుణముగా, వాచ్యముగాఁ జెప్పివేయవచ్చును. కవి యట్లుగాక వక్తవ్యాంశమును గుణాలంకార సహితము గావించి వ్యంగసుందరముగాఁ జెప్పవలయును. చరిత్రయందు వాడఁ దగిన యలంకార మొక్క స్వభావోక్తియే కాకపోవును. కావ్య మునం దట్లుకాక యలంకారములు సౌందర్యోత్కర్షావహములై యింపు నింపును. చరిత్ర రచనకు వచనమే యెక్కువ యనుకూలము; కావ్యమును బద్యముగను, గద్యముగను రెండింట వ్రాయవచ్చును. కాని కావ్య గద్యములకును జరిత్ర గద్యమునకును హస్తిమశకాంతర ముండును. ఒకటి యలంకార పరిపూర్ణము. రెండవది నిరలంకారము.

ఇతిహాసమున వస్తువివరణమే ప్రధానము. తత్కర్త వస్త్వైక్యమునకుఁ గాని యంగాంగిభావ సామరస్యమునకుఁగాని సమ్యక్సంధి సంఘటనమునకుఁ గాని ప్రయత్నింప నవసరములేదు. నిజము పరికింపఁ జరిత్ర వివిధకాలములందలి వివిధ వ్యక్తుల వృత్తాంతములను జెప్పవలసియుండును గావున నందు వస్త్వైక్య

మును సమకూర్చుట కవకాశమే లేదు కవి వస్తువును చెన్నుగా సంఘటించి దాని నైక్యభాసురముగను సంధిబంధ సుందరముగను వెలయింపవలయును.

చరిత్ర దేశకాల నియంత్రితమైనది అనఁగా నది యేదేశమున నేకాలమున జరిగిన దాని నాదేశముననే యాకాలముననే జరిగినట్లు చెప్పవలయును. అందుచే నది యాదేశమునకు నాకాలమునకు మాత్రమే సంబంధించియుండును. కావ్యము దేశకాల నియమితమైనది కాదు; అది సర్వజనీనము, సర్వకాలీనము.

చరిత్ర వ్యక్తులను దచ్చర్యలను వివరించును. కావ్య మాచర్యలకుఁ ప్రేరకములైన వ్యక్తుల చిత్తవృత్తులను వర్ణించును. కావ్యముకూడ వ్యక్తి చరిత్రను వర్ణింపవచ్చునుగాని యావ్యక్తియందు సాధారణ వ్యక్తియే కాని ప్రత్యేక వ్యక్తి కాదు. అది యొక కల్పిత నామముతో నావ్యక్తి నుపయోగించుకొనును. అచ్చట నాపేరు తీసి మఱియొక పేరు ప్రవేశపెట్టినను నష్ట ముండదు. ఏలయన నచ్చట నావ్యక్తి వ్యాపారమునకే కాని వ్యక్తికిఁ బ్రాధాన్యములేదు. కాళిదాసు మేఘసందేశమున యక్షయక్షిణీ నామములను జెప్పి యుండలేదు. అందుచే నాకావ్యమున కెట్టి కొఱఁతయుఁ గలుగలేదు. ఏలయన నందు వర్ణితములైన వ్యాపారములు సర్వ స్త్రీ పురుష సామాన్యములు అందుచేతనే కావ్యము విశ్వజనీన మని చెప్పఁబడుచున్నది. చరిత్రయే వ్యక్తిపేరు పేర్కొన్న నా వ్యక్తికే సంబంధించి యుండును. శివాజీ చరిత్రలో శివాజీపేరు తీసివేసి రాణాప్రతాపుని పేరు పెట్టుటకు వీలులేదు. చరిత్ర ప్రత్యేక వ్యక్తిగతమైనది.

కావ్యమున కవి వ్యక్తిత్వము శిల్పనైపుణ్యము గోచరించును. చరిత్రయందుఁ గర్త వ్యక్తిత్వమునకుఁ జోటులేదు. అతఁడందు శిల్పకౌశలము చూపవలసిన యవసరములేదు. కావ్యము సరసము; చరిత్ర శుష్కము. కార్లైలువలె, గిబ్బనువలె నెవ్వరైనఁ జరిత్రను గూడ సరసముగా రచింపఁ జాలుచో నది పేరునకు చరిత్రయయ్యుఁ గావ్యమై కావ్య గౌరవమునే పొందఁ జాలును.

## 7. కావ్యము, తత్త్వశాస్త్రము

జీవేశ్వర సంబంధమును దెల్పు శాస్త్రము తత్త్వశాస్త్రము. రసోవై సః-అను సూక్తి ననుసరించి బ్రహ్మము రసమయమేయైనను దానిని దెల్పు తత్త్వశాస్త్రము

మాత్రము శుష్కమైనది. అందుఁ దత్త్వము వాచ్యముగాఁ జెప్పఁబడును. ఉపదేశ ప్రయోజనమైన కావ్యమునఁ గూడఁ దత్త్వముండవచ్చును. కాళిదాసు కుమారసంభవ ద్వితీయ సర్గమందువలెఁ గొందఱు కవులు కావ్యములలోఁ గూడఁ దత్త్వమును దెల్పియుండిరి. కాని దాని నందుఁ జెప్పు విధమున భేద మున్నది. అది అందు వ్యంగ్యముగను అలంకారికముగను జెప్పఁబడును. అచెప్పు వైఖరి యందలి 'శుష్కత్వమును' దగ్గించును. మఱియుఁ దత్త్వమం దేకదేశగతమై యుండునే కాని సర్వత్రయుండదు. ఉన్నను గర్భితమై యుండునే కాని వాచ్యమై యుండదు. నన్నయ భారతము నధ్యాత్మ విదులు వేదాంత మందు రని పచించెను. అట్లుండుట శాస్త్ర కావ్యమైన భారత మొక్క దానికే చెల్లినది. అచ్చటనైనను తత్త్వప్రాచుర్యము గలచోట్లఁ గావ్యత్వము కుంఠితమైన దనియే చెప్పవలయును. రసమయమైన కావ్యమున వాచ్యమైన వేదాంతమున కధికమైన స్థానము లేదనుట సత్యమే కాని యంతమాత్రమునఁ గవిత్వమునకును దత్త్వమునకును బరిమ విరోధమని చెప్పరాదు.

భారత దేశమున రామాయణ భారతములను రచించిన కవు లిరువురును మహర్షులే. అందుచేతనే మన దేశమున 'నానృషిః కురుతే కావ్య' మ్మను నానుడి యేర్పడినది వారు క్రాంత దర్శులై తమ రచనలందుఁ గవితా తత్త్వములను రెండింటిని జోడింపఁ జాలిరి. ప్రాచీనకాలమున నేదో విధముగాఁదత్త్వము బోధింపని కావ్యము కావ్యమే కాదను నభిప్రాయ ముండెడిది. పాశ్చాత్యులలోఁ గూడఁ గొందఱు కావ్యమునఁ దత్త్వముకూడ నుండవలెనని యభిప్రాయ పడినవారున్నారు. "కావ్యమునఁ దత్త్వము ముందు-కవిత్వము తరువాత" (బ్రౌనింగు) "మహాతాత్త్వికుఁడు కానివాఁ డెవ్వఁడును మహాకవి యనిపించు కొనఁ జాలడు" (కోలెరిడ్జి) "కవి ప్రజా సామాన్యమునకుఁ దత్త్వదర్శి" (ప్లూటార్కు) అను వాక్యము లిందుకు నిదర్శనము.

కొందఱు తత్త్వస్పర్శ కావ్యశోభను దగ్గించుకొని వ్యతిరేకాభిప్రాయ మును వెల్లడించిన వారును గలరు. బోయలూ అను నతఁడు 'డెకార్టీ వేదాంతము కవిత్వ కంఠము నుత్తరించిన'దని చెప్పియున్నాడు. లియొనార్డ్రిబ్రూనీ "కవిత్వ ప్రాశస్త్యమును గళా ప్రస్ఫష్ట సిద్ధి సంపదను బట్టియే కాని యతని నీతిబోధన

సామర్థ్యమునుబట్టి నిర్ణయింపరా" దని యభిప్రాయపడియుండెను. రూసో, స్విన్‌బరన్ మున్నగువారుకూడ నిట్టి యాశయమునే గలిగి యుండిరి.

పై రెండు వాదములు నతివాదములే. హడ్సను కావ్య తత్త్వముల కపరిహార్యమైన విరోధము లేదనియు రామణీయకమునకు భంగము రాని విధమున గావ్యమును దత్త్వోపదేశ సాధనముగాఁ జేసికొన్నను దోషము లేదనియు మధ్యేమార్గమును సూచించి యున్నాడు. కావ్యమునకు రసానందమే ప్రధాన ప్రయోజనము; నీతి తత్త్వోపదేశము లందానుషంగికములు. రసభంగము కాకుండ నేర్పుతో వానినందు వెలయించినచో టాగూరు గీతాంజలి యందువలె భాగవతమునందువలె నవి కావ్యమునకెనలేని యౌదాత్త్య గాంభీర్యములను సమకూర్చును.

## 8. కావ్యవస్తువు

భరతుని మతమున నితివృత్తమే కావ్యశరీరము. "ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితః" మ్మని యతఁడు నాట్యశాస్త్రమునఁ జెప్పియున్నాడు. ఇతివృత్తమనఁగా గావ్యమునందలి కథ లేక వస్తువు. కావ్యకర్త యాంతరములైన రసధ్వని భావాదుల విషయమున వలెనే బాహ్యములైన శబ్దచ్ఛందో వస్తువుల విషయమునఁ గూడ నత్యంత శ్రద్ధ వహింపవలయును. అప్పుడుకాని కావ్యము బహిరంత స్సౌందర్య సంశోభితమై సహృదయ సంపూర్ణానంద సంధాయకము కాఁజాలదు.

భరతుని దృష్టిలోఁ గావ్య మనఁగా రూపకమే. అతఁడా రూపకములను మనస్సులో నుంచుకొనియే నాట్య శాస్త్రమున రసము, ఇతివృత్తము మొదలగు విషయములను గూర్చి చెప్పి యుండెను. తరువాత నానందవర్ధనుఁడు రూపకములందే కాక శ్రవ్య కావ్యములందుఁ గూడ రసమె ప్రధానమనియుఁ దత్సమ్యక్పరిపోషణము వలననే సర్వ కావ్యములు సౌందర్య శోభితము లగు ననియుఁ జెప్పి రసాదులను శ్రవ్య కావ్యముల విషయమునఁ గూడ సమన్వయించెను. అయినను లాక్షణికులు పలువురు రూపక సంబంధముగనే రసమునుగూర్చి చర్చించుటయు, ప్రసిద్ధములైన రూపకముల నుండియే యుదాహరణము లొసంగుటయు గోచరించును. దానిబట్టి రస వస్తు పోషణమున విషయమున దృశ్య శ్రవ్య కావ్యములకు

వ్యము లేదని భావింపరాదు. వాని నా రెండింటను గొంచెము మించుగా మానముగానే పోషింపవలయును.

"పంచభి స్సంధిభిస్తస్య విభాగాః పరికీర్తితాః" అని భరతుఁడు దృశ్యకావ్యము లందలి యితివృత్తము పంచసంధులుగా విభజింపఁబడవలెనని చెప్పెను. మహుఁడు "పంచభి స్సంధిభిర్యుక్త" మ్మని కావ్య వస్తువు పంచసంధి సంయుక్తమై యుండవలెనని యభిప్రాయపడెను. ఏ కావ్యమందలి వస్తువైనను సంధిపంచకశోభితమై యున్నప్పుడే మనోరంజకముగా నుండును. అట్లు కానిచో నది కావ్యమును గోల్పడి యందదుకులుగా గోచరించును.

రస విషయమున వలెనే వస్తువు విషయమునఁ గూడ నానందవర్ధనుఁడు దృశ్యశ్రవ్య కావ్యములు నిర్విశేషము లనియే భావించెను. అతఁడు కావ్య వస్తువు విభావానుభావ సంచారి భావౌచిత్య శోభితమై యుండవలయు ననియు నందుఁ బ్రసంగాగతములైన యనను గుణసన్నివేశములను దొలఁగింపవలెననియుఁ రసాభివ్యక్తి కనుకూలముగా నుండునట్లు సంధి తదంగములను గూర్పవలెననియు, కథా ఘట్టములందు రసోద్దీపన ప్రశంగములను నేర్పుతోఁ గావింపవలెననియు, విరద్ధమై యాగి పోయిన రసమును మరల ననుసంధింపవలయుననియు వ్యక్తము చేసి యున్నాఁడు. మఱియు శాస్త్రలక్షణముల నేదో విధముగా సరిపుచ్చుటకై కావ్యమున రసోపస్కారములు కాని సంధ్యాదులను గూర్ప రాదనియు, శక్తియున్నది కదా యని యలంకారముల ననవసరముగా నుపయోగింపక యనురూపముగా మాత్రమే యోజింపవలెననియు నాతఁడు స్పష్టముగాఁ జెప్పియుండెను. దృశ్యకావ్య మందైనను శ్రవ్యకావ్యమందైనను రసోపస్కారముకాని యంశములు పరిత్యాజ్యములే యని యాతని నిశ్చితాభిప్రాయము. అనగాఁ గావ్య వస్తు వెప్పుడును రసానుకూలముగనే సంయోజితము కావలయును.

కాళిదాసాది మహాకవులు రసప్రాధాన్యమును, వస్తువునకుఁ గల రసవిఘ్నతను గ్రహించినవారు కావుననే తమ కావ్యములందు సర్వకథాంగములను రసోపస్కారములుగనే వెలయించి వానిని సహృదయ రంజకములు కావింపఁజాలినారు. మహాకవు లెప్పుడును వస్తువును రసానుకూలముగనే విశ్వసింతురు కాని శాస్త్రస్థితి

సంపాదన పరాయణతచే రసభంజకములైన యంశముల నందుఁ జొప్పింపవు. ఆంధ్రవాఙ్మయమున ప్రబంధకవులు కొందఱు లక్షణానుసరణ ప్రీతిచేఁ గతానుగతికముగాఁ గొన్ని యనవసర వర్ణనలు కావించియుండిరి. ఆ వర్ణనలు ప్రత్యేకముగాఁ జూచినచో రమణీయములుగానే యుండినను ఆయాకథా సంఘటనములం దనావశ్యకములుగా గోచరించును

శ్రవ్యకావ్యము కేవలము వినఁదగినది. దృశ్యకావ్యము రంగమునఁ బ్రదర్శింపఁదగినది. విననప్పటికంటెఁ జూచినప్పుడు కొన్ని దృశ్యములెక్కువ యేవగింపు కలిగించును. అందుచేతనే లాక్షణికు లనుచితములు, నీరసములు ఉద్వేగకరములు నైన యంశములను రూపకములందుఁ బదర్శింప రాదని నియమము కావించిరి. శ్రవ్య కావ్యము లందుఁ గూడ వానిని బరిహరించుట మంచిదే. కాని కథ కవసరములని తోఁచి నప్పుడు వానిని గూడ వర్ణింపవచ్చును. సముద్ర లంఘనము, యుద్ధము, దుర్గావస్కందనము మున్నగునవి ప్రదర్శనాసాధ్యము లగుటచే దృశ్యములందుఁ బరిహరణీయములు. శ్రవ్యకావ్యములందు వానిని యథోచితముగా వర్ణించుట కవకాశ మున్నది. వస్తు సంధానము చేయునప్పు డారంభము విషయమునఁ గవి చాల శ్రద్ధ వహింప వలయును. దృశ్య శ్రవ్య కావ్యములు రెండింటి వస్తూపక్రమ మొక్క మాదిరిగా నుండ నవసరము లేదు. దృశ్య కావ్య శిల్పము ననుసరించి యందది ''అనఁగా అనఁగా ఒకరాజు'' అను విధముగాఁ గాక యెక్కడనో కథా మధ్యమున నారబ్ధ మగుచుండును. ఇట్టి స్వల్ప భేదము లున్నను వస్తువిన్యాసము కావ్యము లన్నింట రసోద్దీపకముగానే యుండవలయు ననుటలో నభిప్రాయభేదము లేదు. మాథ్యూ ఆర్నాల్డు రూపక వస్తువు మధురోదాత్త రసభావ నిరంతరమై (Sound subject matter) యుండవలె ననుట యందలి యర్థమిదియే.

## 9. కావ్యము ఛందస్సు.

ప్రాచ్య లాక్షణికులు పద్య గద్యోభయాత్మక మని కావ్యమును మూఁడు తెఱఁగులుగా విభజించిరి. దీనినిబట్టి కావ్యము గద్యమయముగాఁగాని పద్యమయముగాఁ గాని గద్య పద్యోభయమముగాఁ గాని యుండవచ్చును. ఛందోమయ

మైన పద్య కావ్యమునకును, ఛందో రహితమైన గద్య కావ్యమునకును ప్రాచ్య లాక్షణికుల మతమునఁ గావ్యత్వము సమానమే. కాని రసాత్మకమైన వాక్యము కావ్యమను నిర్వచనమును బట్టి యది రసాత్మకమై మాత్ర ముండ వలయును. రసాత్మకత్వ మను అంతర ధర్మముండుచో దాని బహిస్స్వరూపము గద్యపద్య ములలో నేదైనను గావ్యత్వమునకు భంగము వాటిల్లదని వారి యభిప్రాయము. రసహీనమైనచోఁ బద్యమయమైన రచన కూడఁ గావ్య నామార్హము కాజాలదు. రససహితమైనచో గద్యమయమైన రచన యైనను గావ్య నామమున కర్హమే.

ఆంగ్లమున 'పోయెట్రీ' అను పదమునకు కవిత్వము లేక పద్య కావ్యము అని యర్థము. పద్య కావ్య మను మాట కావ్యము యొక్క బహిస్స్వరూపమును అంతర ధర్మమును రెండింటిని గూడ సూచించుచున్నది. అనఁగా నది కవితా సహితమును ఛందోమయమును గూడ నై యుండును. కవితా సహితమైన రచన రసాత్మకమై యుండక మానదు. కవితా సహిత మయ్యు గద్య రూపమైనరచనను 'పోయెట్రీ' అనుటకు వీలులేదు. ఆంగ్ల భాషలో దానిని Prose Poetry అనవల యును. దీనిని బట్టి ఆంగ్లమున 'పోయెట్రీ' అనఁబడుటకు రచనయందు కవితా ధర్మముతోపాటు ఛంద స్సాహిత్యము కూడ నుండవలయును.

ఆంగ్ల విమర్శకులలోఁ గావ్యమునకు ఛంద స్సవసరమా కాదా యను విష యమున భిన్నాభిప్రాయము లున్నవి. సర్ ఫిలిప్ సిడ్నీ, కోలెరెడ్జి మున్నగువారు ప్రాచ్యలాక్షణికులవలెఁ గావ్యమునకు బాహ్యమైన ఛందస్సుతో నెట్టిసంబంధమును లేదని భావించిరి. ఛందస్సు కావ్యమున కలంకార ప్రాయమైన బహిరాచ్ఛాదనమే కాని కవితా హేతువు కాదనియు, నిందుకు ఛందోరహితమైన గద్యమునఁ కూడ మహా కవిత్వము వెలయించిన కవులును, పద్యమయ రచనలు కావించియుఁ గవి నామ వాచ్యులు కాకపోయిన కవులును బలువురుండుటయే కారణమనియు సిడ్నీ తెల్పి యున్నాఁడు. అట్లే కోలెరెడ్జి యుత్కృష్టమైన కవిత్వము ఛందోరహిత ముగా నుండ వచ్చునని చెప్పి యుదాహరణ లొసంగి యున్నాఁడు. లేహస్టు, కార్లైలు, మాత్యూ ఆర్నాల్డు మున్నగువా రట్లు కాక కవిత్వమునకు ఛంద స్సపరి హార్యమని భావించి యున్నారు. లేహస్టు కవితా పరిపక్వతకు ఛందస్సు మిక్కిలి యవసర మనియు నది లేనిచోఁ గవితా సౌందర్య మసమగ్రమగుననియు భావించి

యున్నాఁడు. మాథ్యూ ఆర్నాల్డు వచనమును కంటెఁ గవిత్వమున లయాధిక్యము గోచరించు ననియు. స్థిరములు శక్తిమంతములు నైన ఛందోలయములే కవితా సమగ్రతకుఁ గొంత వఱకుఁ గారణము లనియు నుడివి యున్నాఁడు. కార్లైలు కవిత్వము ఛందోమయమై యుండవలె నను ప్రాచీనుల నియమ మర్థవంతము గనే గోచరించుచున్నదని తెల్పియున్నాఁడు.

ఛంద స్సాహిత్య రాహిత్యముల వలనఁ గావ్యముల యుత్కర్షాపకర్షలు కలుగుచుండుట నిజమే యైనను వానినే కావ్యాకావ్య భేదకములుగా గ్రహింపరాదు ఏలయనఁ గేవలము ఛందస్సును బట్టియే 'ఇది కావ్యము. ఇది కావ్యముకాదు' అని నిర్ణయించుటకుఁ గడంగినచో నొక్కొక్కప్పుడు కవిత్వము కాని దానిని కవిత్వ మనియు, నుత్తమ కవిత్వము నకవిత్వమనియుఁ జెప్పవలసివచ్చును. ఆంధ్రనామ సంగ్రహము పద్యరూపమున రచింపబడినదే యైనను గావ్య శబ్ద వాచ్యము కాఁజాలదు. వేంకటేశ్వర వచనములు గద్యరూపములే యయ్యుఁ గావ్య నామార్హము లనుటకు సంశయింప నక్కఱలేదు. సంస్కృతమున గద్యరూపమున నున్న కాదంబరీ దశకుమార చరిత్రలను గొందఱాంధ్ర కవులు పద్యరూపమున ననువదించిరి. వానిని దారతమ్య దృష్టితోఁ బరిశీలించినచోఁ బద్యరూపములైన యనువాదముల కంటె గద్యరూపములైన మూల గ్రంథమునందే కావ్య గుణములు హెచ్చుగా గోచరించును. అందుచే ఛందస్సు కావ్యమునకు సౌందర్యమును గలిగించు విశేష లక్షణమే కాని అపరిహార్య లక్షణము కాఁజాలదు. కాని సాధారణముగాఁ గవిత్వమునకును ఛందస్సునకును అవినాభావము చెప్పుట లోకమున పరిపాటి యైనది. అందుచేఁ గావ్యమనఁగా బద్యమయమైన రచనయనియే స్ఫురించును. సామాన్యులకుఁ గవితామయమైన రచనయయ్యు ఛందోరహితమైనచోఁ గవిత్వముగా భాసింపదు. కావున రసమయమైనకావ్యముతో లయాన్వితమైన ఛందమును కూడ జతచేసినచో బంగారమునకుఁ బరిమళ మబ్బిన ట్లుండును.

ఛందస్సు వలన ప్రయోజనములు: కావ్యమున ఛందస్సులయోత్కర్షను గలిగించి తద్ద్వారా రసానందప్రాప్తి కధికముగాఁ దోడ్పడును. కొందఱు ఛందస్సు కవితా స్వతంత్ర్యమునకు భంగకరమని భావించి దానిని బరిహరింప యత్నింతురు. గాని దానితో పాటు ఛందస్సు కలిగించు సహజ సంగీత మాధు

ర్యమును గూడఁ దొలఁగించినవా రగుదురు. ఛందస్సు కావ్యమున కుత్కర్ష నాపాదించుననుటలో సందేహము లేదు. అందుచేతనే అరిస్టాటిలు అది కవితా సమగ్రతలో నొక భాగమని చెప్పియుండెను. ఛందస్సు కవితావేశమును బొందుటకును, వ్యక్తీకరించుటకును ఉత్తమ సాధనమై కవిత్వమునకు సమగ్రత కలిగించును. అనాది కాలమునుండియు మానవులు నిశితములైన భావములను లయాన్వితమైన భాషలోనే వ్యక్తీకరించుచుండి రని జాన్ స్టూవర్టు మిల్ నుడివి యున్నాఁడు. భావములు నిశితతరములైన కొలంది లయ సాంద్రతర మగుట సంభవించును. అందుకుఁ గవితోచిత భావమునకును ఛందోరూపమునకును గల సన్నిహిత సంబంధమే కారణము. ఒక్కొక్కప్పుడు గద్యము కూడ నావేశపరిపూర్ణమై నిశిత భావోపేతమై యుండవచ్చును. అప్పుడందలి ఓజస్సు మానసమగ్రత ఛందోలోపమును బూరించుచుండును.

కవిత్వము నందలి ఛందోరూపము పఠితలను మఱొక ప్రపంచమునకుఁ గొనిపోవునని హెగెల్ అను తాత్త్వికుఁడు చెప్పియున్నాఁడు. గద్యభాషను లయాన్వితమైన భాషగా మార్చుట నీరసలోకమునుండి రసలోకమునకుఁ బయనించుట వంటిది. గద్యమున సౌష్ఠవోపేతముగాఁ దోఁచిన రచనా విధానమే పద్యకావ్యమునఁ బరివర్తనము నపేక్షించును. కవితావేశము ఛందోరూపమువలె ఛందోరూపము కవితావేశమును బ్రేరేచును. ఒకప్పుడొండు రెండు పద్యములను వ్రాయవలెనని మొదలుపెట్టి రచయితలు పలుపద్యములు వ్రాయజాలుట యిందుకు నిదర్శనము.

ఛందస్సు సంగీతము వంటిది. సంగీతమువలె నది సామాన్యుల హృదయములను గూడ నాకర్షించి యానంద పరవశముల నొనరించును. పదము లర్థమైనను గాకపోయినను బోతన వంటి మహాకవుల పద్యములను వినునప్పుడు పామరులు కూడఁ దలలూపించుట యందుచేతనే. ఛందస్సు ధారణాశక్తి కెన్నో విధములఁ దోడ్పడును. పద్యములందు పదముల కూర్పు లయానుగుణముగా సమర్పఁబడి యుండుట యిందుకుఁ గారణము. పద్యములవలె వచన భాగములను మనము సులభముగా ధారణ చేయఁజాలక పోవుట కందలి ఛందోరాహిత్యమే కారణము.

కవితావేశపూరితమైన మహాకవుల పద్యభాగములను గద్యభాగములుగా ననువదించి మారెంటిని బోల్చి చూచినచో ఛందస్సు వలని ప్రయోజనము

తేటతెల్ల మగును. అట్టి యనువాదము "పూలరేకుల మీఁదను దృణపల్లవముల మీఁదను ముత్తెముల వలెఁ గనిపించి చేతితో గ్రహింపఁగనే నీరుగా మారిపోవు మంచు బిందువుల సేకరించుట" వంటిదని జేమ్సు మాంటుగోమరీ చెప్పి యున్నాఁడు. వచన భాగములందు పద్యభాగములందలి లాలిత్యము, తళుకు, రూపము మాఱిపోయి కేవల వస్తువు మాత్రమే మిగులుట సంభవించును. ఈ వికృతికి ఛందోరాహిత్యము కూడఁ గొంతవఱకుఁ గారణము.

అందుచే ఛందస్సు కావ్యమునకు అందముతోపాటాకర్షణమును గూడఁ గలిగించును. కొందఱు విశిష్ట ప్రతిభావంతులు గద్యముననే యా లయాకర్షణము లను కలిగింప సమర్థులై యుండవచ్చును. కాని యందఱు నట్లు చేయఁజాలరు.

## 10. కావ్యము-సంఘము

కవులు కొన్ని విశిష్ట గుణములు కలవారైనను నితరులతోపాటు తామును సంఘజీవులే. వారు భావుకులై ఉన్నత లోకములలో విహరించుచునే యేదో యొక వేళ నీ లౌకిక ప్రపంచమున కవతరింపక తప్పదు. ఈ ప్రపంచముతో సంబంధములేని వారి కవితా వ్యవసాయము నేల విడిచిన సామువంటి దగును కావుననే సాహిత్యమునకు సంఘమునకు, గొంత సంబంధము తప్పక గోచరించు చుండును.

ఏ విషయమైనను ఉన్నది యున్నట్లు వ్రాయ వలెనను నియమము కవికి లేదు. అది చరిత్రకారుల పని. రసము ప్రధానముగా గ్రహించు కవి వాక్యముల కును విషయ కథనమే ప్రధానముగా నెంచు చరిత్రకారుని వాక్యములకును జాల భేదముండును. కవులు తాము చెప్పఁదలఁచిన విషయములను బొడి మాటలతోఁ జెప్పక అలంకారికమార్గములఁ జెప్పుదురు. అలంకారము లతిశయోక్తులని కొందఱి మతము. అంత మాత్రమునఁ గవుల రచన లన్నియు నసత్యములని మన మను కొనరాదు. అందలి యలంకారములను, నతిశయోక్తులను దొలఁగించినచోఁ గవుల రచనల యందు వారి కాలమునకును, వారు నివసించు సమాజమునకును సంబంధించిన యథార్థ విషయములు కొన్ని తొంగిచూచుచునే యుండును.

కవి కథా వస్తువును గల్పించు నపుడు తాను నివసించు సంఘమును, ందలి సన్నివేశములను, వ్యక్తులను, యాచార వ్యవహారములను దృష్టియం ంచుకొనును. అతఁడుతానుజూడని, అనుభవింపని, విషయముల నభినివేశముతో వర్ణింపఁ జాలఁడు. వివిధ వస్తువులను సన్నివేశములను వర్ణించునపుడు స్వాను వమును గూడ నందుఁ బ్రవేశపెట్టును. వస్తువును బురాణాదుల నుండి గ్రహిం నను సూక్ష్మాంశవర్ణన సందర్భమున నతఁడు తన నాఁటి సంఘమును బురస్క ంచుకొనియే రచన సాగించును. నిజమునకుఁ గావ్య వర్ణనములకు వస్తువును సమకూర్చునది సంఘమే యని చెప్ప వచ్చును. దానికిఁ గవి భావనా శక్తియుఁ దోడ్పడు చుండును. ప్రతి వ్యక్తియు నిత్యము నేవో కొన్ని విషయములను దృశ్యములను గనుచుండును. సామాన్య మానవులు తాము గన్న విశేషములను మరుక్షణమున విస్మరింతురు. కవియట్లుగాక తానుగన్న వానిని మనస్సున మననము చేసికొని, యాయా విషయములను మనోమంజూషలో భద్రపఱచి తరువాత కావ్యములను రచించునపు డవసరమగు సందర్భములలో నా భావముల నుపయోగించు కొనును. దానిని బట్టి కవికి రచనా సందర్భమున సంఘ మెట్లు తోడ్పడుచున్నదో తెలియుచున్నది. దర్శనము వర్ణనము నను నవి కవిధర్మములు, అలంకారికులు వర్ణన నిపుణత్వమునకుఁ బ్రాధాన్య మొసంగి యున్నారు. ఈ వర్ణనా నైపుణ్యము లోక సమ్యక్పరిశీలనమువలనఁ గలుగును.

కవి నొక విధముగా నాఁతడు నివసించు కాలమునకు బ్రతినిధియని చెప్ప వచ్చును. అతఁడు తన కావ్యములోఁ జెప్పు భావము లాతని నొక్కనికి మాత్రమే కాక యా కాలమునకు నప్పటి సమాజమునకును సంబంధించి యుండును. ఆ కారణము చేతనే మనము కావ్యములను జదువునప్పు డప్పటి ప్రజల భావములను సంఘ పరిస్థితులనుగూడఁ గొంచెముగానైనను గ్రహింపవచ్చును. షేక్స్పియరు నాటకములు, స్కాటు, డికెన్సు మున్నగు వారి నవలలు, గోల్డుస్మితు మున్నగు వారి రచనలు చదివినచో నా యా కాలములయందలి యాంగ్ల సంఘ పరిస్థితుల నవగాహనము చేసికొనవచ్చును. ఆంధ్ర వాఙ్మయమునఁ బాల్కురికి సోమనాథుని గ్రంథములును, హంసవింశతి, సింహాసనద్వాత్రింశిక, షోడశకుమార చరిత్రము మున్నగు కథా కావ్యములును, ప్రబంధములును, దత్తత్కాలపరిస్థితులను వ్యక్తము చేయుట యెల్ల రెఱింగినదే. ఇట్లే సంస్కృతము మున్నగు నితర

వాఙ్మయములఁ బరిశీలించినచో నా యా యుగము లందలి భారతీయ సంఘ సాంస్కృతిక పరిస్థితులు తెలియవచ్చును. సాహిత్యమునకుఁ దత్కాల పరిస్థితు లను దనలోఁ బ్రతిబింబింపఁజేయు గుణవిశేష ముండుట చేతనే చరిత్ర కారులు కూడఁ జరిత్రను నిర్మించునెడ నా కాలపు సాహిత్యమును సైతము మూలముగా గ్రహించి పరిశీలించుట యవసర మగుచున్నది.

"విశ్వ శ్రేయః కావ్య" మ్మని చింతామణి నుడువుచున్నది. ఉత్తమ కావ్యము లెప్పుడును విశ్వ శ్రేయమునకు సాధనములై జగత్కల్యాణమునకు సహాయములుగా నుండును ఉపదేశముకూడ కావ్యముయొక్క ప్రయోజనములలో నొకటి. అట్టిచో దురుపదేశకరములు, దుర్నీతి బోధకములు నగు కావ్యములను విసర్జింప వలసి యున్నది. దీనిని బట్టి కవు లుత్తమ ధర్మ బోధకము లగు కావ్యములను రచించి పరోక్షముగ నైనను సంఘ శ్రేయమునకై పాటు పడ వలసియున్నది. సత్కవులు తమ కావ్యములందు నీతి ధర్మములను సరసముగా నుపదేశించి సంఘమును సన్మార్గానుసరణ ప్రవణముగాఁ జేయుచుందురు. అందు చేతనే కవు లెన్నఁబడని శాసనకర్తలని యొక యాంగ్ల వాక్యము చెప్పు చున్నది.

ఒక్కొక్కప్పుడు సంఘమున దురాచారములు ప్రబలుటచే సంస్కరణ మవసరమగుచుండును. అట్టి తఱిఁ గవులును రచయితలును దమ కావ్యముల ద్వారా సంస్కరణాభిప్రాయమును బ్రచారముచేసి సంఘము నుద్ధరించుటకు యత్నించుచుందురు. ఆంగ్లమున అడిసన్, స్టీలు మున్నగువారును, తెనుఁగున సోమనాథుఁడు, వేమన, వీరేశలింగము, పానుగంటి ప్రభృతులును అందుకుఁ బ్రయత్నించి చాలవఱకుఁ గృతార్థు లయిరి. భారతదేశ స్వాతంత్ర్య సంపాదన విషయమునను, ఆంధ్రరాష్ట్ర స్థాపన విషయమునను గవులు నిర్వహించినపాత్ర సర్వజన విదిత మైనట్టిదే.

ఈ విధముగా సాహిత్యమునకును సంఘమునకును సన్నిహిత సంబంధ ముండునని తెలియుచున్నది. సంఘము సాహిత్యమునకు వస్తువును సమకూర్చి దానికి వైశాల్య వైవిధ్యములు గలిగించును. సాహిత్యము సంఘ పరిస్థితుల కాదర్శమువంటిదై యవసర మైనప్పుడు దానిని సంస్కరించి సన్మార్గమునకుఁ ద్రిప్పుటకు యత్నించును. కవులెంత ప్రతిభావంతులైనను సంఘమునం దంగము

లైన వ్యక్తులే. వారు దాని నాశ్రయించియో తమ కవితా వ్యాపారము సాగింతురు. అట్లు చేయనిచో వారి సృష్టి భాషాభివృద్ధి సాధనమైనను విశ్వశ్రేయమునకు సహాయము కాఁజాలదు;

## 11. కావ్యము-నాయికా నాయకులు

కావ్య ముపదేశాత్మకమై యుండవలయునన్న నందలి నాయకుఁ డుత్తమ చరిత్ర సంపన్నుఁడై యుండవలయును. కావ్యము నందలి యితివృత్తమును నడుపుచు ఫలమును బొందువాఁ డగుటచే నాయకుని కాపేరు కలిగినది. కులీనత (ఉన్నతకులసంభవము); మహాభాగ్యము (భూమండలాధిపత్యము), ఔజ్జ్వల్యము (రూపసంపన్నమైనదేహము కలిగియుండుట), ఔదార్యము(దానశీలము), తేజస్విత (జగత్ప్రకాశత్వము), ధార్మికత్వము (ధర్మపరాయణత), వైదగ్ధ్యము (కృత్య వస్తు కౌశలము), అను నేడును నాయక గుణములని చెప్పి విద్యానాధుఁడు వానికి మహా మహిమత్వము (దేవతా స్వరూపము కలిగియుండుట), పాండిత్యము (సర్వవిద్యాధికత్వము) అను వానిని గూడఁ గలిపియుండెను. సాహిత్యదర్పణ మున త్యాగి, కృతి కులీనుఁడు, రూపయౌవనోత్సాహ సంపన్నుఁడు, దక్షుఁడు, అనురక్తలోకుఁడు, తేజోవైదగ్ధ్య శీలవంతుఁడు నైనవాఁడు నాయకుఁ డని చెప్పఁబడినది. ధనంజయుఁడు దశరూపకమున నాయకుఁడు వినీతుఁడు, మధురుఁడు, త్యాగి, దక్షుఁడు, ప్రియంవదుఁడు, రక్తలోకుఁడు, శుచిఁ వాగ్మి, రూఢవంశుఁడు, స్థిరుఁడు యువకుఁడు బుద్ధ్యుత్సాహ స్మృతి ప్రజ్ఞా కళా మాన సమన్వితుఁడు శూరుఁడు, దృఢుఁడు, తేజస్వి, శాస్త్రచక్షువు, ధార్మికుఁడునై యుండవలె నని తెల్పి యున్నాఁడు. ఈ ముప్వురు చెప్పిన నాయక లక్షణములును గొంచె మించుమించుగా సమానములుగానే యున్నవి.

ప్రతాపరుద్రీయమున నాయక గుణములు చెప్పఁబడినపిమ్మట యశఃప్రతాప సుభగత్వము, ధర్మ కార్యార్థ తత్పరత్వము, ధురంధరత్వము గుణాఢ్యత, నాయక స్వరూపలక్షణము లని తెల్పఁబడినది. భట్టుమూర్తి వీని కార్తావనత్వము, భూభార వహన క్షమ బాహుత్వము అను వానినిగూడఁ జేర్చినాఁడు. ఇందలి లక్షణములు కొన్ని పైని పేర్కొనఁబడిన గుణములందే యంతర్భవించును. మరల వీనిని

చెప్పుట నాయకుని యందీ లక్షణములు తప్పక యుండవలెనని సూచించుటకే. ఈ గుణ స్వరూప లక్షణము లన్నియు నుండువాఁ డుత్తమనాయకుఁ డగును. అందుఁ గొన్నిమాత్రమే కలవాఁడు మధ్యముఁడు. బహు గుణ హీనుఁ డధముఁడు

నాయకభేదములు ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరశాంతుఁడు, ధీరలలితుఁడు, అని నాయకులు నలుతెఱఁగులుగా నుందురు. అవికత్థనుఁడు (ఆత్మస్తుతి లేనివాఁడు), క్షమావంతుఁడు (ఓర్పుగలవాఁడు), అతిగంభీరుఁడు, మహాసత్త్వుఁడు, స్థిరుఁడు, గూఢమానుఁడు (గూఢమైన కోపము గలవాఁడు) దృఢవ్రతుఁడునగువాఁడు ధీరోదాత్తుఁడు. ఇతఁడు శృంగార వీర రసములందు నాయకుఁడుగా నుండును. మాయా పరుఁడు, ప్రచండుఁడు, చపలుఁడు, అహంకార దర్ప భూయిష్ఠుఁడు, ఆత్మ స్తుతి పరాయణుఁడు నగువాఁడు ధీరోద్ధతుఁడు. ఇతఁడు వీరరౌద్ర రసములందు నాయకుఁడుగా నుండును. ధీరుఁడు, శాంతుఁడు ప్రసన్నాత్ముఁడు నైన ద్విజాదికుఁడు ధీరశాంతుఁడని (ధీరప్రశాంతుఁడనియుఁగొందఱందురు) ప్రతాపరుద్రీయము. కులీనత్వాది నాయక సామాన్యగుణములు కల ద్విజుఁడు ధీరశాంతుఁడని సాహిత్య దర్పణము. ద్విజుఁడనఁగా బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులలో నొకఁడు. ద్విజాదికః అనుదానికి దశరూపకము విప్రవణిక్సచివులని వ్యాఖ్యానము చేసియున్నది. భరతుఁడు నాట్యశాస్త్రములోఁ బ్రకరణమున అమాత్య విప్రవణిజులలో నొక్కని నాయకునిగాఁ జేయవలెనని చెప్పినాఁడు. దశరూపక నాట్యశాస్త్రములు రెండును క్షత్త్రియ శబ్దమునకు బదులమాత్య సచివ పదములను వాడి యుండుటచే రాజైన క్షత్త్రియుఁడు కాక మంత్రియైన క్షత్త్రియుఁడే ప్రకరణ నాయకుఁడై యుండవలెనని వారి యుద్దేశమైనట్లు తోఁచుచున్నది. మాలతీ మాధవమున మంత్రి పుత్త్రుఁడు నాయకుఁడుగా నున్నాఁడు. నిశ్చింతుఁడు. మృదు స్వభావుఁడు, నిత్యకళా నిరతుఁడుఁ నగువాఁడు ధీరలలితుఁడు. కళానిరతుఁడనఁగా నృత్యగాన చిత్రలేఖన కవితాదులగు లలిత కళలందాసక్తుఁడు. నాటికలందు ధీరలలితుఁడు నాయకుఁడుగా నుండును. కావ్యములం దంగి భూతులైన నాయకులలో నాద్యంతము ధీరోదాత్తాదులలో నెవ్వరో యొకరి లక్షణములే వర్ణింపఁబడవలయును. అవస్థా భేదములు వర్ణితము లైనచోఁ బ్రధాన రసమునకు భంగము వాటిల్లును.

శృంగార నాయకులు : దక్షిణుఁడు. అనుకూలుఁడు ధృష్టుఁడు. శఠుఁడు ని శృంగార నాయకులు నాలుగు విధములుగా నుందురు. అనేక నాయిక లందు మానానురాగము కలవాఁడు దక్షిణుఁడు-(శ్రీకృష్ణుఁడు). ఒకే నాయిక యందు శేషానురక్తుఁడై యుండువాఁ డనుకూలుఁడు (శ్రీరాముఁడు). అపరాధ నరించియు శంక లేనివాఁడును, తర్జితుఁడయ్యు లజ్జింపని వాఁడును దోషము వ్యక్తమగుచున్నను అసత్యము లాడువాఁడును ధృష్టుఁడు నాయికకు మాత్రమే లియున ట్లప్రియ మాచరించువాఁడు శఠుఁడు. ఇత డాచరించు నప్రియము ప్రియురాలికే కాని యితరులకుఁ దెలియదు.

పైని పేర్కొనఁబడిన ధీరోదాత్తాదులు నల్వు రొక్కొక్కరు దక్షిణాది భేదములచే నలుగురై మొత్తము పదునార్గు రగుదురు. ఈ పదునాఱుగురు నుత్తమ మధ్యమాధమ భేదముల నంది నలువది యెనమండ్రుగు రగుదురు.

జాతి భేదమునుబట్టి నాయకులు దత్తుఁడు. భద్రుఁడు, కూచికుమారుఁడు, పాంచాలుఁడు అని నాలుగు తెఱఁగు లని కామశాస్త్రము చెప్పుచున్నది. అందు దత్తుడు పద్మినీ వల్లభుఁడు. భద్రుడు చిత్రిణీ ప్రియుఁడు. పాంచాలుఁడు హస్తినీ ప్రియుఁడు; కూచికుమారుఁడు శంఖిని ప్రియుఁడు. జాతిని బట్టి నాయకులు మరల దివ్యులు,అదివ్యులు దివ్యాదివ్యులు అని మూఁడు తెఱఁగులుగా విభజింపఁ బడినారు. కేవల దివ్యులగు శంకరాదులు. దివ్యులు. కేవల మర్త్యులగు దుష్యంతాదు లదివ్యులు. దేవమానవాంశలు రెండునుగల కృష్ణాదులు దివ్యాదివ్యులు.

నాయక సహాయములు : పైని పేర్కొనఁబడిన నాయకులకు నాయికా సమాగమ సంఘటనమున సాయ మొనర్చు సహాయులు నలువు రున్నారు. వారు విట పీఠమర్ద చేట విదూషకులు. అందు సంభోగ హీన సంపత్కుఁడు (నపుంసకుఁడని వ్యాఖ్య) ధూర్తుఁడు. కళలలో నేకదేశము నెఱింగినవాడు, వేశ్యానాగరిక సమాగమ సంఘటన కుశలుఁడు వాగ్మి, మధురుఁడు, గోష్ఠి బహుమానితుఁడు నగు వాఁడు విటుఁడు. ప్రధానవృత్తమునందు వచ్చు ప్రాసంగికేతివృత్తమునకు నాయకుఁడును, ప్రధాన నాయకునికంటెఁ గొంచెము తక్కువ గుణములు గలవాఁడును నగు వాఁడు పీఠమర్దుఁడు. ఇతఁడు ప్రాసంగికేతివృత్తమున నైనను నాయకుఁడై ప్రత్యేక ప్రయోజనమును బొందును గావున

వితనిని కేవల శృంగార సహాయులలోఁ జేర్పరాదని కొందఱి మతము నాయికా నాయకులకు సంధానము కూర్చుట యందు నిపుణుఁడు చేటుఁడు. హాస్యకలహ ప్రియుఁడు విదూషకుఁడు. సంస్కృత నాటకములలో సాధారణముగా విట పీఠ మర్దులకు సంస్కృత భాషయు, చేటవిదూషకులకుఁ బ్రాకృతభాషయు నుపయోగింపఁ బడుచుండును. దీనిని బట్టి విటపీఠమర్దు లుత్తమ పాత్రలనియు బ్రాహ్మణుఁడును రాజావలంబనము కలవాఁడు నగుటచే విదూషకుఁడు మధ్యమ పాత్ర యనియు, చేటుఁ డధమపాత్రయనియు నూహింపవచ్చును. కొందఱు విదూషకునిఁ గూడ నీచపాత్రగానే పరిగణింతురు. ఇతఁడు సాధారణముగా వేషభాషలచే హాస్యము పుట్టించు వాఁడును, భోజన ప్రియుఁడును, బ్రాహ్మణుఁడునై యుండును.

వీరు కాక శకారుఁడు, తాంబూలికుఁడు, గాంధికుఁడు, మాలాకారుఁడు, రజకుఁడు, వామన షండ కిరాత మ్లేచ్ఛ కుబ్జాదులు కూడ నటనట శృంగార సహాయులుగా నుండుట కలదు. మృచ్ఛకటికమున శకార పాత్ర అద్భుతముగాఁ బోషింపఁబడినది. ఇతఁడు రాజుగారి యుంపుడుకత్తెకు తమ్ముడును, మూర్ఖుఁడును, మత్తుఁడునుగా వర్ణింపఁబడును.

<u>నాయికాభేదములు</u> : స్వీయ, అన్య, సామాన్య అని నాయికలు మూఁడు తెఱఁగులుగా నుందురు. లజ్జ, ఆర్జవము, పాతివ్రత్యము, కోమలత్వము, సౌందర్యము కలిగి అగ్నిసాక్షిగాఁ బెండ్లి చేసికొన్న యుత్తమురాలు స్వీయ. అన్య కన్య, అన్యోఢ అని యిరు తెఱఁగులు. కన్య యనఁగా అవివాహిత. అన్యోఢ యనఁగాఁ బరుని భార్య. ఏదో మిషతో నటునిటు తిరుగుచుండునదియు, కులటయు సిగ్గువిడిచినదియు అన్యోఢ యని సాహిత్యదర్పణము చెప్పుచున్నది. సామాన్య యనఁగా వేశ్య. ఈమె సర్వసాధారణ స్త్రీ. సాహిత్యదర్పణమున ధీరురాలు కళా కుశల, యగు వేశ్య సామాన్య యని చెప్పఁబడినది. ప్రహసనమున తప్ప మిగిలిన ప్రకరణాదులలో నీమె యనురాగవతిగానే యుండును. మృచ్ఛకటిక మందలి వసంత సేన యిందుకు నిదర్శనము.

స్వీయ-ముగ్ధ, మధ్య, ప్రౌఢ యని మూఁడు తెఱఁగులు, ఇవి యౌవన సంబంధమును బట్టి యేర్పడిన భేదములు. అప్పుడే యంకురించిన యౌవనమును మన్మథ వికారమును గలదియు, రతియందుఁ బ్రతికూలయు, మృదువైన ప్రణయ

పము కలదియు. నధిక లజ్జాసమన్వితయు నగునది ముగ్ధ. ప్రగాఢమైన 'వనమును మదన వికారమును గలదియు నించుక ప్రగల్భమగు వాక్కులు దియు. సామాన్యమైన (అంతయెక్కువ తక్కువకాని) లజ్జగలదయునగు యిక మధ్య. సంపూర్ణ యౌవన, సమస్తరతికోవిద; ఉన్మత శృంగారభావ. అల్ప ఆక్రాంత నాయక యగునది ప్రౌఢ. అనంతామాత్యుఁడు ప్రౌఢ-ప్రగల్భ, 'ఢ యని రెంతు తెఱఁగులుగా నుండునని తెల్పెను. పూర్ణయౌవనము గలది గల్భ-పురుషాయిత కౌశల ప్రౌఢ. అతఁడు లోల యను మఱియొక నాయికా దమునుగూడఁ జూపెను. వార్ధక్యారంభమున నున్నదియు, నాయకుఁడించుక లికినను, జూచినను జేసన్న కావించినను రత్యానందము నొందునదియు లోల.

ముగ్ధా, మధ్యా ప్రౌఢా నాయికలలో మధ్యయుఁ బ్రౌఢయు ధీర-అధీర- రాధీర అని మూఁడేసి భేదములు వహింతురు. ధీర యనఁగాఁ బ్రణయకోప విష మున ధీరత్వము కలది. అధీర యనఁగా ధీరత్వము లేనిది. ధీరాధీరయనఁగా ంత యెక్కువయుఁ దక్కువయుఁగాని ధీరత్వము కలది. ప్రియుఁ డపరాధ నరించునపు డతని నెత్తిపొడుపుతోఁ గూడిన వక్రోక్తులతోఁ గేరడము లాడు ది (1) మధ్యాధీర, పరుషోక్తులతోఁ గోపము వ్యక్తము చేయునది (2) మధ్యా- ధీర, రుదిత ప్రధానోక్తులతోఁ గోపము ప్రకటించునది. (3) మధ్యా ధీరాధీర. 'పమును మఱుగుపుచ్చి పైకాదారమును జూపుచు సురతమున నౌదాసీన్యము హించునది (4) ప్రౌఢా ధీర. ప్రియు నిఁ గోపమునఁ దాడించునది (5) ప్రౌఢా ధీర. అత్యంత వక్రోక్తులతో భేదపఱుచునది (6) ప్రౌఢా ధీరాధీర. ముగ్ధయందు భేదములు లేవు. ఆఱువిధములైన మధ్యా ప్రౌఢలు జ్యేష్ఠా కనిష్ఠా భేదములచేఁ బండ్రెండు తెఱంగు లగుదురు. ముగ్ధకూడఁ జేరిన పదుముగ్గురు. స్వీయ యందలి పదమూఁడు భేదములును, పరకీయ యందలి (అన్యోఢకన్య) రెండు భేదములును ఏకవిధయైన సామాన్యయుఁ గలసి నాయికలు మొత్తము పదునార్గు రగుదురు.

అష్టవిధ శృంగార నాయికలు : అవస్థా భేదమును బట్టి నాయిక లెనిమిది తెఱంగులుగా నుందురు. అందుఁ బరస్త్రీలను గాంక్షింపక తనయందే యనురాగము గల్గి తన కధీనుఁడై యుండు భర్తగలది స్వాధీనభర్తృక. ప్రియుఁడు వచ్చు వేళకుఁ దన్ను గృహమును అలంకరించుకొని సిద్ధముగా నుండునది వాసకసజ్జలేక

వాసకసజ్జిక. ప్రియుఁడు చెప్పిన వేళకు దాటి యాలస్యము చేయ నుత్కంఠ తాల్చునది విరహోత్క లేక విరహోత్కంఠిత. సంకేత స్థలమున కరిగి యటఁ బ్రియునిఁ గానక యార్తి చెందునది విప్రలబ్ధ. ప్రియుఁడు రాత్రి యంతయు నన్య కాంతతోఁ గ్రీడించి వేకువ నింటికి రాఁగా సంభోగ చిహ్నముల గాంచి కుందునది ఖండిత. కోపమునఁ బ్రియుని నిందించి వెడలఁగొట్టి యనంతరము పశ్చాత్తాపము నొందునది కలహాంతరిత. ప్రియుఁడు పరదేశగతుఁడు గాఁగా విరహమునఁ గృశించునది ప్రోషితభర్తృక. మదనార్తయై ప్రియుని యొద్దకుఁ దానే స్వయముగాఁ బోవునది అభిసారిక. తాను బోక ప్రియునిఁ దనయొద్దకు రప్పించుకొనునదియు నభిసారికయే ఈ యభిసారిక జ్యోత్స్నాభిసారిక, తమోఽభిసారిక. దివసాభిసారిక యని ముత్తెఱఁగులు. తెల్లనివలువలు, తెల్లపువ్వులు, తెల్లని గంధహారాదులు ధరించి వెన్నెలలో బ్రియు నభిసరించునది జ్యోత్స్నాభిసారిక. నల్లని వస్త్రములు, నల్లనిపుష్పాదులు ధరించి చీఁకటిలో బ్రియు నభిసరించునది తమోఽభిసారిక. పగలింటిలోని వారందఱు కార్యాంతర తత్పరులై యెండైన నరుగ నేదోనెపము పెట్టి తానింటనేయుండి ప్రియునింటికిరప్పించుకొనునది దివసాభిసారిక. సామాన్య (వేశ్య) విచిత్రోజ్జ్వలవేషము ధరించి నూపురమును మేఖలయుమెరయుచుండ సంతోష స్మేరవదనయై యభిసరించును. ఈ సామాన్యాభిసారికను ఉజ్జ్వలాభిసారిక యనియు నందురు. రసమంజరిలో ప్రవత్స్యత్పతిక యను తొమ్మిదవ నాయిక కూడఁ జెప్పఁబడినది. అగ్రిమక్షమున దేశాంతరమునకుఁ బోనున్న భర్తగలది ప్రవత్స్యత్పతిక. కాకువచన, కాతర ప్రేక్షణ నిర్వేద. సంతాప; నిశ్వాస బాష్ప గమనవిఘ్న కరణాదు లీమె లక్షణములు. ఈమెయు ప్రోషిత భర్తృకయందే యంతర్భవించును. గావున నీనవమ భేదము చెప్పనవసరములేదని కొందఱి మతము. పైని పేర్కొనఁబడిన పదునార్గురు నాయికలం దొక్కొక్కతెయు నీ యష్టవిధ భేదదముల నందినచో మొత్తము నాయికలసంఖ్య నూటయిరువదెనిమిది యగును.

నాయికా సహాయలు (దూతికలు) : సఖి నటి, దాసి. ధాత్రేయి, పొరుగున నున్న స్త్రీ ( ప్రతివేశిని) బాలిక, యోగిని, శిల్పిని, తాంబూలిక, గాంధిక, రజకి, పాచన స్త్రీ. గాయక స్త్రీ మున్నగువారు నాయికలకు ప్రియసమాగమ సంఘటనమున దూతికలై సహాయలుగా వర్తింతురు. ఒక్కొక్కప్పుడు నాయిక తానే స్వయముగా దూతీ కృత్య మొనర్చుటయుఁ గలదు.

## 12. కావ్య భేదములు ✓

స్వభావ స్వరూప వస్త్వర్థాదులను బట్టి కావ్యము పలువిధములుగా విభ జింపఁబడినది. అందు స్వభావమును బట్టి యది శ్రవ్యము, దృశ్యము అని రెండు విధములు. వినుటకు మాత్రమే యోగ్యమైనది శ్రవ్యము. వినుటకు మాత్రమేకాక రంగమునఁ బ్రదర్శింపఁబడుచుండగాఁ జూచుటకుఁ గూడ యోగ్యమైనది దృశ్యము, ఈ దృశ్యమునకే రూపకమని మఱొకపేరు. ఇందు రామ రావణాది పాత్రల వేషభాషాదులు నటులం దారోపింపఁబడును గావున దీనికీపేరు కల్గినది.

స్వరూపమును బట్టి కావ్యములు పద్య కావ్యములు, గద్య కావ్యములు, ఉభయ కావ్యములు అని మూఁడు విధములు. కేవల పద్య మయములైన కావ్య ములు పద్యకావ్యములు, కేవల గద్య మయములైనవి గద్య కావ్యములు. పద్య గద్యోభయ మయములైనవి యుభయ కావ్యములు. వీనికే చంపువులని యింకొక పేరు. సంస్కృతమున రూపకములు గద్యపద్య మయములుగానే యుండును. ఇప్పు డన్ని భాషలలోను దృశ్య కావ్యములను గూడ మూఁడు విధములుగాను రచించు చున్నారు.

వస్తువునుబట్టి కావ్యము ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రముఅని మూఁడు విధములు. భారత భాగవత రామాయణాదులందుఁ బ్రసిద్ధమైన వస్తువు గలది ప్రఖ్యాతము. కేవల కవికల్పితమైన వస్తువుగలది ఉత్పాద్యము. కొంత ప్రఖ్యాత మును గొంత ఉత్పాద్యమును నైన వస్తువు కలది మిశ్రము. భట్టుమూర్తి వసు చరిత్రమున కేవల కల్పనా కథలు కృతిమరత్నము లనియు, నాద్య సత్కథలు పుట్టు రత్నము లనియు, కవికల్పనతోఁ గూడిన పూర్వ వృత్తములు సానఁ దీఱిన జాతిరత్నము లనియుఁ దెల్పి మిశ్రమే రమణీయమైనదని సూచించినాఁడు.

అర్థమును బట్టి కావ్యము ధ్వనికావ్యము, గుణీభూత వ్యంగ్య కావ్యము చిత్ర కావ్యము అని మూఁడు విధములు. రసాలంకార వస్తుధ్వనులలో నేదో యొకటి ప్రధానముగా (అనగా వాచ్యార్థము కంటె సుందర తరముగా) నున్నచో నది ధ్వనికావ్యము. దీనినే యుత్తమకావ్య మందురు. వ్యంగ్యార్థ మప్రధానముగా నుండుచో (అనఁగా వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థమే సుందరతరముగా

నుండుచో) నది గుణీభూత వ్యంగ్య కావ్యము. దీనిని మధ్యమ కావ్యమందురు. వ్యంగ్యార్థ మస్ఫుటముగాఁ గాని గూఢముగాఁ గాని యున్నచో నది చిత్రకావ్యము. దీనినే అధమ కావ్యమందురు. జగన్నాథుఁడు కావ్యమును ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము అని నాలుగు విధములుగా విభజించెను. పూర్వులు పేర్కొన్న యుత్తమమునే యతఁడుత్తమోత్తమ మనెను. ఇది వ్యంగ్య ప్రధానముగా నుండును. వ్యంగ్యార్థ మప్రధానమైనను చమత్కార కారణమై విలసిల్లుచో నది యతని మతమున నుత్తమము. పూర్వుల గుణీభూత వ్యంగ్య కావ్యమునే యతఁడు ఉత్తమము మధ్యమము అని రెండు తెఱఁగులుగా విభజించెనని చెప్పవచ్చును. పూర్వుల చిత్ర కావ్యమునకు అతని అధమ కావ్యమునకును భేదమే లేదు. కాని దాని నతఁడు అర్థ చిత్ర ప్రధానము, శబ్దచిత్ర ప్రధానము అని రెండు విధములుగా విభజించెను.

భోజుడు సరస్వతీ కంఠాభరణమున కావ్యము లాఱు విధములని తెల్పెను. కావ్యము, శాస్త్రము, ఇతిహాసము, కావ్యశాస్త్రము, కావ్యేతిహాసము, శాస్త్రేతిహాసము అనున వాతఁడు చెప్పిన యాఱుభేదములు. కావ్యశాస్త్ర మనఁ గావ్యశాస్త్ర లక్షణములు రెండును గలిగినట్టిది. కావ్యేతిహాసము, శాస్త్రేతిహాసముఅను వానిని గూడ నిట్లే సమన్వయించు కొనవలయును. క్షేమేంద్రుడు శాస్త్ర కావ్యము, కావ్య శాస్త్రము అను భేదములు తెల్పి వానికిఁ గ్రమముగా భట్టికావ్యమును, దశ చతుర్వర్గ సారసంగ్రహమును ఉదాహరణములుగాఁ జూపెను. కావ్యరూపమున వ్రాయఁబడిన శాస్త్రము శాస్త్ర కావ్యము. చతుర్వర్గనిరూపణమును రస నిరూపణమును రెండును గల కావ్యము కావ్య శాస్త్రము. మొత్తము మీఁద నీ రెండింటఁ గావ్య శాస్త్ర లక్షణములు రెండును గోచరించును.

వామనుఁడు కావ్యాలంకార సూత్రవృత్తిలో గద్యపద్యాత్మకమైన కావ్యము నిబద్ధము-అనిబద్ధము అని రెండు తెఱంగులుగా [illegible]డునని చెప్పినాఁడు. సిగదండ వలె నిబిడము సుందరమునైన కూర్పుగలది నిబద్ధము. మాలాకారుఁడు మొదట పుష్పముల నొకదండగా గ్రుచ్చుట నభ్యసించి పిమ్మట సుందరమైనయుత్తంసము (సిగదండ) కూర్చుటయందు సమర్థుఁ డగునట్లుగాఁ గవియు మొదట విడిగాఁ బద్యగద్యములు రచించుట నేర్చుకొని తరువాతి గ్రంథరచనకు సమర్థుఁడగును.

[illegible] 57 [illegible]

ఇట్టి గ్రంథములు నిబద్ధములు. (ఉదా॥ ప్రబంధాదులు) కొందఱు విడి పద్యములను గద్యములను రచించుటతోనే తృప్తి నొందుదురు. ఇవి అనిబద్ధములు తేజః పరమాణు వొకటివలె గ్రంథరూపమునఁ గూర్పఁబడని అనిబద్ధ కావ్యము ప్రకాశింపదని వామనుని యభిప్రాయము.

నన్నెచోడుఁడు కుమారసంభవమున మార్గదేశీ కవిత్వములను పేర్కొనెను. ఈ సంప్రదాయము సంగీత శాస్త్రమునందును కన్నడమునందును గలదు. సంస్కృత భాషా కవిత్వము మార్గమనియు దేశభాషాకవిత్వము దేశీ యనియుఁ గొందఱు తలంతురు కొందఱు అట్లు కాక దేశభాషలందుఁ గూడ నీరెండు తెఱఁగులైన కావ్యము లుండునని యభిప్రాయ పడుచున్నారు. వీరి యభిప్రాయము ప్రకారము సంస్కృత లక్షణ సంప్రదాయముల ననుసరించి సంస్కృత భాషా బహుళముగా రచింపఁబడు కవిత్వము మార్గము. దేశీయ వృత్తముతో దేశీయ చ్ఛందములో దేశభాషా బహుళముగా రచింపఁబడునది దేశీకవిత్వము.

శ్రవ్యకావ్యములు-పద్యకావ్యము : శ్రవ్యకావ్యము-పద్యకావ్యము, గద్యకావ్యము, చంపూకావ్యము అని మూఁడు విధములని పైని పేర్కొనఁబడినది. అందు పద్యకావ్యము-మహాకావ్యము, ఉపకావ్యము (క్షుద్రకావ్యము) అని రెండు విధములు. అష్టాదశ విశిష్ట వర్ణనములతోఁ గూడినది మహాకావ్యము. ఈ వర్ణనల సంఖ్య విషయమున నభిప్రాయ భేదము లున్నవి నగరము, సముద్రము, శైలము, ఋతువులు, చంద్రోదయము, సూర్యోదయము ఉద్యానము, జలక్రీడ, మధుపానము రతోత్సవము, విప్రలంభము, వివాహము, కుమారోదయము, మంత్రము ద్యూతము, ప్రయాణము, యుద్ధము నాయకాభ్యుదయము అను పదునెనిమిదియు వర్ణ్యములైన యంశములని ప్రతాపరుద్రీయము చెప్పుచున్నది. నరసభూపాలీయమున ద్యూతమునకు బదులు దౌత్యమును మధుపానమునకు బదులు మధువును చెప్పఁబడినవి. మధు వనఁగా వసంతము. ఇది ఋతువులలోనిదే కావున దీనిని మరల చెప్పవలసిన యవసరము లేదు. సాహిత్యదర్పణము సంధ్య, సూర్యుఁడు, చంద్రుఁడు, రాత్రి, ప్రదోషము, చీఁకటి, దినము, ఉదయము, మధ్యాహ్నము, మృగయ, శైలము, ఋతువు, వనము, సాగరము, సంభోగము విప్రలంభము, ముని, స్వర్గపురము, అధ్వరము, రణము, ప్రయాణము, వివాహము మంత్రము.

పుత్రోదయము అనునని వర్ణ్యాంశములని తెల్పి సంధ్యనుండి సాగరము వఱకుఁ గల వానివి యథాయోగముగను సంభోగము నుండి పుత్రోదయము వఱకుఁగల పదింటిని సాంగోపాంగముగను వర్ణింపవలె నని సూచించెను. అప్పకవి ప్రతాప రుద్రీయమునందలి పదునెనిమిదింటికి వేఁట, మౌనీంద్ర పుణ్యాశ్రమము, కన్యాంగ సౌందర్యము, దౌహృదము అను నాల్గింటిని జేర్చి వర్ణ్యాంశము లిరువది రెండని చెప్పెను. అలంకారశేఖరకారుఁడు ముప్పదిరెండు వర్ణనీయములను దెల్పెను. పలువు రష్టాదశ సంఖ్యనే యంగీకరించిరి. ఈ విధముగా వారు వర్ణనీయాంశముల సంఖ్యను నిర్దేశించియు అందుఁ గొన్నిటిని విడిచినను మహా కావ్యత్వము కు భంగము లేదని తెల్పియుండిరి.

ఇతిహాసము : ఇతి + హ + ఆస (ఇట్లుండెను) అని దీనికి వ్యుత్పత్తి. ధర్మార్థ కామమోక్షముల యుపదేశముతోఁ గూడి కథాయుక్తమైన పూర్వవృత్త మితిహాస మని చెప్పఁబడును. ఇందు పూర్వరాజాదుల కథ లుండును. మహా భారత మిందు కుదాహరణము.

పురాణము : పురా నవం పురాణ మని దీని నిర్వచనము. ఇందు పంచ లక్షణములుండును. సర్గము. ప్రతిసర్గము (బ్రహ్మాదుల సృష్టి) వంశము (దేవాసురాది విభేదోత్పత్తి) మన్వంతరము, వంశాను చరితము అనున వా పంచ లక్షణములు, కాలక్రమమున నితిహాసములందు వలె నిందును బెక్కు కథలు ప్రవేశించినవి. అందుచే పురాణేతిహాసములు రెండును గొంచె మించు మించుగా సమానములగుట సంభవించినది.

ఉపకావ్యములు : సర్గబంధము లేని కావ్యము లుపకావ్యములు. వీనికి క్షుద్ర కావ్యములని మఱొక పేరు. ఇచ్చట క్షుద్ర శబ్దము పరిమాణ సంబంధియే కాని స్వభావ సంబంధి కాదు. క్షుద్ర కావ్యమనఁగాఁ జిన్న కావ్యమని యర్థము. క్షుద్ర కావ్యములలో ముఖ్యము లైనవి మాత్రమే యిట పేర్కొనఁబడును.

ఉదాహరణము : ఆంధ్ర వాఙ్మయమునకుఁ బ్రత్యేకమైన ప్రక్రియలలో నిది యొకటి. సంస్కృతమున రెండు మూఁడుదాహరణములు మాత్రమే యున్నవి. తెలుఁగున పాల్కురికి సోమనాథుని కాలమునుండి నేఁటి వఱకును

ఉదాహరణములు రచింపఁబడుచున్నవి. సంస్కృతాంధ్రములు రెండింట మొదటి యుదాహరణమును వెలయించిన వాఁడు పాల్కురికి సోమనాథుడే ఉదాహరణము పదపద్యోభయ లక్షణములు గల ప్రక్రియ. ఆశు. మధుర, చిత్ర, విస్తరము లను కవితా భేదములను మధుర జాతికిఁ జెందినది

ఉదాహరణము స్తోత్ర రూపమైన చిన్న కావ్యము. మొదట దేవతలస్తోత్ర మునకే యిది రచింపఁబడు చుండినను తరువాత మానవ దేశనాయక స్తోత్ర పరముగాఁగూడ వ్రాయఁబడుచు వచ్చినది. ఇందు మొత్తమిరువదియాఱు పద్య గేయ భాగములుండును. సప్త విభక్తులు సంబోధన విభక్తి అను నెనిమిది విభక్తు లలో నొక్కొక్క విభక్తి కొక్కొక్కవృత్తము, ఒక్కొక్క కళిక, ఒక్కొక్క ఉత్కళిక వ్రాయఁబడుచుండును. పిమ్మట సార్వవిభక్తిక పద్య మొక్కటియు నంకితాంక పద్య మొకటియు నుండును. వృత్తములలో చంప కోత్పల శార్దూల మత్తేభములను మాత్రమే వాడుదురు. కళికోత్కళికలు తాళాంగ ప్రధానములైన రగడ భేదములు. సంగీత శాస్త్రమునకు సంబంధించిన త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర సంకీర్ణగతులు క్రమముగా మూఁడు, నాలుగు, ఐదు, ఏడు, ఎనిమిది మాత్రలు కలిగియుండును. వీనిలో దేనియందైనఁ గల మాత్రలను రెండుచేఁ గాని నాలుగుచేఁగాని యెనిమిదిచేఁగాని హెచ్చించి యా మాత్రలసంఖ్యతోఁ గూడిన యొక్కొక్క పాదము చివరఁ దత్తద్విభక్తి ప్రత్యయములుచేర్చుచు నట్టి పాదము లెనిమిది రచించిన నొక కళిక యగును. ఉత్కళిక యనఁగా నర్ధకళిక. అనఁగా కళిక పాదములలో పదునాఱేసి మాత్ర లుండిన నుత్కళిక పాదములలో నెనిమిదేసి మాత్రలే యుండును. కళికవలె నిదియు నష్టపదియే. ఇందు కళికలోవలెఁ బ్రతి పాదము చివర విభక్తి ప్రత్యయము లుండ నవసరము లేదు. (ప్రతాపరుద్రీయమున నిందు ప్రతి పాదాంతము నందు విభక్త్యాభాసము లుండవలెనని చెప్పఁబడినది. విభక్తి వలెఁగనఁబడునవి విభక్త్యాభాసములు.) ఎనిమిదవపాదము చివరమాత్రము విభక్తి ప్రత్యయ ముండవలెను. అప్పకవి యుత్కళిక యందలి యెనిమిది పాదములు నొకటే సమాసముగా నుండవలెనని చెప్పియున్నాఁడు. కాని పెక్కు లక్ష్యములలో నీ లక్షణము కనిపింపదు. లక్షణము విధింపక పోయినను ఉత్కళిక పాదములలోఁ బెక్కింట నంత్యప్రాసనియ మము గోచరించుచున్నది. కళికోత్కళికలు రెండింట రెండేసి పాదముల కొక

ప్రాసముండును. యతినియమము కళికపాదములలోనే కాని యుత్కళిక పాదములలోఁ గాసరాదు.

ఉదాహరణమునందు ప్రథమా విభక్తికి డు, ము, వు లలో నొకటియు, ద్వితీయా విభక్తికిని, ను, ల కూర్చి అను వానిలో నొకటియు తృతీయా విభక్తికి చేతయు, చతుర్థీ విభక్తికి కై యు, పంచమీ విభక్తికి వలనయు షష్ఠీ విభక్తికి కు లలో నొకటియు, సప్తమీ విభక్తికి అందు అను నదియు వాడఁబడును ఇతర ప్రత్యయములు కానరావు. ఉదాహరణ మందలి పద్యములందును కళికోత్కళికలందును విభక్తి ప్రత్యయములు వాడఁబడును. గాన అవి తెలుఁగు నందలి విభక్తి ప్రత్యయముల చరిత్ర నెఱుంగుటకుఁ జాల తోడ్పడును.

సార్వ విభక్తిక మనఁగా నన్ని విభక్తులతోఁ గూడిన పద్యము. ఇందు ప్రథమాది క్రమమున నెనిమిది విభక్తులు వాడఁబడును. ఇది సాధారణముగా శార్దూల వృత్తమున నుండును. అంకితాంక పద్యమున కవిపేరు, కృతిపేరు, రచించిన సంవత్సరము చెప్పఁబడును. కొన్ని యుదాహరణములలో సీయిరువదియాఱవ పద్యములేకపోవుటయుఁ గలదు

ప్రతాపరుద్రీయమున ఉదాహరణము 'జయతి' శబ్దముతో నారంభ మగు మాలిన్యాది వృత్తములలో నొక దానితో మొదలిడ వలెననియు, తరువాత అపిచ అనుదానితో నారంభించి ప్రాసతాళములతోఁ గూడిన యెనిమిది వాక్యములు ప్రతి విభక్తికిని రచింపవలెననియు, పిమ్మట విభక్త్యాభాసము లుండ వలెననియు జెప్పఁబడియున్నది. ఈ లక్షణము సంస్కృతోదాహరణములకే యన్వయించును తెలుఁగున 'జయతి' అను పదముతోఁగాని తత్సదృశ పదముతోఁగాని యారంభించు నుదాహరణ మొక్కటియు లేదు 'అపిచ' అనుటకు బదులు కళికలకు మొదట తెలుఁగున మఱియు ననుమాట వాడఁబడియున్నది.

అప్పకవి సద్దలి, బద్దలి, విద్దలి, ఉత్ఫుల్లకము అని యుదాహరణములను నాలుగు తెగలుగా విభజించినాఁడు అందు సంబుద్ధి విడిచి మిగిలిన యేడు విభక్తుల మాత్రమే చెప్పిన నది సద్దలి. సంబుద్ధితోఁ గలిపి యెనిమిది విభక్తులు చెప్పిన న బద్దలి. సంబుద్ధితో విషమ (1,3,5,7) విభక్తులను మాత్రమే చెప్పిన నది విద్దలి

కేవల కళికోత్కళికలు మాత్రము చెప్పిన నది ఉత్ఫుల్లకము. విన్నకోట పెద్దన్న ఉత్ఫుల్లకమును విడిచి మిగిలిన మూఁడు మాత్రమే చెప్పినాఁడు. అప్పకవి "సంబుద్ధితోఁగూడ సప్త విభక్తులు పలుక నొప్పారు బద్దలి యనంగ" నని చెప్ప నతఁడు "సరి విభక్తుల సంబుద్ధి సహితగాఁగఁ జెప్ప నొప్పారు బద్ధళిసిద్ధమగుచు" నని నిర్వచించినాఁడు. అట్లే అప్పకవి "సంబుద్ధితోడ విషమ విభక్తుల తోడఁ బలికిన కృతి" విద్దలి యనఁగా నతఁడు "ముక్తసంబుద్ధి విషమ విభక్తి కలిత యైనకృతి" విద్ధళి యని చెప్పినాఁడు. ఇవి యుదాహరణముల పూర్వరూపముననియు క్రమముగా నివే యుదాహరణములుగాఁ బరిణమించిన వనియు శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు సూచించి యున్నారు.

యక్షగానము : ఇదియు మధుర కవితా జాతికిఁ జెందినదే. ఇది నృత్య సంగీత ప్రధానమైన దేశి రూపకము. ఇందు పాత్ర పోషణమునకేకాని కథా కల్పనమున కంతగాఁ బ్రాధాన్యముండదు. జక్కులు లేక యక్షిలు. అనువారి దేశి రూపకములను జేపట్టిన కతమున వానికి జక్కుల పాటలు లేక యక్షగానములు అను పేరు కలిగెనని విమర్శకుల యభిప్రాయము. ఇవి సుమారు క్రీ. శ. 12వ శతాబ్దినుండియు నుండెననుట కాధారములున్నను అప్పకవికి ముందున్న లాక్షణికు లెవ్వరును వీని లక్షణమును జెప్పియుండలేదు. అతఁడు నవవిధరగడలలోఁ గొన్నిమార్పులు సూచించి వానిని త్రిపుట, జంపె, మున్నగు తాళముల కనుగుణముగాఁ జేసి యక్షగానములలోఁ బాడుదు రని చెప్పియుండెను. ఈరగడ భేదములేకాక యక్షగానములలో ఏలలు, జోలలు, సువ్వాలలు, ధవళములు, వెన్నెల పదములు, తుమ్మెద పదములు, అల్లోనేరేళ్ళు, త్రిభంగులు, జక్కుల తేకులు, ద్విపద త్రిపదాదులు, మంజరులు, చందమామ సుద్దులు మున్నగు నితర దేశి రచనలుకూడ చేరినవి. ఇందు సూత్రధారుఁడు రంగముననిల్చి కథా వృత్తమును నడుపుచుండ తదుక్తుల ననుసరించి పాత్రలు ప్రవేశించి యా యా భావములను వ్యక్తము చేయుచుండును. ఈ యక్షగానములే క్రమముగా హరికథా రూపమునఁ బరిణామము చెందినవని కొందఱు విమర్శకుల అభిప్రాయము.

చక్రవాళము : ఇందు మొదట నొక పద్యమును బిమ్మట నెనిమిది దళములు గల కళికయు నుండును. ఈ రెండును ముక్తపద గ్రస్తములును, సంబోధ నాంతములునై యుండ వలయును.

మంజరి : తరుణీమణి శృంగారము, విరహము, వసంత మన్మథ విజృంభణము, వనజల క్రీడలు మున్నగునవి గల కావ్యము మంజరీ కావ్యము.

తారావళి : ఒక్కొక్క పద్యమున నొక్కొక్క నక్షత్రము (అశ్విన్యాది) పేరువచ్చునట్లుగా ఇరువదేడు పద్యములు వ్రాసిన నది తారావళి యనఁబడును. లక్షణ మిట్లున్నను గొందఱు రచించు తారావళులలోఁ బద్య సంఖ్యయే కాని నక్షత్ర నామములు కానరావు. తొమ్మిది పద్యముల కావ్యమునకు రత్నావళి యనియు, నైదు పద్యముల కావ్యమునకు పంచాననావళి యనియు పేర్లు. వీనినే క్రమముగా నవరత్నములు, పంచరత్నములు అని పిల్చుచుందురు.

అప్పకవి ముక్తకము (ఒక్క పద్యము) ద్వికము (రెండు పద్యముల కావ్యము), త్రికము (మూఁడు పద్యముల కావ్యము), వారణమాల (ఎనిమిది పద్యముల కావ్యము, భాస్కర మాలిక (పండ్రెండు పద్యముల కావ్యము), శశికళ (పదియాఱు పద్యముల కావ్యము), త్రింశత్తు (ముప్పది పద్యముల కావ్యము), పంచాశత్తు (ఏఁబది పద్యముల కావ్యము), శతకము (నూఱు పద్యముల కావ్యము), అష్టోత్తర శతకము (నూటెనిమిది పద్యముల కావ్యము), పంచశతి (ఐదువందల పద్యములు గల కావ్యము), సప్తశతి (ఏడువందల పద్యములు గల కావ్యము), మున్నగు వానిని గూడ సూచించి యుండెను.

ఖండ కావ్యము : మహాకావ్య లక్షణములలో నేకదేశమును మాత్రము గ్రహించి రచించిన కావ్యము ఖండ కావ్యము. ఉదా ; మేఘసందేశము. ఆధునిక యుగమున నాంధ్రమందుఁ బలువురు ఖండకావ్యములను రచించి యున్నారు.

యుగ్మకము, సందానితకము, కలాపకము, కులకము అనునవి క్రమముగా నొకే క్రియతో నన్వయము గల రెండు మూఁడు నాలుగైదు పద్యముల సమూహములకు పేర్లు.

కోశము : అన్యోన్యాసపేక్షకములైన శ్లోకముల సమూహమునకు కోశమని పేరు.

✓వాకోవాక్యము : ఉక్తి ప్రత్యుక్తిరూపములైన వాక్యోపవ్యాకములతోఁ గూడి యుండునది వాకోవాక్యము. ఇందుకై ప్రత్యుక్తు లిరువురికే కాని పలుమందికిఁ గాని కూర్ప వచ్చును.

కవి స్వయముగాఁ జూచి చెప్పిన కథ వ్యాఖ్యాన మనియు నితరుల వలన విని చెప్పిన దాని నుపాఖ్యాన మనియు నామములు.

గాథ : జననీ జనకులు, పితృదేవతలు, భూదేవి మున్నగు వారిని గూర్చి చేయు స్తోత్రమునకు గాథ యని పేరు. ఇది దాతలయు వీరపురుషులయు నుదాత్త కృత్యములను గూడ స్తుతింప వచ్చును. దీనికి నారాశంసి యని నామాంతరము.

దండకము : ఇది స్తోత్ర రూపమైన కావ్యము. ఇది సాధారణముగా భక్తి రసమయమై యుండును. ఇందు త, న, స, హ గణములలో నొకదానిని మొదట నిడి తరువాత పెక్కు తగణములను గూర్చి చివర నొక గురువు నుంచవలయును ఇందు యతి ప్రాసల నియమము లేదు.

చంపూ కావ్యములు : గద్యపద్యోభయ మైన కావ్యమునకు చంపువని పేరు. సంస్కృతమున భారత చంపువు, రామాయణ చంపువు మున్నగు చంపూ కావ్యము లున్నవి. అందు రఘువంశాది కావ్యములు కేవల పద్య కావ్యములే. తెలుఁగున నిర్వచ నోత్తర రామాయణమును ద్విపద కావ్యములును దప్ప మిగిలిన పూర్వ కావ్యము లన్నియుఁ జంపూ కావ్యములే. సంస్కృతమున కావ్య ప్రబంధ శబ్దములు రెండును సమానములే. అందు గద్య ప్రబంధము, పద్య ప్రబంధము, దృశ్య ప్రబంధము, అను మాటలు విన వచ్చును. వ్యుత్పత్తిని బట్టి ప్రకృష్టమైన బంధము గల యే కావ్యమునైనను ప్రబంధ మనవచ్చును. తెలుఁగున తిక్కన తన భారతమును ప్రబంధ మండలి యని పేర్కొనెను. ఎఱ్ఱనకుఁ బ్రబంధ పరమేశ్వరుఁడను బిరుద మున్నది. నన్నె చోడుని కుమార సంభవము, శ్రీనాథుని నైషధము, పినవీరభద్రుని శృంగార శాకుంతలము నిజముగా ప్రబంధములే. కాని యీ ప్రబంధ పదము తెలుఁగున పెద్దనాదులు రచించిన మను చరిత్రాదులకే రూఢముగా వాడఁబడుచున్నది. వానిని బట్టి ప్రఖ్యాత వృత్తము, ధీరోదాత్త నాయకము, శృంగార రస ప్రధానము, అష్టాదశ వర్ణన శోభితము, ఆలంకారిక రచనా మయము, పంచషాశ్వాస పరిమితమునైన కావ్యము ప్రబంధమని నిర్వచింపవచ్చును. ఇందు సంస్కృత మందలి దృశ్య శ్రవ్య కావ్య లక్షణములు మిశ్రితములై యున్నట్లు కానిపించును.

ఇందెడనెడ శబ్దార్థాలంకార మయములైన దీర్ఘ వచనములు కూడ నుండును. కావున నివి చంపూ కావ్యములే కాని కేవల పద్య కావ్యములు కావు.

గద్య కావ్యము : సంస్కృతమున గద్య పద్యములకు సమాన గౌరవ మున్నది. కాదంబర్యాదులు రఘువంశాదుల వలెనే యందు గొప్ప కావ్యములుగాఁ బరిగణింపఁబడును. మఱియు సంస్కృతమునఁ గల "గద్యం కవినాం నికషం వదంతి" అను నభియుక్తోక్తి గద్య గౌరవమునకుఁ దార్కాణము. ముక్తకము వృత్త గంధి, ఉత్కలికా ప్రాయము, చూర్ణము లేక చూర్ణకము అని గద్యము నాలుగు విధములు. సమాస రహితమైన గద్యము ముక్తకము. వృత్త భాగవంత మైన గద్యము వృత్త గంధి. దీర్ఘ సమాస భూయిష్ఠమైన గద్య ముత్కలికా ప్రాయము. అల్ప సమాస సహితమైన గద్యము చూర్ణకము. ఇది ముక్తకము వలె నసలు సమాసములు లేనిది కాదు; ఉత్కలికా ప్రాయమువలె దీర్ఘ సమాస బహుళము కాదు. రెండింటికిని నడిమి స్థితి కలది.

అఖ్యాయిక : ఇం దుచ్ఛ్వాసాది విభాగములును మధ్య మధ్య నితరుల పద్యములు నుండును.

కథ : అవాంతర విభాగములు కాని పద్యములు కాని లేక యుండు గద్య ప్రబంధము కథ. దీనికిని అఖ్యాయికకును భేదము లేదని దండి చెప్పియుండెను, ఆనందవర్ధనుఁడు మాత్రము వానికి పై భేదమును సూచించెను. శివతత్త్వరత్నా కరము సత్యవృత్తాంతము కలది అఖ్యాయిక యనియు, కల్పిత వృత్తాంతము కథ యనియు అభేదమును చక్కగా సూచించెను. నాయకుఁడు తన చేష్టాదిక మును స్వయముగాఁ జెప్పునది అఖ్యాయిక యని వేటొక లక్షణము కలదు. దీనిని బట్టి అఖ్యాయికను స్వీయ చరిత్ర లేక ఆత్మకథ అని చెప్పవచ్చును.

ఖండ కథ : ఇది యేక దేశ వర్ణనము గల గద్యప్రబంధము.

హరికథ : చతుర్విధ పురుషార్థములలో నొక్క దానిని గ్రహించి చిత్ర విచిత్రముగా వర్ణించు గద్య ప్రబంధము హరికథ.

పర్యాయబంధము : వసంతాది ఋతువులను గాని మహారాజులు మున్నగు వారిని గాని విజయ యాత్రాదులను గాని వర్ణించు గద్య ప్రబంధము పర్యాయ బంధము.

సకల కథ : ధర్మార్థ కామ మోక్షముల ఫలము లంతమునఁ గల యితివృత్తముతోఁ గూడిన గద్య కావ్యము సకలకథ.

(పిట్టకథ)
ఉపకథ : పెద్దకథలో నడుమవచ్చు చిన్న కథ. ఇది పురాణేతిహాసము లందలి ఉపాఖ్యానము వంటిది.

ఆంగ్ల భాషా పరిచయ మలవడిన పిమ్మట ప్రతిభావంతులైన యువతీ యువకులు తెలుఁగున పలువిధములైన గద్య రచనలు కావించుచున్నారు. అందు నవల, కథానిక, వ్యాసము, విమర్శ జీవిత చరిత్ర, ఆత్మకథ, మున్నగునవి ముఖ్యము లైనవి.

దృశ్య కావ్యములు : దృశ్య కావ్యములు రంగము మీఁదఁ బ్రదర్శితములగుచుండఁగాఁ జూచుటకు యోగ్యము లైనవి, వీనికి రూపకములని సాధారణ నామము. రూపకములు ప్రధానముగాఁ బది విధములు,

1. నాటకము : ఇది ప్రఖ్యాత వస్తుకము, అనఁగా రామాయణ భారతాదులనుండి గ్రహించిన వస్తువు కలది. మూలకథయందు రసమునకుఁ గాని నాయకునకుఁగాని విరుద్ధములగు వర్ణనాదులను నాటకకర్త విడువ వలయును లేదా వానిని యథోచితముగా మార్ప వలయును, ఇందలి నాయకుఁడు ధీరోదాత్తుఁడు, అంగి రసము శృంగార వీరములలో నొకటి. మిగిలిన వంగరసములు గానుండ వచ్చును, ఇందు పంచ సంధులను జక్కఁగాఁ గూర్పవలయును, నిర్వహణసంధిలో నద్భుత రసమును వర్ణింప వలయును, ఇందైదు మొదలు పది యంకముల వఱకు నుండ వచ్చును, నాయక వధము సర్వథా పరిత్యాజ్యము, ఒక వేళ నాయకుఁడు మరణించుచో వానిఁ బునరుజ్జీవితు నొనరింప వలయును, ఇందు నీరసములు, అనుచితములు, ఉద్వేగకరములు నైన సన్నివేశములను దృశ్యములుగాఁ జేయక విష్కంభాదులచే సూచ్య మాత్రములను గావింపవలెను, ఇది నాందీప్రస్తావనలతో మొదలిడి భరత వాక్యముతో ముగియును,

2, ప్రకరణము : ఇది కల్పిత వస్తుకము అనఁగా నిందలి కథ లోక సంబంధియు కవికల్పితమునై యుండును, ఇందలి రసము శృంగారము, నాయకుఁడు ధీరశాంతుఁడు, అతఁ డమాత్య విప్రవణిజులలో నెవ్వఁడైనఁగావచ్చును.

అతఁడు ధర్మార్థ తత్పరుఁడును అపాయాంతరిత కార్య సిద్ధియు గాఁదగును. ఇందు కులజ కాని, వేశ్య కాని, కులజా వేశ్య లిరువురును గాని నాయికలుగా నుండ వచ్చును. ఇందు పది యంకము లుండును. మిగిలిన లక్షణము లందు దీనికిని నాటకమునకును భేదము లేదు.

3. భాణము : ఇందు కవి కల్పితమైన ధూర్తవృత్త మితి వృత్తము. సమర్థుఁడు విద్యావంతుఁడు నగు విటుఁడను నొక పాత్రచేఁ బ్రయోగింపఁబడు నిందు సంబోధ నోక్తి ప్రత్యుక్తు లాకాశభాషితముల మూలమున జరుగుచుండును. భారతీ వృత్తిని, సాంగము లైన ముఖ నిర్వహణ సంధులను, గేయాది దశ లాస్యాంగములను ఇందుపయోగింపఁ దగును. శౌర్య వర్ణనచే వీర రసము కాని సౌభాగ్య వర్ణనచే శృంగార రసము కాని యిందు సూచింపఁబడును.

4. ప్రహసనము : ఇది హాస్య రస ప్రధానమైన రూపకము. వస్తువు. సంధులు, లాస్యాంగములు మున్నగువాని విషయమున నిది భాణముతో సమానము. ఇది శుద్ధ వికృత సంకీర్ణ భేదములచే త్రివిధము, అందు పాషండ. శ్రోత్రియ బ్రాహ్మణబ్రువ, భిక్ష్వాదుల హాస్యమయ వచనములతోఁ గూడినదియు. చేట చేటీ విటాది ప్రయుక్త మగునదియు, వేష భాషా చేష్టాదులచే నవ్వు పుట్టించునదియునగు నట్టిది శుద్ధము. "కంచుకి షండ తాపస వృద్ధాదులు విట చాట భటాదుల వేష భాషలు కలవారుగా వర్ణింపఁబడుటచే విపరీత ధర్మము కలది వికృతము ముఖనిర్వహణ లాస్యాంగములే కాక ఉద్ఘాత్య కాదులగు వీథ్యంగములు కూడ నధికముగాఁ జూపఁ దగి, చోర కితవాది ధూర్తులతోఁ గూడి సంకరమై యుండు నదిసంకీర్ణము."

5. డిమము : ఇది ప్రఖ్యాత వస్తుకము. ఇందు పదునార్గురు ధీరోద్ధత నాయకు లుందురు. వారు దేవ కిన్నర గంధర్వ యక్ష రాక్షస భుజగ భూత ప్రేత పిశాచాదులలోని వారై యుందురు. ఇం దవమర్శ సంధి కాక మిగిలిన నాలుగు సంధులను, కైశికీ వృత్తి కాక మిగిలిన మూఁడు వృత్తులను ప్రయోగింప వలయును. ఇందు రౌద్ర మంగి రసము. హాస్య శృంగారములు కాక మిగిలినవి యంగ రసములు, మాయ, ఇంద్రజాలము. క్రోధము, అద్భుతము. సూర్య చంద్ర గ్రహణములు, ఉల్కాపాతము మున్నగు వావి నిందు

వర్ణింపవలయును. ఇందు నాలుగంకము లుండును. ప్రస్తావన, పాత్ర ప్రవేశము మున్నగు వాని విషయమున నిది నాటక సదృశము.

6. వ్యాయోగము : ఇది ప్రఖ్యాత వస్తుకము, ఏకాంకము, ధీరోద్ధతులు పలువు రిందు నాయకులుగా నుందురు. ముఖ ప్రతిముఖ నిర్వహణ సంధులు మూఁడే యిం దుండును. ఇందుస్త్రీ నిమిత్తము కాని యుద్ధమును జొప్పింప వలయును. హాస్య శృంగార శాంతములు కాక మిగిలిన యాఱు రసములు నిందుండును. కైశికీ వృత్తి కాక మిగిలిన మూఁడు వృత్తులను ఇందు వర్ణింప వచ్చును. ప్రస్తావనాది నాట్య ధర్మ ములం దిది నాటక సదృశము.

7. సమవాకారము : ఇది మూఁడంకములతోఁ గూడి ప్రఖ్యాత వస్తుకమై యుండును. ఇందు వీర రస మంగి. మిగిలినవి అంగ రసములు. వృత్తులు నాలుగును వర్ణితము లగును. ఇందు ప్రసిద్ధులైన దేవదానవులు పండ్రెండుగురు నాయకులుగా నుందురు. అవమర్శ సంధి కాక మిగిలిన నాలుగు సంధుల నిందు గూర్పఁ దగును అంకము లన్నింటి యందు కపట శృంగారోపద్రవములు మూఁడును వర్ణితములు కావలయును. 36 గడియల కాల మిందు ప్రమాణము. వీథ్యంగముల నిందు యథోచితముగా రచింపఁ దగును.

8. వీథి : ఇది కల్పితేతివృత్తము ఏకాంకము, సాంగము లగు ముఖ నిర్వహణ సంధులను, లాస్యాంగములను, ఉద్ధాత్యకాదులగు 13 వీథ్యంగములను ఇందు ప్రయోగింపఁదగును. కైశికీవృత్తితోఁ గూడిన శృంగార మిందు ప్రధాన రసము ఇతర రసముల నిం దంగములుగా వర్ణింప వచ్చు. ఇందొకటి రెండు పాత్ర ములుండును. వీధి వలె నంగములకు మార్గ మగుటచే దీనికీ పేరు కల్గినది.

9. అంకము : దీని కుత్సృష్టి కాంకమని నామాంతరము. ఇందు వస్తువు ప్రఖ్యాతమో కవి కల్పితమో యైయుండును, ఇందు కరుణము ప్రధానరసము వీరాదు లంగములు ప్రాకృత మనుష్యు లిందు నాయకులు. ఇందు స్త్రీ విచార మధికముగా నుండును, జయాపజయాదులు దిఙ్మాత్రముగా సూచింపఁ బడును. సంధులు, వృత్తులు మున్నగు వాని విషయమున నిది భాణముతో సమానము.

10. ఈహామృగము : మృగమువలె అలభ్య యగు నాయికను నాయకుఁ డిందుఁ గోరును గావున దీనికీ పేరు కల్గినది. ఇది మిశ్ర వస్తుకము. అనఁగా ప్రఖ్యాతమును కల్పితము నైన వస్తువు కలది ఇందు నాలుగంకము లుండును. ముఖ ప్రతిముఖ నిర్వహణ సంధులు మూఁడింటి నిందుఁ గూర్పవచ్చును ధీరోద్ధతులైన నర దివ్యులలో నొకరు నాయకులుగను వేఱొకరు ప్రతి నాయకులుగను ఇందు వర్ణింపఁ దగుదురు. అనురక్త కాని దివ్యస్త్రీని బలాత్కరించుట యనున దిందు ముఖ్యము. అందుచే శృంగార రసాభాస మిందు గోచరించును. కారణాంతరములచేఁ గాక నాయికా నిమిత్తముననే నాయక ప్రతినాయకుల కిందు వైరము వర్ణింప వలయును. అయుక్త కారియగు ప్రతి నాయకుఁడు చేఁజిక్కినను అతనిని వధింపరాదు ప్రతినాయక కారణమున నిందు వీరాది రసములు కూడ ప్రధానములు కాఁదగునని భరతుని మతము. మిగిలిన లక్షణములలో దీనికిని వ్యాయోగమునకును భేదము లేదు.

పైవి పేర్కొనఁబడిన దశ రూపకములు కాక కొన్ని ఉపరూపకములు కూడఁ గలవు. సాహిత్యదర్పణ కారాదులు 18 ఉపరూపకములను, శారదాతనయుఁడు 2 ఉపరూపకములను బేర్కొనిరి. భరతుఁడు దశరూపకములను నాటికను మాత్రము చెప్పియుండెను. అతఁ డుపరూపకములను జెప్పియుండ లేదు. భోజుఁడు ప్రకరణి నాటిక అనువానిని గూడ రూపకములలోనే చేర్చి రూపకముల సంఖ్య పండ్రెండు కావించెను లక్షణ గ్రంథములలో మొత్తము 36 ఉపరూపకముల నామములు కనఁబడుచున్నవి. వానిలో నాటిక, తోటకము, నాట్యరాసకము అనునవి ముఖ్యము లైనవి.

నాటిక : ఇది కల్పిత వస్తుకము. చతురంకము శృంగార రసప్రధానము ధీరలలితుఁడిందు నాయకుఁడు. అతఁ డాభిజాత్య సంపన్నయు ప్రగల్భయు నగు జేష్ఠ భార్య యుండఁగనే ముగ్ధయగు మఱొక నాయికను ప్రేమించి అనురాగము ప్రదర్శింప వచ్చును. ఆ నాయిక దేవి కాసన్న వర్తినియు సంగీత వ్యాపృతయు నై యుండ వలయును, దేవి నాయికా నాయకుల ప్రణయమున కెడనెడ భంగము కలిగింప యత్నించుచున్నను తుదకుఁ దానే వారికి సమాగమము చేకూర్చును. ఇందు పురుష పాత్రల కంటె స్త్రీ పాత్రల సంఖ్య యధికముగా నుండును.

సంధి ప్రవేశక ప్రస్తావనాదుల విషయమున నిది ప్రకరణ సదృశము. నాటక ప్రకరణ లక్షణముల సంకర మిం దుండుటచే నిది సంకీర్ణ మని చెప్పఁబడును (ఉదా. రత్నావళీ నాటిక).

తోటకము : ఇది చాలవఱకు నాటక తుల్యము. నాటకమునకు తోటకమునకు స్వల్పభేదములు మాత్రము కలవు. ఇందైదుకాని ఏడుకాని యెనిమిదికాని తొమ్మిదికాని యంకము లుండవచ్చును. అంకము లన్నింట విదూషకుఁ డుండవలెనని కొందఱిమతము. అంగిరసము శృంగారము వీరహాస్యాదు లంగములు. దివ్యమానుష సంయోగ మిందలి ముఖ్యలక్షణము. (ఉదా. విక్రమోర్వశీయము)

నాట్యరాసకము: ఇది కల్పిత వస్తుకము. ఏకాంకము. ఇందు నాయకుఁడు ధీరోదాత్తుఁడు. నాయికా వాసకసజ్జిక, పీఠమర్దుఁడు నాయక సహాయుఁడు. శృంగార మంగి రసము, హాస్య మంగ రసము, సంధి ప్రస్తావనాదులం దిది భాణ సదృశము.

ఆంగ్లేయుల శ్రవ్యకావ్యములు పరాశ్రయములు (objective), ఆత్మాశ్రయములు అని ముఖ్యముగా రెండు రకములు. పరాశ్రయ కావ్యముపురాణము(Epic), వీర కావ్యము (Ballad), కథా కావ్యము (Narrative), ఉపదేశకావ్యము (Didactic Poem), వర్ణన కావ్యము (Descriptive Poem), లఘు కావ్యము ముఖ్యములైనవి. ఆత్మాశ్రయములలో గేయకావ్యము (Lyric), మర్మ కావ్యము (Mystic Poem) మృతి విషయకావ్యము (Elegy) అధిక్షేపకావ్యము (Satire) లేఖా కావ్యము (Epistle), ఖండ కావ్యము (Sonnet), ఉదాత్త గేయము (ode), అనునవి ప్రధానము లైనవి.

ఆంగ్లమునందలి దృశ్యకావ్యములలో మోదాంతనాటకము (Comedy), విషాదాంతనాటకము (Tragedy), ప్రహసనము (Farce), మూకాభినయ రూపకము (Pantomime), గేయరూపకము (Melo drama), నృత్యరూపకము (Ballet), సంగీత రూపకము (Opera), అనునవి ముఖ్యములైనవి.

ఆధునిక కాలమున ప్రపంచమందలి ప్రధాన భాష లన్నింట ఏకాంకికలు (One-act Plays), విరివిగా వ్రాయఁబడుచు ప్రచారము నందుచున్నవి.

# 3. రససోపానము

## 1. రసస్వరూపము.

“వాక్యం రసాత్మకం కావ్య” మని విశ్వనాథుఁడు కావ్య శబ్దమున కిచ్చిన నిర్వచనము. రసాత్మకమైన వాక్యమే కావ్యమని దీని యర్థము. రసహీనమైన గ్రంథము కావ్యము కాఁజాలదు. ఏలయన నది యితర ప్రయోజనముల నెన్నిటిని సమకూర్చినను గావ్యమునకుఁ బరమ ప్రయోజనమైన రసానందము నొసంగఁ జాలదు. కావ్యమునకు రస మాత్మ. తజ్జన్యమైన యానందము పరమ ప్రయోజనము. రస మనఁగానేమి ?

రసపదము ఋగ్వేదమున సోమరసము, జలము, పాలు, సారము అను నర్థములందు వాడఁబడినది. అథర్వవేదములో నది రుచి యను నర్థమునఁ గానవచ్చుచున్నది. ఉపనిషత్కాలమున దానికి సార మను నర్థ మేర్పడినది. జగత్తునకుఁ బ్రధాన సారభూత మైనదియు శాశ్వతానంద సంధాయకమును నగు పరమాత్మ రసపదమున కర్థము. అందుచేతనే రసానందము బ్రహ్మానంద సహోదరమని చెప్పఁబడుచున్నది.

విభావానుభావముల చేతను, సాత్త్వికవ్యభిచారి భావములచేతను స్వాదుత్వమును బొందింపఁబడు స్థాయి భావమే రసము. స్థాయి యనఁగా స్థిరముగా నుండునది. సజాతీయ విజాతీయ భావములచేఁ దిరస్కరింపఁబడక రస స్ఫూర్తి యగు పర్యంతము సహృదయహృదయముల నిల్చియుండును. గావున దానికి స్థాయిభావమను పేరేర్పడినది. ఇది సహృదయుల హృదయమున వాసనారూపమున నున్నప్పుడు కేవల జలమువలె నాస్వాద్యమానము కాఁజాలదు. పులకండముల కలయికచే జలము రసాయనమై యాస్వాద్యమాన మగు విధమున విభావానుభావసంచారి భావములచేఁ బరిపుష్టమైన స్థాయిభావము మిక్కిలి యాస్వాద్యమానము కాఁజాలును. శృంగార హాస్య కరుణ వీరభయానక బీభత్స రౌద్రాద్భుత శాంతములను తొమ్మిది రసములకును గ్రమముగా రతి, హాస, శో, కోత్సాహ, భయ జుగుప్సా, క్రోధ, విస్మయ, శమములు స్థాయి భావములు

సామాజిక హృదయముల వాసనా రూపమున బీజప్రాయముగా నున్న రత్యాది స్థాయిభావముల నంకుర రూపమున నాస్వాద్యమానముగా నొనర్చునవి విభావములు. లోక వ్యవహారమున రత్యాదుల యుత్పత్తికి హేతువులైన నాయకాదులే కావ్యములందు విభావములని చెప్పఁబడునని సాహిత్యదర్పణము. విభావము ఆలంబన విభావము, ఉద్దీపన విభావము అని రెండు విధములు. "ఆలంబనం నాయకాదిస్త మాలంబ్య రసోద్గమాత్", ఆలంబన మనఁగా నవలంబము. నాయికా నాయకు లాలంబన విభావము. వారి నవలంబించియే రసోదయ మగును. రసము నుద్దీపింప జేయునది ఉద్దీపన విభావము, ఇది సహజము తటస్థము అని ద్వివిధము. శృంగారమున యౌవన, భూషణ, చేష్టాదులు సహజోద్దీపన విభావములు. మలయానిల చంద్రాదులు తటస్థోద్దీపన విభావములు, కొందఱు చంద్రాదులకు మదనుని గూడఁ జేర్చిరి. అందుచేతనే కవులు విరహ వర్ణన సందర్భములందుఁ జంద్ర మలయానిల దూషణముతో పాటు మన్మధోపాలంభనమును గూడఁ గావింతురు.

తమతమ కారణములచే నాయికా నాయకులం దుద్బుద్ధములైన స్థాయి భావములను బైకిఁ బ్రకటనము చేయు క్రియావిశేషములు కావ్య నాట్యాదులలో ననుభావము లనఁబడును. రత్యాది స్థాయి భావములను సహృదయులచే ననుభవింపఁ జేయును గావున వీని కనుభావములను నామ మేర్పడినది. విభావములు కారణ రూపములు. అనుభావములు కార్య రూపములు. మనోభవములైన హావ భావాదులును, అయత్నజములైన శోభా కాంతి దీప్త్యాదులును. స్వభావజములైన లీలా విలాసాదులును, సాత్త్విక భావములును, ఇంకను సంభావ్యమానములగు వితర్క నిష్టలును శృంగార రసమున అనుభావము లగును. ఈ యనుభావములు మనోభవములు, వాగ్భవములు, కాయజములు, బుద్ధిజములు అని నాలుగు విధముగా నుండునని కొందఱి మతము. "విభావ మనుభావమును, అనుభావము విభావమును, ఆ రెండును సంచారులును, సంచారులు విభావాను భావములును అగు" నని భావ ప్రకాశము చెప్పుచున్నది.

సత్త్వ సంజాతములైన భావములు సాత్త్విక భావములు. సత్త్వమనఁగా నేమి యను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. అభినయాది ముఖమునఁబర గత సుఖదుఃఖముల యెడ నంతఃకరణము సుముఖ మగుట సత్త్వమని కొంద

ఱును. రజస్తమములచే నస్పృష్టమైన మనస్సు సత్త్వమని కొందఱును, స్వాత్మ విశ్రాంతములైన రత్యాదులను ప్రకాశింపఁ జేయు నాంతర ధర్మము సత్త్వమని కొందఱును, భావాంతరముల సంబధము లేకుండ రసమును ప్రత్యక్ష మొనర్చు బల విశేషము సత్త్వమని కొందఱును జెప్పుచున్నారు. స్తంభము, ప్రళయము అశ్రువు, స్వేదము, వైస్వర్యము, రోమాంచము, కంపము, వైవర్ణ్యము అను నెనిమిదియు సాత్త్వికభావములు. రసతరంగిణీ కర్త జృంభ మను నవమ సాత్త్వక భావమును గూడఁ జేర్చిని యున్నాడు. స్థాయి వ్యభిచారు లభ్యంతర భావములు సాత్త్వక భావములు బాహ్యములు.

రసవ్యక్తికిఁ దోడ్పడు భావములు సంచారి భావములు, వీనికే వ్యభిచారులని నామాంతరము. విభా వానుభావ సాత్త్వక భావముల కన్న నతిశయించి రసాను గుణముగా వర్తించును. గావున వీనికి వ్యభిచారు లను పేరేర్పడినది, ఇవి స్థాయి భావములను లెస్సగాఁ బోషించి రస్యమానములఁ గావించును. సముద్రమునఁ దరంగముల వలె నివి స్థాయి భావమున మజ్జనోన్మజ్జనములు కావించుచుఁ దిరోభా వావిర్భావములను బొందుచుండును. నిర్వేద శ్రమ దైన్య జాడ్యాదు లివి ముప్పది మూఁడు. ఆలంకారికులలోఁ గొందఱీ సంఖ్యను దగ్గించిరి. కొందఱు మఱికొన్ని భావములను గలిపి హెచ్చించిరి.

మన యలంకారికులలోఁ బ్రప్రథమమున రస చర్చ గావించిన వాడు భరతాచార్యుఁడు. అతఁడు ప్రధానముగా రూపక రసమును గూర్చియే చెప్పి యుండెను. తరువాత ఆనందవర్ధనుఁడు శ్రవ్య కావ్యములకుఁ గూడ దానిని సమన్వయించెను. శ్రవ్య కావ్యములలో దృశ్య కావ్యములందు వలె నాయకాదులు ప్రత్యక్షముగాఁ గానఁబడనప్పుడు సామాజికులు నాయకాభేదమును బొంది రసా స్వాదనము నెట్లు చేయఁజాలుదు రను శంకకు వాక్యపదీయకారుఁడైన భర్తృ హరి శ్రవ్య కావ్యములందు నాయకులు తత్తద్వర్ణన విశేషములచే రూపమును బొంది హృదయ ఫలకమునఁ బ్రత్యక్షముగా గోచరింతు రనియు, నప్పుడు సామాజికుఁడు తదభేదము నొంది రసా స్వాదనము చేయఁజాలు ననియు సమాధానము చెప్పి యున్నాఁడు.

రసము ననుభవించు వారెవ్వరను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. ''విభా వానుభావ సాత్త్వక వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః''అను భరతుని రస సూత్రము నందలి సంయోగనిష్పత్తి పదములను భట్టలోల్లటుఁడు, శ్రీశంకుకుఁడు, భట్టనాయకుఁడు, అభినవగుప్తుఁడు నను వారు వేర్వేఱు విధమున వివరించి యుండిరి.

లోకమునందలి హర్ష శోకాదుల వలనఁ జూచు వారికి హర్షశోకములే కలుగును. కావ్యములం దట్లుకాక యన్నిటి వలనను ఆనందమే కలుగును. ఈ యానంద మలౌకికము. కావ్య శిల్ప మలౌకిక మగుటయుఁ గావ్యగత నాయకాదు లలౌకికు లగుటయు నిందుకుఁ గారణములు. లోకమున శోక హర్షాదులకుఁ గారణములైన భావములే కావ్య ములం దలౌకిక విభావము లనుపేర వ్యవహృతములై హర్షమునే కలిగించును. కావ్యము లందలి నాయకాదులు లౌకిక నాయకాదుల కను కర్తలు. అనుకరణ మానందావహము. ఈ యనుకరణ విశేషముచేతనే కళలెల్ల నానందమును జేకూర్చు చున్నవి.

కావ్య వర్ణితములైన విభావాదుల వర్ణనలచే సహృదయులందలి సత్త్వ గుణ ముద్రిక్త మగును. ఈ యుద్రేకము వలన వారి హృదయములలో వాసనా రూపముగా నున్న రత్యాదు లుద్బుద్ధములగును. మరల మరల భావించుకొనుటచే విభావాదులు సాధారణము లగును. అప్పుడు సహృదయుని పరిమితత్వ మడఁగును అతఁడు తన్ను, ప్రపంచమును విస్మరించి యనిర్వచనీయమైన యానంద మును బొందును అతఁడు విభావాదుల ననుసంధించుకొని చర్వణము చేయు చున్నంత కాలము ఆనందము ననుభవించుచునే యుండును. ఆ చర్వణ మాగి పోయినంతనే ఆనందము ముగియును ఈ యానందమే రసానంద మని చెప్పఁబడును. బ్రహ్మానందము కేవలానందము. రసానందము, విభావాది యుక్తము అందుచేతనే యది బ్రహ్మానంద సహోదరమని చెప్పబడినది. తైత్తిరీయోపనిషత్తు నందలి ఆనందవల్లిలో బ్రహ్మానంద స్వరూపము వ్యక్తము చేయఁబడినది. ఆ యువకుఁడు సాధువు బలిష్ఠుఁడునగు మహారాజు పొందు నానందము మానుషానందము. బ్రహ్మానందముతో నించు మించుగాఁ దుల్యమైనది.

## 2. రసములు, స్థాయి భావాదులు :

విభావానుభావ సాత్త్వికవ్యభిచారిభావ సముల్లాసితమైన స్థాయి భావమే రసము. శృంగారము హాస్యము, కరుణము, వీరము, భయానకము బీభత్సము, రౌద్రము, అద్భుతము, శాంతము అనునవి తొమ్మిదియు రసములు. శృంగారము నుండి హాస్యమును రౌద్రమునుండి కరుణమును, వీరమునుండి అద్భుతమును, బీభత్సమునుండి భయానకమును బుట్టినవని శృంగారతిలకమునఁ జెప్పఁబడినది. వీనిలో మహాకావ్యమున శృంగార వీర రసములలో నొకటి ప్రాధాన్యము వహింపవలెననియు మిగిలిన వంగ రసములుగా నుండవలె ననియు పలువురు లాక్షణికులు తెల్పియుండిరి. సాహిత్యదర్పణకర్త శాంతమునకుఁ గూడఁ బ్రాధాన్యమంగీకరించెను. ధర్మానుబంధియగు శృంగారమును ధర్మరక్షణదక్షమగు వీరమును లోకకల్యాణ హేతువులగుటయే కావ్యము లందు వానికిఁ బ్రాధాన్యమియఁబడుటకుఁ గారణము.

శృంగారమునకు రతియు, హాస్యమునకు హాసమును, కరుణమునకు శోకమును, వీరమున కుత్సాహమును, భయానకమునకు భయమును, బీభత్సమునకు జుగుప్సయు, రౌద్రమునకుఁ గ్రోధమును, అద్భుతమునకు విస్మయమును, శాంతమునకు శమమును స్థాయిభావములు. ఇవి వాసనా రూపమున సామాజికుల హృదయములందుండి విభా వానుభావాదులచేఁ బోషింపఁబడి రసత్వమును బొందును. ఇవి సజాతీయ విజాతీయ భావములచేఁ దిరస్కరింపఁబడని రూపము గలవై రసస్ఫూర్తి పర్యంతము సామాజిక హృదయములందు వర్తించుచుండును.

రతి : నాయికా నాయకుల హృదయములఁ బుట్టు సంభోగ విషయమగు నభిలాషకు (లేక కామమునకు) రతియని పేరు. స్త్రీ పురుషుల అన్యోన్యాలంబనము గల ప్రేమాఖ్య మగు చిత్తవృత్తి విశేషము రతియని రసగంగాధరము. ఈ రతి అంకుర పల్లవ కలికా ప్రసూన ఫల భోగావస్థలందుఁ గ్రమముగా ప్రేమ, మాన ప్రణయ, స్నేహ, రాగానురాగములను పేర్లతో పేర్కొనఁబడుచుండును. ఈ యా అవస్థలలో మొదటి యైదును పూర్వరాగ మందును ఆఱవదైన భోగము సంభోగమందును కలుగుచుండును. రతి మొదట నాయికకే కలిగినట్లును, ఆమె యింగితములచేఁ దరవాత నాయకుఁ డనురక్తుఁడైనట్లును, పిమ్మట సంభోగము

వర్తిల్లునట్లును వర్ణించుట సహజ సుందరముగా నుండునని రుద్రటుఁడు చెప్పి యున్నాఁడు.

హాసము : అతి వికృతములైన నటాదుల యాకారాలాప చేష్టితాదులను గనుఁగొను నప్పుడు కలుగు మనో వికాసము హాసమనఁబడును. వాగంగాది వికారములను దర్శించుట వలనఁ గలుగు వికాసాఖ్యమగు చిత్తవృత్తి విశేషము హాసమని రసగంగాధరము.

శోకము : ఇష్టజన విరహాదులచే హృదయమునఁ గల్గు దుఃఖము శోక మనఁబడును. అది శబ్దముచే వినాశము, శాపము, క్లేశము, బంధనము, వ్యసనము మున్నగు వానిని గ్రహింపవలయును. పుత్రుఁడు మున్నగు వారి వియోగ మరణాదుల వలనఁ గలుగు వైక్లబ్యాఖ్య మగు చిత్తవృత్తి విశేషము శోకమని రస గంగాధరము.

ఉత్సాహము : లోకోత్తర కృత్యములు చేయఁగోరి యొనర్చు గాటమైన ప్రయత్నమున కుత్సాహమనిపేరు. పరపరాక్రమ శైర్యాదులను స్మరించుటలనఁ గల్గు ఔన్నత్యాఖ్యమగు చిత్తవృత్తి విశేష ముత్సాహమని రసగంగాధరము.

భయము : క్రూరాకారాదులను జూచు నప్పుడు ప్రాణుల హృదయమునఁ గల్గు ననర్థ శంక భయ మనఁబడును. వ్యాఘ్ర దర్శనాదులచే జనించు పరమానర్థ విషయకమైన వైక్లబ్యాఖ్యమగు చిత్తవృత్తి విశేషము భయమని రసగంగాధరము. భయమును త్రాసమును సమానార్థకములుగానే కనిపించినను వానివలనఁగల్గు ననర్థ శంకిలో భేదమున్నది. మరణాది రూపమగు ననర్థ శంక భయము; మరణ భిన్న మగు ననర్థ శంక త్రాసము. మొదటిది స్థాయిభావము. రెండవది సంచారిభావము.

జుగుప్స : వస్తువులందలి దోషదర్శ నాదులచేఁ గల్గు రోఁత జుగుప్స యనఁబడును. రోఁత కలిగించు పురీషాది వస్తువులను జూచుటనలనఁ గలుగు విచికిత్సాఖ్యమగు చిత్తవృత్తి విశేషము జుగుప్స యని రసగంగాధరము.

క్రోధము : శత్రుకృతాపరాధముచేఁ గల్గు మనః ప్రజ్వలనము క్రోధ మనఁబడును. గురుబంధు వధాదులగు మహాపరాధములచేఁ బుట్టు ప్రజ్వలనాఖ్య

మగు చిత్తవృత్తి విశేషము క్రోధ మని రసగంగాధరము. ఈ ప్రజ్వలనము మహాపరాధ జన్యమగుచో వర వినాశాది హేతువగును. క్షుద్రాపరాధ జన్యమగుచో పరుష వాక్కులు, అసంభాషణము మున్నగు వానిని మాత్రమే కలిగించును. క్రోధ మన్నను అమర్ష మన్నను గొంచె మించు మించుగా సమానమే.

విస్మయము : అపూర్వ వస్తు దర్శనముచేఁ గల్గు చిత్తవిస్తారమునకు విస్మయమని పేరు. అలౌకిక వస్తు దర్శనాదులచేఁ గలుగు ఆశ్చర్యాఖ్యమగు చిత్తవృత్తి విశేషము విస్మయ మని రసగంగాధరము.

శమము : వైరాగ్యాదులచేఁ జిత్తము నిర్వికార మగుట శమమనఁబడును. నిత్యానిత్యా విచారము వలనఁ బుట్టు విషయ విరాగాఖ్య మగు చిత్తవృత్తి విశేషము శమ మని రసగంగాధరము.

స్థాయి భావ మనగా స్థిరమైన భావమని యర్థము. నదులెన్ని వచ్చి కలసినను దన క్షారత్వమును నిల్పుకొను సముద్రమువలె విరుద్ధావిరుద్ధములైన సంచారి భావము లెన్ని తనలోఁ గలసినను మార్పు చెందక స్థిరముగా నుండునది స్థాయి భావము. నరులలో నృపతివలె. శిష్యులలో గురువువలె సర్వభాగములలో స్థాయి మహత్తరమై యొప్పారును.

సాత్త్వికభావము : సత్త్వమున లేక సత్త్వ దశ యందు పుట్టు భావములకు సాత్త్విక భావములని పేరు. సత్త్వమునకు పలువురు లాక్షణికులు పలు విధములైన నిర్వచనములొసంగి యుండిరి. "అభినయాదుల ద్వారా పరగత సుఖ దుఃఖాది భావనయం దంతఃకరణ మనుకూల మగుట సత్త్వము" "పరగత సుఖ దుఃఖాదుల నరయఁగ భావించి యట్ల యలరుట సత్త్వము" రజస్తమో గుణములచే స్పృశింపఁబడని మనస్సు సత్త్వము" "స్వాత్మ విశ్రాంతములైన రత్యాదులను బ్రకాశింపఁజేయు కొండొక అంతర ధర్మము సత్త్వము" భావాంతర నిరపేక్షముగా రసమును బ్రత్యక్షీకరించు లక్షణము గల బల విశేషము సత్త్వము" అనునవి అనిర్వచనములలోఁ గొన్ని. ఇవియును అనుభావముల వలెఁ గార్య రూపములే. అయ్యును సత్త్వైక మూలము లగుటచే సాత్త్విక భావములని వేఱు

చేయఁబడినవి. అనుభావములు దేహజములు: ఇచ్ఛాధీనములు. సాత్త్విక భావములు రసానుకూలముగ ఇచ్ఛలేకుండనే స్వతంత్రముగా సత్త్వసన్నములగు వికారములు. నాయికా నాయకు లిరువురికి నవి యుదయించును ఇవి యెనిమిది.

1. స్తంభము— భయ హర్షామాయాదులచేఁ గలుగు చేష్టా విఘాతము సంభము.

2. ప్రళయము— సుఖదుఃఖాతిరేకముచేఁ గలుగు చేష్టా జ్ఞాన రాహిత్యము ప్రళయము,

3. అశ్రువు— క్రోధ దుఃఖ ప్రహర్ష ములచే నేత్రము లందుఁ బుట్టు నీ ర

4. స్వేదము— రతి ఘర్మ శ్రమాదులచే దేహమునఁ గల్గు జలోద్గమము స్వేదము (చెమట)

5. గాద్గద్యము— మద సమ్మద పీడాదులచేఁ గల్గు డగ్గుత్తిక (వైస్వర్యము) గాద్గద్యము.

6. రోమాంచము— హర్షాద్భుత భయాదులచేఁ గలుగు రోమ విక్రియ రోమాంచము (పులకలు)

7. కంపము— రాగ ద్వేష శ్రమాదులచే శరీరమునఁ గల్గు గగ్గురుపాటు కంపము.

8. వైవర్ణ్యము— విషాద మద రోషాదులచే శరీరమునఁ గల్గు వర్ణాన్యత్వము వైవర్ణ్యము

భానుదత్తుఁడు రసతరంగిణిలో జృంభ (ఆవులింత) తొమ్మిదవ సాత్త్విక భావ మని చెప్పెను.

దశావస్థలు— విప్రలంభ శృంగారము నాలుగు విధములని చెప్పఁబడినది. అందభిలాష విప్రలంభమునకు పూర్వరాగ విప్రలంభమని నామాంతరము. ఇది నాయికా నాయకుల సమాగమమునకుఁ బూర్వము పొందఁబడును. ఈ పూర్వరాగ విప్రలంభమునకు స్థాయియైన రతి వలననే దశావస్థలను

గలుగును. విరహ విప్రలంభమునఁ (సంభోగానంతర విప్రలంభమున) గూడ నిందుఁ గొన్ని గలుగవచ్చును.

1. చక్షుః ప్రీతి (నాయిక నాయకు నాదరముతోఁ జూచుట) 2. మనస్సంగము (మనస్సు నాయకునందుఁ దగుల్కొనుట) 3. సంకల్పము (సంగమచింత) 4. జాగరము (నిద్రలేక మేల్కొని యుండుట) 5. కృశత (చిక్కిపోవుట) 6. అరతి (విషయములం దాసక్తి లేకుండుట) 7. హ్రీత్యాగము (సిగ్గువిడుచుట) 8. ఉన్మాదము (పిచ్చితనము) 9. మూర్ఛ (సొమ్మసిల్లుట) 10. అంతము (మరణ ప్రయత్నము) అనునవి పదియును దశావస్థలు. భావప్రకాశమున ఇచ్ఛ, ఉత్కంఠ, అభిలాష, చింత, స్మృతి, గుణస్తుతి, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, వ్యాధి, జాడ్యము, మరణము అను పండ్రెండవస్థలు చెప్పఁబడినవి. ప్రతాపరుద్రీయమున పై దశావస్థలకు ప్రలాపము, సంజ్వరము అనునవి చేర్చఁబడినవి. ప్రలాపమే ఆంధ్ర ప్రబంధములందు చంద్రమన్మథాద్యుపాలంభ రూపమునఁ గనవచ్చును. సంజ్వర మన్నను సంతాప మన్నను నొక్కటే. సరస భూపాలీయమున చూచుట, చింతించుట, తలంచుట, గుణవినుతి, యరతి తాపము, లజ్జాస్ఖలనము, గమనము, మూర్ఛ, ధన్యత అను పది యవస్థలు పేర్కొనఁబడినవి. ఇందలి గమనము, ధన్యత అను వాని నితరాలంకారికు లెవ్వరును జెప్పి యుండ లేదు. ధన్యత సంభోగరూప మైనది, ఇది దశావస్థల యనంతరము చేకూరును గాని విరహమునఁ జేకూరదు.

## 3. శృంగార వీర భేదములు :

శృంగార రసము సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము అని ప్రధానముగా రెండు విధములు. అందు సంభోగ శృంగారము సురత రూపము ననే కాక పరస్పర దర్శ నాలింగన చుంబన వనజల విహారాద్యనంత రూపముల నుండును. ఆ యనంత రూపములు గణనాతీతము లగుట నిర్వచింప శక్యములు గాకపోవుటచే లాక్షణికులు సంభోగ శృంగార మేకైక విధ మనియే చెప్పియుండిరి.

విప్రలంభ మనఁగా వియోగము. వియోగ మందలి నాయికా నాయకుల శృంగారము విప్రలంభ శృంగార మనఁబడును. వియోగము కలుగు కారణములను బట్టి యీ శృంగారము నాలుగు విధములు.

1. అభిలాష విప్రలంభము : దీనికే అయోగ విప్రలంభము పూర్వరాగ విప్రలంభము అని నామాంతరములు. సంభోగమునకుఁ బూర్వము కలుగు ననురాగమున కభిలాషయని పేరు. సాహిత్యదర్పణమున పూర్వరాగము-నీలీ రాగము కుసుంభ రాగము. మాంజిష్ఠ రాగము అని మూఁడు విధములవి చెప్పఁబడినది. సీతారాముల ప్రేమ నీలీ రాగము. ఇది పైకంతగా వెల్లడి కాకపోయినను తొలఁగక సుస్థిరముగా నుండును. దేవహూతీ కర్దముల ప్రేమ కుసుంభరాగము. ఇది పైకి వెల్లడి యయ్యు కొంత కాలమైన పిమ్మట తొలఁగిపోవును. ఇందుమతీ రఘునందనుల (అజుఁడు) ప్రేమ మాంజిష్ఠరాగము ఇదిపైకి వెల్లడి యగును : ఎన్నఁటికిని దొలఁగక స్థిరముగా నుండును.

2. మానవిప్రలంభము : దీని కీర్ష్యా విప్రలంభ మనియుఁబేరు. మాన మనఁగాఁగోపము. ఇది ప్రణయ మానము, ఈర్ష్యామానము అని రెండు విధములు. కారణము లేకుండనే నాయికా నాయకులకుఁ గలుగుకోపము ప్రణయ మానము నాయకుఁ డన్యాసక్తుఁడై యుండుట గాంచి నాయిక పొందు మాన మీర్ష్యామానము. నాయిక నాయకుఁ డన్యాసక్తుఁడగుట స్వయముగాఁ జూచినను, విన్నను, సురతశ్రమ సంజాతమైన గాఢ నిద్రచేఁగాని. నఖ దంత క్షతాది భోగచిహ్నములచేఁ గాని గోత్ర స్ఖలనముచేఁ గాని యనుమానించినను ఈర్ష్య వహించును. ఇట్టి నాయిక కోపమును నాయకుఁడు దండము తక్క మిగిలిన మూఁడుపాయములచేతను, నమస్కారము చేతను, ఉపేక్ష వహించుటచేతను, హాస్యభయాన కాది రసాంతరముల చేతను దగ్గించి యామెను ప్రసన్న చిత్తను జేసికోవలయును.

8. విరహ విప్రలంభము : సంయోగము పొందిన నాయికా నాయకుల కేదైనఁ గారణముచేఁగలుగు నెడఁబాటు విరహ విప్రలంభ మనఁబడును. సాహిత్య దర్పణము దీనిని ప్రవాస విప్రలంభము నందే చేర్చియుండెను.

4. ప్రవాస విప్రలంభము : ప్రవాసమునఁగలుగు నెడఁబాటునకు ప్రవాస విప్రలంభమని పేరు. నాయికా నాయకులు దేశాంతరవర్తులగుటకుఁ బ్రవాసమని పేరు. ఈ దేశాంతరము దూరస్థమైనను సమీపస్థమైనను సమాగమున కవరోధము కల్గించునదై యుండుట ముఖ్యము. ప్రవాసము కార్యవశమునఁగాని, శాపముచేఁ గాని, సంభ్రమముచేఁ గాని కలుగవచ్చును. కార్యవశమునఁ గలుగు ప్రవాస విప్రలంభము భావి, భవత్, భూత విప్రలంభములని మూఁడు విధములు. సంభ్రమ మనఁగా నలజడి. ఇది దివ్య నాభస మానుషములైన మూఁడు రకముల యుత్పాత ములచే గలుగ వచ్చును. ప్రవాస విప్రలంభమున నాయిక మలిన గాత్ర వసనయు, ఏకవేణీ ధారిణియు, నిశ్వాసోచ్ఛ్వాస రుదిత భూమిపతనములు కలదియుఁగా వర్ణింపఁబడును. విప్రలంభము లేనిదే శృంగారరసము పుష్టి నందదని చెప్పుదురు.

సాహిత్యదర్పణకారుఁడు విరహ విప్రలంభమును. ప్రవాస విప్రలంభ మందే చేర్చి కరుణ విప్రలంభమను నాలుగవ విప్రలంభ భేదమును బేర్కొనెను. నాయికా నాయకులలో నొకరు లోకాంతరమున కరిగి మరల బ్రదుకు సందర్భమున రెండవవా రంతవఱకును బొందు నెడఁబాటు కరుణ విప్రలంభమని యాతఁడు నిర్వచించెను, కాదంబరియందు పుండరీకుఁడు విరహోద్రేకమున మృతిచెంది మరల నా శరీరముతోనే వచ్చి మహాశ్వేతతో సుఖించెను. అతఁడు తిరిగి వచ్చువఱకు మహాశ్వేత పొందిన విరహము కరుణ విప్రలంభము. కుమారసంభవమున మన్మథుఁడు భస్మసాత్కృతుడైన పిమ్మట రతి పొందిన వియోగము కూడ కరుణ విప్రలంభమే. ఈ రెండు సందర్భములందును ఆకాశవాణి పలుకులాలించిన పిమ్మటనే నాయికలకు నాయక సమాగమ ప్రత్యాశ కలిగెను, అంతకు పూర్వమువారు పొందినది కేవలకరుణమే. తదుపరి కరుణ విప్రలంభము. ధ్వన్యాలోకమున నీ కరుణ విప్రలంభ భేదము చెప్పఁబడి యుండ లేదు. లోచన మందలి 'కరుణ విప్రలంభాది' పదమును కరుణ + విప్రలంభ + ఆది అని వేఱు పదములుగాఁ గాక యేకపదముగా గ్రహించుటచేఁ గలిగిన భ్రాంతియే కరుణ విప్రలంభ భేదమునకు దారి చూపెననియు నిజమునకు కరుణమో విప్రలంభమో కాని కరుణ విప్రలంభ మనునది యుండనే యుండ దనియు శ్రీ సన్నిధానము సూర్య నారాయణ శాస్త్రిలవారు తెల్పియున్నారు.

వీర రసము : వీర రసమున నుత్సాహము స్థాయిభావము. ఇది యుత్తమ నాయకమై యుండును. ఇది దాన ధర్మ యుద్ధ దయా వీరములని నాలుగు విధములు. నాయకుఁడు దేనియం దుత్సాహము చూపునో దానినిబట్టి వీరమునకు పేరేర్పడును. రాముఁడు ధర్మవీరుఁడు. శిబి దానవీరుఁడు. అర్జునాదులు యుద్ధవీరులు. జీమూతవాహనుఁడు దయావీరుఁడు. పండిత రాయలు రసగంగాధరమున సత్యవీరమును గూడఁ బేర్కొనెను. హరిశ్చంద్రాదు లిందు కుదాహరణములు. ఇట్లు బలక్షమా పాండిత్య వీరములను గూడఁ జెప్పవచ్చును. ఇవన్నియు ప్రధానములైన దానధర్మ దయాదులందే యంతర్భవించునని కొందఱిమతము.

## 4. రసము యన్నిష్ఠము :

సంస్కృత లాక్షణికులలోఁ దొలుదొల్త రసవిషయకమైన చర్చ కావించినవాఁడు భరతముని. అతఁడు నాట్యశాస్త్రములో "విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అనియొక సూత్రము గావించెను. ఇందు రసమునకుఁ బూర్వరూపమైన స్థాయిభావము ప్రసక్తియేలేదు. పైగా సంయోగ నిష్పత్తి పదము లస్పష్టార్థములుగా నున్నవి. ఈ సూత్రము నాధారముగా గ్రహించి పలువురు లాక్షణికులు రస పరిణామ ప్రకారమును వివరింప యత్నించిరి. వారిలో భట్ట లోల్లట, శ్రీ శంకుక, భట్టనాయక, అభినవగుప్తులు నలువురును నాలుగు భిన్న వాదముల నావిష్కరించి యుండిరి. వానికిఁ గ్రమముగా నుత్పత్తి, అనుమితి, భుక్తి, అభివ్యక్తి వాదములవి పేరు.

భట్టలోల్లటుని మతమున రస మనుకార్యనిష్ఠ మైనది. అనుకార్యులనఁగా నాయా కావ్యములందు నాయకులైన రామాదులు. ఆలంబన విభావములైన సీతాదుల చేతను. ఉద్దీపన విభావములైన యారామాదుల చేతను నాయకులైన రామాదులందు రత్యాదులగు స్థాయి భావము లుదయించి, కటాక్ష భ్రూవిక్షేపాదులగు ననుభావములచే స్పష్టత్వమునొంది, నిర్వేద గ్లాన్యాదులగు వ్యభిచారి భావములచేఁ బరిపుష్టములై శృంగారాది రసములుగాఁ బరిణమించును. నాటకకర్త రామాది నాయకుల ప్రేమను లలితోచితములైన శబ్దములతో వర్ణించును, నటుఁడు వారి భావములను, వ్యాపారములను, గడుంగడు మెలకువతో నభినయించును. అభినయ సందర్భమున

నటులు ప్రదర్శించునైపుణ్యమునే సామాజికులు రామాదులగు ననుకార్యులమానసిక ప్రవృత్తులే వారియందును న్నున్నట్లు భ్రమింతురు. అనఁగా వారు నటులందు రామత్వాదు లారోపించి వారే రామాదులని భ్రాంతి నొందుదురు. అప్పుడు నిజమునకు రామాద్యనుకార్యుల యందే యుండు రసము వారి భూమికలు ధరించి నటించు నటులయందు లేకున్నను ఉన్నట్లే భాసించును. అట్టి నటుల దర్శించుట వలన రామాది నిష్టమగు రసము స్ఫురించుటయుఁ, దజ్జన్యమగు చమత్కార వశమున సామాజికు లానందించుటయు సంభవించును. నటునియందుఁ గలుగు ననుకార్య భ్రాంతి సామాజికుని కానందము కలిగించుటకు రజ్జువునుజూచి సర్పమని భ్రమించి భీతినొందు మానవుల వ్యాపారము దృష్టాంతముగాఁ జూపఁ బడినది. ఈ వాదము ననుసరించి రసము రామాదులయం దుత్పన్నమగు చుండుటచే దీని కుత్పత్తి వాదమని పేరు గల్గినది.

ఈ వాదమున కార్య కారణములకు సామానాధికరణ్యము లేకపోవుట ప్రధాన దోషము. రామాద్యనుకార్యగతమైన రసము వారి కానందము కలిగించును కాని సంబంధములేని సామాజికుల కెట్లానందము కలిగింపఁ జాలునో యందు స్పష్టముగా వివరింపఁబడ లేదు. సీతాదులు రామాదులకే విభావములుకాని సామా జికులకుఁ గాదుగదా! రామాదుల యానందమునుజూచి యానందమునొందు సామా జికులు వారు దుఃఖము నొందు నప్పుడు దుఃఖమును గూడఁ బొందుదు రనియు నందుచేఁ గరుణ రసప్రధానములైన నాటకాదులు సామాజికుల కానంద ప్రదములు కాఁజాల వనియు జెప్పవలసి వచ్చును. ఇచ్చట దృష్టాంతముగాఁ జూపఁబడిన రజ్జు సర్ప భ్రాంతికిని. నటనాయక భ్రాంతికిని పోలిక లేదు. మొదటి దాని యందు భ్రాంతి కారణము, భయము కార్యము. రెండవ దానియందు స్థాయి భావము కారణము ఆనందము కార్యము. కారణము అనుకార్యుని యందుండ కారణము సామాజికుని యందుండుటలో సామంజస్యములేదు ఈవాదమున సామాజికుఁ డనుభవించునది చమత్కారజనితమైన యానంద మేకాని రసముకాదు.

శ్రీ శంకుని మతమున రస మనుమితి విషయమైనది. నటు లభినయ నైపుణ్యముచే నాయకాదుల వ్యాపారములను జక్కఁగా నభినయింతురు. అప్పుడు సామాజికులా యనుకరణమునుజూచి నటులే యనుకార్యులని (నటులు నాయకాదుల కంటె భిన్నులుకారని) తలంతురు. నటు లభినయించు విభావానుభావ వ్యభిచారుల

సంయోగము వలనఁ దార్కిక వ్యాప్తి ననుసరించి సామాజికులు నటులయందుఁ గూడ రత్యాదుల ననుమానింతురు. ధూమ ముండుచోట నగ్ని యుండుననియు, ధూమము లేనిచో నగ్ని లేదనియు ననుకొనుటకుఁ దార్కిక వ్యవహారమున వ్యాప్తియని పేరు. ఈ వ్యాప్తి ననుసరించి సామాజికుల నాయ కాభిన్నులుగా గ్రహింపఁబడిన నటులయందు రత్యాదులుండుటచే రసముకూడ నున్నదని యనుమానింతురు. తరువాత నటులందలి రత్యాది స్థాయి భావములచే వారనుభవించి యానందింతురు. ఈ మతమున నటు లొనరించు నిపుణమైన యనుకరణముచే సామాజికులు చిత్ర తురగ న్యాయము ననుసరించి నటులే నాయకాదులని విశ్వసించుచు నాయకులందలి రసముకూడ నట నిష్ఠమై యున్నట్లనుమానింతురు. అందుచేతనే దీని కనుమితవాదమను పేరు కలిగినది.

భట్టలోల్లటుని మతమున వలెనే యిందుఁగూడ కార్య కారణములకు సామానాధికరణ్యము కానఁబడదు. నాయకాదు లందుండి నటులం దనుమానింపఁబడిన రసము సామాజికుల కెట్లానందము కలగించునో యిట వివరింపఁ బడలేదు. చిత్ర తురగన్యాయ మిచ్చుట సరిపడదు. చిత్రమునందలి తురగమెంత నిపుణముగాఁ జిత్రింపఁబడినను దురంగమువలె నుండును. కాని నిజముగాఁ దురగము మాత్రము కాఁజాలదు. మఱియుఁ బ్రత్యక్షజ్ఞానము చమత్కారమును గలిగించునట్లు ననుమాన జ్ఞానము కలిగింప నేరదు. రసమును బ్రత్యక్షముగా ననుభవించు చున్నానను మాట లోకమున నుండఁగా సామాజికుఁ డనుమానజ్ఞానముచే రసము ననుభవించుచున్నాఁ డనుట స్వభావ విరుద్ధము. తామెన్నడును జూడని నాయకాదుల వ్యాపారములను నటు లనుకరించుటయు వానినిజూచి సామాజికులు నటులే నాయకాదులని యనుమానించుటయు విశ్వసనీయ విషయములుకావు. ప్రఖ్యాత నాయకులవ్యాపారములను గ్రంథస్థితి పఠ్నాము ననుసరించి నటు లనుకరింపఁజాలినను గల్పితనాయకాదుల వ్యాపారములనుగూడ వారనుకరింపఁగనుట హాస్యాస్పదముగా నుండును.

భట్టనాయకుని మతమున రసము ప్రతీయ మానముకాని, ఉత్పాద్యమానము కాని, అభివ్యజ్య మానము కాని కాదు. కావ్య నాటకములం దభిదాశక్తి కంటె భిన్నమును విభావాది సాధారణాత్మకము నగు భావకత్వ వ్యాపారముచే భావ్యమానమై స్థాయిభావము సత్త్వోద్రేక ప్రకాశానందమయ సంవిద్విశ్రాంతి

సత్త్వమగు భోగముచే భుజ్యమాన మగుచున్నదని భట్టనాయకు నభిప్రాయ మైనట్లు కావ్య ప్రకాశము నుడువు చున్నది. రసాస్వాదము పరబ్రహ్మ సాక్షాత్కార తుల్యమైనదనియుఁ. పరబ్రహ్మవలెనే రసముచూడ నానందమయమైన దనియు భట్టనాయకుఁడు తలంచెను. ఈతని మతమున శబ్దమున కభిధాశక్తిగాక భావనా భోగీకృతులను మఱి రెండు వ్యాపారములు కూడ నుండును. వీనికే భావకత్వవ్యాపారము. భోగకృత్త్వవ్యాపారమునని నామాంతరములు. అభిధావ్యాపారము లంకారశాస్త్ర నిర్దిష్టమైనట్టిదే. ఇది శబ్దముయొక్క వాచ్యార్థమును బోధించును. ఇది ముగిసిపోఁగానే భావకత్వవ్యాపార మారంభమగును. ఇది, శబ్దముయొక్క రసాదులను బోధించును. (శృంగార రససందర్భమునఁ బరుషపద ప్రయోగ ముచితము కాదనుట యీ వ్యాపారముచేతనే. పరుషశబ్దమునకైనను, లలిత శబ్దమునకైనను, వాచ్యార్థ మాత్ర బోధకమైన యభిధా వ్యాపారము సమానమే.) ఈ వ్యాపారముచే సీతా రామాదులగు విభావములు తమ ప్రత్యేకతను గోల్పోయి సామాజికునికి సామాన్యులుగా గోచరించును. అనఁగా సీతాదులు సాధారణ స్త్రీత్వముతోడను రామాదులు సాధారణ పురుషత్వము తోడను గోచరింతురు. ఇట్లు భావములు సాధారణములుగాఁ చేయఁబడుటకే సాధారణీకరణ మని పేరు. దీని వలని సామాజికునకు నాయకాదులతో నభేదత్వ మావహిల్లును. ఇంతటితో భావకత్వ వ్యాపార మవసిత మగును. అంత మూఁడవదియైన భోగకృత్త్వ (భోజకత్వ) వ్యాపారము పనిచేయ మొదలిడును. దీనిచే సాధారణీకృతములైన రత్యాది స్థాయిభావములు సామాజికులచే ననుభవింపఁబడును. అప్పుడు వారానంద మయమె యొకానొక స్థితిని బొందుదురు. ఇది సాధారణములైన యనుభవముల కంటెను స్మృతుల కంటెను, విలక్షణమై పరబ్రహ్మాస్వాదతుల్యమై, స్వసంవేద్యముగా నుండును ఈ స్థితిలోఁ జిత్తమునకు ద్రుతి, విస్తారము, వికాసము అను ధర్మము లేర్పడును.

భోగకృత్త్వ వ్యాపారముచే సామాజికులందరి రజస్తమో గుణము లడంగి వారి హృదయముల సత్త్వోద్రేక మతిశయించును. అప్పుడు వారానంద మగ్నులై పరిసరములచే కాక తమ్ముఁ గూడ మఱచి వినుచున్న లేక చూచుచున్న వస్తు దృశ్యములతో నేకీభావము నొందుదురు. ఈ మతమున విభావాదుల భోజకములును రసము భోజ్యము నగుటచే దీనికి భుక్తివాద మను పేరు గలిగినది.

భట్ట నాయకుఁడు తన మతమునఁ గార్య కారణములకు సామానాధికరణ్యము లేకపోవుట యను దోషమును బరిహరింపఁ బ్రయత్నించెను. కాని భావకత్వ వ్యాపారముచే విభావములును రత్యాదులును సాధారణీకృతము లైనను సామాజికులు మొట్టమొదటఁ దమ యందు బీజరూపముగానైన లేనట్టి స్థాయి భావముల ననుభవించుటయు నాయకాద్యభేదము నొందుటయు నించుక యసంగతములుగా నున్నవి. అదిగాక భట్టనాయకుఁడు శబ్దమున కుండునని చెప్పిన యభిధాభిన్నము లైన భావకత్వ భోగకృత్త్వ వ్యాపారములు కేవలము కల్పితములైన వగుటచేఁ బ్రామాణిక సమ్మతములు గాకున్నవి. వ్యంజనయే భావకత్వ వ్యాపారమును నిర్వహించు చుండ దానికై యొక క్రొత్తవ్యాపారమును గల్పించుట యనవసరము. అభినవగుప్తుఁడీ వ్యాపారము విభావాదులందే యని చెప్పెను. "తా ఏవ పరిహృత విశేషా రస హేతవః" అని భరతముని చెప్పిన వాక్యము కూడ నీ విషయమునే బోధించు చున్నవి. విశ్వనాథుఁడు విభావాదులకు సాధారణీకృతి యను పేరుగల యొక వ్యాపారమున్నదని స్పష్టముగాఁ జెప్పియుండెను. (వ్యాపారోఽస్తి విభావాదే ర్నామ్నా సాధారణీ కృతిః)

భట్టనాయకుఁడు రసము సామాజిక నిష్ఠ మనియే చెప్పెను. కాని దానికి బీజములు స్వల్పముగానైన సామాజికులం దుండునని యంగీకరింపలేదు. అభినవగుప్తుని మతమున రసమభివ్యక్తము, సహృదయుల హృదయములందు రత్యాదులు వాసనా రూపమున నడఁగి యుండు ననియు, నవి విభా వానుభావాదులచే సముల్లాసితములై రసములుగాఁ బరిణమించు ననియు నాతని వాదము. ఈతని మతమున నీ వాసన లేనిచో రసాస్వాదము గలుగదు. అందుచేతనే వైయాకరణులకును మీమాంసకులకును రసాస్వాదము గలుగదని ధ్వనికారుఁడుచెప్పియుండెను. వాసనా రహితులైన సామాజికులకు రసాస్వాదము మృగ్య మనియు, నట్టివారురంగాంతః స్థిత కాష్ఠ కుడ్యాశ్మ సన్నిభు లనియు ధర్మదత్తుఁడు వివరించి యుండెను.

"సవాసనానాం సభ్యానాం రస స్యాస్వాదనం భవేత్
నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠ కుడ్యాశ్మ సన్నిభాః"

వ్యంజనా శక్తి ప్రభావముచే రస మభివ్యక్త మగుననియు. రసాస్వాదనమును వివరించి వర్ణింప వచ్చుననియు నభినవగుప్తుఁడు నుడివి యుండెను.

అతఁడు భట్ట నాయకుని భావకత్వ వ్యాపారమును బూర్తిగా నుజ్జగించెను. రస భోగమని చెప్పక యాతఁడు రస ప్రతీతి యనియు, రసచర్వణ మనియు నుడువుచుండును. ఈతని వాదము ననుసరించి వాసనా రూపమున నున్న స్థాయిభావములనే విభావాదులు వ్యక్తము చేయుననియు నా వ్యక్తములైన స్థాయీ భావములే రసము లనియు స్పష్టమగుచున్నది. అందుచేతనే దీని కభివ్యక్తి వాదమనుపేరు వచ్చినది. అభివ్యక్తి యనఁగా నున్నదానిని వ్యక్తము చేయుట. భట్టనాయకుని మతమున నీ వాసనా ప్రసక్తియే లేదు. భుక్తభివ్యక్తి వాదములందలి ముఖ్య భేదములలో నిదియొకటి.

అభినవగుప్తుని మతమున భరత సూత్రము నందలి సంయోగపదమునకు వ్యంగ్య వ్యంజక భావ మర్థము. నిష్పత్తి యనఁగా నభివ్యక్తి. రత్యాదులగు స్థాయి భావములు వ్యంజకములగు విభావానుభావాదిభావములచే వ్యంగములై రసములగును.

భరతుఁడు ముఖ్యముగా దృశ్య కావ్యములను మనమున నుంచుకొని రస సూత్రమును వివరించెను. లోల్లటాదులును నా దృష్టితోనే దానికి వ్యాఖ్యానము కావించిరి. ధ్వనికారుఁడైన యానందవర్ధనుఁడు రససిద్ధాంతమును శ్రవ్యకావ్యముల విషయమునఁ గూడ సమన్వయించెను. దృశ్యకావ్యములందు నటుల మూలమున విభావాదులు ప్రత్యక్ష మగుచుండును. కావున సామాజికులు నాయకాభేదమును బొంది యానందము ననుభవింతురు. శ్రవ్యకావ్యములలో నాయకాదులు ప్రత్యక్షము కావు. కావున సామాజిక స్థానీయులైన పాఠకులు నాయకాభేదము నొంది రసానందము నెట్లనుభవింతురని సందేహము కలుగవచ్చును. వాక్యపదీయ కారుఁడైన భర్తృహరి ''పాఠకులకు శబ్దోపహితరూపములు గల్గి బుద్ధి విషయత్వము నొందిన కంసాదులను ప్రత్యక్షములైన వారిని వలె సాధనములుగా గ్రహింతు'రని తెల్పి యా సందేహమును నివారించినాఁడు.

''శబ్దోపహిత రూపాం స్థాన్ బుద్ధే ర్విషయతాం గతాన్
ప్రత్యక్షా నివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే''

అనఁగా శ్రవ్య కావ్యములందుఁ గవులు వాడు శబ్దములచేతను, జేయు వర్ణనాదులచేతను నాయకాదులు రూపమును బొంది, పాఠక హృదయములు చొచ్చి

ప్రత్యక్షముగా గోచరింతురు. వారు రంగమునం జర్మ చక్షువులతోఁ జూచు నాయకాదులనే శ్రవ్య కావ్యముల విను సందర్భమున హృదయరంగమున మనో నేత్రములతోఁ దిలకించి తదభేదము నొంది రసానందము ననుభవింతురు.

ఆత్మ యానందమయ మైనట్టిది. దాని నావరించి యుండు నజ్ఞానము తొలఁ గఁగనే యా యానందము స్వస్వరూపముతో విలసిల్లును. కావ్య పఠనాపసరము లందు విభావాదులచే నీ యజ్ఞానావరణము తొలఁగింపఁబడుచుండును. అప్పుడు తన్ను బరివేష్టించి యుండు రత్యాది వాసనలతోఁ గూడి యాత్మానందము ప్రకాశించును. తదానంద సంవలిత మైన రత్యాదులకే రసము లని పేరు. రసానందము విచిత్రమైనది. తదనుభవము సహృదయ హృదయైక వేద్య మైనట్టిది.

లోకమున శోకకారణములైన పరిస్థితులవలన శోకమే కలుగుచుండఁగా గావ్యములం దవి యానందము నెట్లుత్పాదింపఁ జాలునను శంక కలుగ వచ్చును. లోక గత నాయికాదులకును గావ్య స్థిత నాయకాదులకును గల లౌకి కాలౌకికత్వ భేదమే యీ వ్యత్యాసమునకుఁ గారణము. కావ్య శిల్ప మలౌకికమైనది. అట్లే కావ్యగత నాయకాదులకు లౌకిక నాయకాదులుగాక తదనుకర్తలగుటచే నలౌకికులే యగుచున్నారు. లోకమున శోక హర్షాదులకుఁ గారణములైనవి కావ్యమునఁ గారణ శబ్ద వాచ్యతను వీడి విభావ శబ్ద వాచ్యత నొందుచున్నవి. కావ్యగతములైన యీ విభావము లన్నిటి వలనను బాఠక సామాజికుల కానందమే యావహిల్లు చుండును. సామాన్య సమయముల వేదనాకరములగు నఖదంతక్షతాదులు సురత వేళాదత్తములైనచో సుఖ సంధాయకము లగుచుండుట యనుభవసిద్ధ విషయమే కదా! "తేభ్య స్సురతే దంత ఘాతాదిభ్య ఇవ సుఖమేవ జాయతే".

కరుణాది రసము లానంద ప్రదము లెట్లగు నని యాశంకించి సాహిత్య దర్పణకారుఁడు పై విషయమునే యిట్లు చెప్పి యున్నాఁడు.

"హేతుత్వం శోకహర్షాదేః గతేభ్యో లోక సంశ్రయాత్
శోక హర్షాదయో లోకే జాయన్తాం నామ లౌకికాః
అలౌకిక విభావత్వం ప్రాప్తేభ్యః కావ్య సంశ్రయాత్
సుఖం సంజాయతే తేభ్యః సర్వేభ్యోఽపీతి కాక్షతిః"

లోకమున శోక హర్షాదులకు హేతువులైన వానివలన లౌకికములైన శోక హర్షములే గలుగు ననియుఁ గావ్య శ్రయముచే నలౌకిక విభావత్వమును బొందిన వాని యన్నింటి వలనను సుఖమే సంజాత మగుననుటలో విప్రతిపత్తి లేదనియు నాతని భావము అట్లుగాక కరుణాది రసములు దుఃఖ హేతువులే యైనచోఁ దత్ప్రధానములైన కావ్యముల యెడ నెవ్వ రున్ముఖు లగుదురని యాతని ప్రశ్న. ("కించ తేషు యదా దుఃఖం నకోపి స్యా త్తదున్ముఖః") రామాయణాది కావ్యములు కరుణరస ప్రధానములయ్యుఁ బెక్కుసారులు పాఠక జనుల నాకర్షించు చుండుట కవి యానంద ప్రదము లగుటయే కారణమని వేఱు చెప్పనక్కఱ లేదు గదా!

హరిశ్చంద్రనాటకము, రామాయణ నాటకము మున్నగు నాటకములను దర్శించు నప్పు డందలి కరుణ రస నిర్భరములైన ఘట్టములఁ గాంచి సామాజికు లలోఁ గొందఱు కంటఁ దడి పెట్టుచుండుట మనము కాంచుచుందుము. నాటక ప్రయోగమే రసముతోఁ గూడిన దైనను ఆనంద ప్రద మగుచుండగాఁ వారట్లు కన్నీరు కార్చుటకు హేతువేమి! ఆ యశ్రువులు హృదయమునకు సహజమైన దయా సానుభూతులచేఁ గలుగునట్టివేగాని దుఃఖ భాష్పములు కావు. "అశ్రుపాతా దయ స్తద్వద్ద్రుతత్వాచ్చేతసో మతాః" అని సాహిత్యదర్పణము నుడువుచున్నది. అనఁగా నట్టి సమయముల వారి హృదయము ద్రవించి కనుల వెంట నీరై వచ్చును. ఆ కన్నీరు ఆనంద సూచక మెనట్టిదే గాని దుఃఖసూచకము కాదు.

పాశ్చాత్యులు మోదాంత నాటకములకన్న విషాదాంత నాటకములనే యుదాత్తములుగాఁ బరిగణింతురు. దానికిఁ దజ్జన్యమగు నానందము విశిష్టమై యుండుటయే కారణమని చెప్పవలెను. గ్రీకు తత్త్వవేత్తలలో నగ్రగణ్యుఁడును, పాశ్చాత్య లాక్షణికుల కాదర్శ ప్రాయుఁడునగు నరిస్టాటిలు లలితకళ లన్నియు ననుకరణాత్మకములని యభిప్రాయపడి యుండెను. లలితకళల ననుభవించువారు దత్కళాజనితానందమును సమగ్రముగాఁ బొందవలెనవిన నవి యనుకరణములను సంగతి విస్మరింపరాదు. అదిగాక యథార్థములే యని భావించుచో వారి కానందము నకు బదులు భయ జుగుప్సా కోపాదులగు నితర భావము లుప్పతిల్లును. అనుభవ

మును బట్టి చూచిన నీ విషయము తేట తెల్ల మగును. ఇరువురు యోధులు నిశిత కరవాలములు దాల్చి యొండొరులఁ జంప నుంకించుచు యుద్ధమొనరించు దృశ్యమును జూచునప్పుడు మనకు భయకంపాదులేగాని యానందము కలుగదు. అట్టి దృశ్యమును జూడలేక భయాక్రాంతులమై మనము దవ్వుగాఁ బోనెంతుము. అట్లుగాక ప్రతిభాశాలియైన మహాకవి యిరువురు యోధులు గావించు పోరాటమును సవిస్తరముగా వర్ణించుచుఁ బద్యములు వ్రాసినచో నా పద్యములను జదువునప్పుడు మన మానందము నొందుటే కాక వానిని మాటి మాటికిఁ జదువ నిచ్ఛగింతుము. ప్రకృతిలో దుఃఖమును గలిగించు నభిమన్యువధాది ఘట్టములను మనము పునః పునః చదువ నువ్విళ్లూరుటకును. బంది, గాడిద మున్నగు నసహ్యములగు జంతువుల చిత్రములనైనఁ బఠించిదిగా నవలోకింపఁ దివురుటకును నదియే కారణము. దీనినే పండితరాయలు "అయంహి లోకోత్తరస్య కావ్య వ్యాపారస్య మహిమా యత్ప్రయోజ్యా రమణీయా శ్శోకాదయః పదార్థా ఆహ్లాద మలౌకికం జనయన్తి విలక్షణోహి కమనీయః కావ్య వ్యాపారజ ఆస్వాదః" అని రసగంగాధరమున నుడివి యుండెను. ఈ విషయ మొక్క కావ్యముననేకాక యితర లలితకళలకును నన్వయించును. ప్రకృతిలో భయ చింతా జుగుప్సాదులను గలిగించు దృశ్యములే కళారూపము నొందినప్పుడు మన కానందజనకము లగుటకు అవి యనుకరణములే కాని యదార్థములు కావని మనభావముల జ్ఞానము స్థిరముగా నుండుటయే కారణము. మనము దారిన బోవునపు డొక కుక్క మొఱిగినచో భయపడి పాఱిపోవుదుము. హాస్యకారుఁడు కుక్కకూఁత ననుకరించినచో మన మచ్చెరువడి నిల్చి యానందింతుము. హాస్యకారుఁడు మనకుఁ గనఁబడకుండ మఱుగున నున్నచో మనమా కూఁతనే విని యది నిజమైన కుక్కకూఁతయని యెంచి దానివిగూర్చి యిసుమంతయైననాలోచింపక మనదారిని బోవుదము. అందుచేఁ గళలవలనఁ బుట్టు నానందముననుభవించుటకు అవి యనుకరణములను జ్ఞానముతప్పకయుండవలెను. ఈ యనుకరణ జ్ఞానమే యానందజనకమని (Imitation begets pleasure) అను నాంగ్లేయ వాక్యము సూచించుచున్నది. కావ్యగత నాయకాదు లనుకర్తలే కాని యదార్థ రూపులు గాకపోవుటచేఁ గావ్యరసమేదియైనను అది పాఠకజనుల కానంద సంధాయక మగుట సంభవించుచున్నది. దీనివలన శృంగారాదు లెట్లో కరుణాదులు గూడ నట్లే యానంద జనకములని నిర్ణయింప వచ్చును.

## రస సమీకరణము :

రసముల సంఖ్యను సూచించుచు నాట్య శాస్త్రమున భరతముని చెప్పిన శ్లోకమునకుఁ బాఠాంతర మేర్పడుటచే రసము లెనిమిదియా తొమ్మిదియా యను విషయము వివాదాస్పదమైనది. ప్రాచీనాలంకారికులలోఁ గొంద ఱెనిమిదియను పక్షమును మఱికొందఱు తొమ్మిదియను పక్షమును నవలంబించి వాదించిరి. శృంగారాది రసములలో శాంతమును జేర్చుటయా చేర్చకపోవుటయా యనునదే యీ యభిప్రాయ భేదమునకుఁ గారణము. ఈ భేద మిట్లుండ నర్వాచీనులైన కొందఱాలంకారికులు శాంతరసముతోఁ గూడిన నవరసములకు మఱికొన్ని క్రొత్త రసములు చేర్చి రససంఖ్యను బదుమూఁడింటి వఱకును బెంచి యుండిరి. ఇట్లు వివిధ రస భావములకుఁ గల సూక్ష్మాతి సూక్ష్మ భేదములను గుర్తించి రసముల సంఖ్యను బెంప యత్నించు వారికిఁ బ్రకృతి రసమొక్కటే యనియు మిగిలిన వన్నియు దాని వికృతు లనియుఁ జెప్పి రసముల కైక్యము కల్పించినవారు కూడఁ గొందఱు కలరు. వీనిలో నైత మందఱు నేకరంతముగా నొకే రసము నకుఁ బ్రకృతిత్వ మాపాదించిన వారు కారు. ఒక్కొక్క రొక్కొక్క రసము నారాధించి, దానికిఁ బ్రాధాన్యము నిరూపించి యుండిరి. ఇట్టివారిలో నాలంకారికులే కాక కవులు కూడఁ బలువురు కలరు.

భవభూతి మహాకవి కరుణ రసమునకుఁ బ్రకృతిత్వము నొసంగుచు

"ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదా
ద్భిన్నః పృథక్పృథగి వాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారా
నంభో యథా సలిల మేవ హి త త్సమస్తమ్."

అని యుత్తరరామచరిత నాటకమున ఘోషించి యుండెను. వాసంతీ సీతారామ ప్రభృతులయందుఁ గరుణరసమొక్కటే వివిధరూపములతోఁ బరస్పర విలక్షణావస్థా విశేషములను భజించు చున్నదని తమస సూచించుట నాటిక కథా సందర్భమునఁ బై శ్లోకముయొక్క పూర్వార్థమునకుఁ బ్రయోజనము. కాని భవభూతి

యందు రస విషయమునఁ దనకుఁ గల యభిప్రాయమును గూడఁ బరోక్షముగ వ్యక్తము చేయుచున్నాడు. ఒక్క నీరే యావర్త బుద్బుద తరంగ మయములైన వివిధవికారములను బొందుచున్నట్లు కరుణరస మొక్కటే నిమిత్త భేదము వలన శృంగా రాద్యన్యరూపములను బొందుచున్నదని యాతని యభిప్రాయము. కరుణ రసము ప్రకృతి యనియు, శృంగారాదులు దాని వికృతులనియు నిందలి భావము. దీనినే వ్యాఖ్యానకర్తయైన వీరరాఘవుఁడు. "ఇదమత్ర కవేర్మతమ్. యద్యపి శృంగార ఏవ ఏవరస ఇతి శృంగార ప్రకాశ కారాదిమతం. తథాపి ప్రాచుర్యాత్ రాగి విరాగి సాధారణ్యాత్ కరుణ ఏక ఏవ రసః. అన్యేతు తద్వికృతయః" అని స్పష్టీకరించెను. ఈ వివరణమున నతఁడు లోకమున నితర రసములకన్నఁ గరుణ రసము ప్రచురతరముగా గోచరించు చుండుటయు. నది రక్తచిత్తులైన లౌకికులకును విరక్తచిత్తులైన యోగులకును గూడ సాధారణమై యుండుటయు. భవభూతి యా రసమునకుఁ బ్రకృతిత్వము కల్పించుటకు హేతువులుగా నుగ్గడించెను. కావ్య నాటకాదులు కలిగించు చిత్తసంవాదము కరుణరసము విషయమున సమగ్రస్ఫూర్తి వహించుట యనుభవసిద్ధమే. రసములన్నియు సహృదయ హృదయాకర్షకత్వమున సమాన శక్తికములే యయ్యుఁ గరుణ రస మా విషయమున నించుక శక్తిమత్తరముగా గోచరించును. అదిగాక కరుణ రసమయములైన కావ్యములే యధిక మాధుర్యోదంచితములై యుండునని యనుభవజ్ఞులు నుడువుదురు. కరుణ రసోద్రేకమే సంస్కృతమునందలి యాదికావ్య మావిర్భవించుటకుఁ గారణము. మఱియు 'రసేషు కరుణో రస' యను నానుడి చిరకాలమునుండి యనుశ్రుతముగా వచ్చుచున్నది. ఆనందవర్ధనుడు హృదయార్ద్రితా వహమైన మాధుర్య గుణము కరుణ రసమున నతిశయించి యుండునని ధ్వన్యాలోకమున నుడివి యున్నాఁడు. (మాధుర్య మార్ద్రితాం యాతి యతస్తత్రాధికం మనః) ఆ రసమునకు భవభూతి ప్రాధాన్య మొసంగుట కిదియే కారణమైయుండును. కాని యాతనివలెఁ గరుణరస ప్రకృతిత్వ ముపాదింప యత్నించిన వా రాలంకారికులలో నెవ్వరును గానరారు.

సరస్వతీ కంఠాభరణ, శృంగార ప్రకాశాది గ్రంథకర్తయైన భోజుఁడు తాను గల్పించిన "శృంగారముననే" సర్వరస భావములును లీనములై యుండునని పఠించెను. ఆత్మగుణమును, పూర్వజన్మకృత సుకృతములకు ఫలముగాఁ గలుగు నట్టిదియు నగు నహంకారమే సర్వభావములకును మూలబీజమని యాతని

యభిప్రాయము. ఇది సాధారణముగా మనము గర్వమను నర్థమున వాడు నహంకారముకాదు. దీనికే శృంగారము, యభిమానము అని మాఱుపేర్లు. తనయందును నితరులందును నితర పదార్థము లందును మానవుఁడు ప్రీతిగలిగి వర్తించుట కిదియే కారణము. ఈ యర్థమున నిది 'యాత్మరతి' యనఁబడును. నిజమునకిది యొక్కటే రసము. రతిహాసాదులు దీనినుండియే జనించును. ప్రకర్ష ప్రాప్తము లైన వీరిచే నర్చిశ్చయములచే నగ్నివలెఁ బ్రకాశించుచు నిది 'శృంగారవంతులకే' రుచించుచుండును. (తతఏతే రత్యాదయో జాయన్తే తైశ్చాయం ప్రకర్ష ప్రాప్తైః సప్తార్చి రర్చిశ్చయైరివ ప్రకాశ మానః శృంగారిణామేన స్వదత ఇతి) దీనిని బట్టి రతిస్థాయికమై భరతాదులచే రససమూహమున నాద్యముగాఁ బేర్కొనఁబడిన శృంగార రసమునకును దీనికిని సంబంధమే లేదని తెలయవచ్చును. భోజుని మతము ననుసరించియే రసభావము లనుభవించుటకైన నాతని యహంకార శృంగార మావశ్యకమై యుండును. శాంతముకూడ నీ యహంకారమునకు లోఁబడినదే యని యూహ రతివలెనే శమముకూడ నహంకార జన్యమైనట్టిదే.

రస మనునది యనిర్వచనీయమైన యానందానుభవము. "ఇది శోకము. ఇది రతి, ఇతి హాసము." అను స్థితిజ్ఞానము కలిగియుండు నంతవఱకు సామాజికులు భావనావస్థలో మాత్రమే యున్నారని చెప్పవలయును. రస మీ యవస్థ కతీతమై యుండును. దీనినే భోజుఁడు.

"అభావ నోదయ మనన్య ధియా జనేన
యో భావ్యతే మనపి భావనయా స భావః
యో భావనా పథ మతీత్య వివర్తమానః
సాహంకృతౌ హృది పరం స్వదతే రసోఽసౌ"

అని చెప్పి యుండెను. శృంగార వీర హాస్యాదులు నిజమునకుఁ గేవలము భావావస్థలే యనియు, రస మనున దేకైకమనియు, రసమనుట తక్క దాని నింకొక విధమునఁ బేర్కొన రాదనియు భోజుని యభిప్రాయము.

అహంకార శృంగార రసైకత్వమును బ్రతిపాదించుచునే భోజుఁడు ప్రేమ రసప్రకృతిత్వమును గూడ నిరూపించియుండెను. ఈ రెండింటికిని సన్నిహిత

మైన సంబంధ మున్నది. రతి స్నేహ భక్తి ప్రముఖములైన భావముల కెల్ల నహంకారము వలెనే ప్రేమయు మూల ప్రభవమై యుండు ననియుఁ, దమ హృదయములం దణఁగి యున్న యొకానొక ప్రీతిని దృప్తిపఱుచుటకే మానవులే కార్యములైన నాచరింతురనియు భోజుని యభిప్రాయము. ఎవ్వరైన నవ్వినచో వారికి నవ్వుట యందును. యుద్ధ మొనరించినచో నా యుద్ధ మొనరించుట యందును. వారికిఁ బ్రీతి యున్నదని మన మూహింప వలయును. ఆ ప్రీతి లేకున్నచో వారా కార్యముల నొనరింపనే నొనరింపరు. భోజుఁడు ప్రతిపాదించిన యీ ప్రేమ రసమునఁ బూర్వకోటి మధ్యమావస్థ ఉత్తరకోటి యని మూఁడవస్థ లున్నవి. మొదటి స్థితిలో నిది యొక్క యహంకారమే; రెండవదస నా యహంకార మేకోన పంచాశద్భావములుగా మాఱుటయు నివి విభా వానుభావాదులచేఁ బరిపుష్టినొందుటయు సంభవించును. తృతీయావస్థలో నీ భావము లన్నియుఁ బ్రేమగాఁ బరిణమించి మఱలఁ బ్రథమావస్థను అనఁగా నేకైకమైన యహంకార రసమును అనుభూతికిఁ దెచ్చును. అలంకార కౌస్తుభమునఁ గవికర్ణపూరుఁడు కూడఁ బ్రేమరసప్రకృతిత్వమునే ప్రతిపాదించెను.

> "ఉన్మజ్జన్తి నిమజ్జన్తి ప్రేమ్ణ్యఖండ రసత్వతః
> సర్వే రసాశ్చ భావాశ్చ తరంగా ఇవ వారిధౌ"

అనియు "ప్రేమరసే సర్వే రసా అంతర్భవన్తి" యనియు నందాతఁడు వివరించి యుండెను.

అగ్ని పురాణమున సైతము భోజ ప్రతిపాదితమైన యలంకారము ప్రస్తావింపఁబడినది. కాని తత్కర్త యభిప్రాయము ననుసరించి యహంకారమునుండి యభిమానమును, దానినుండి మొదట రతియును జనించును. ఈ రతియే పరిపోషము నొంది వ్యభిచార్యాది సామాన్యమువలన శృంగారమని చెప్పఁబడుచున్నది. హాస్యాద్యన్య రసము లన్నియుఁ దద్భేదములే. (అభిమానా ద్రతిస్సాచ పరిపోష ముపేయుషీ. వ్యభిచార్యాది సామాన్యాత్ శృంగార ఇతి గీయతే. తద్భేదాః కామ మితరే. హాస్యాద్యా అప్యనేకశః) భోజుఁడిట్లుకాక రత్యాదిభావములన్నియు అహంకార జన్యములేయని యభిప్రాయపడి యుండెను. పరబ్రహ్మమున కానందము

సహజమైన దనియు, నది యొక్కొక్కప్పుడు వ్యక్తమగుచుండు ననియు, చైతన్యము, లేక చమత్కారము, లేక రసము అనునదియే దాని వ్యక్తరూప మనియు, నాద్యమైన దాని వికారమే యహంకారమనియు నగ్ని పురాణ మహం కార స్వరూపమును వివరించి యున్నది. స్వల్ప భేదమున్నను భోజుని యహం కార శృంగారమునకును, నగ్ని పురాణ ప్రతి పాదితమైన రతి శృంగారమునకును దగ్గఱ సంబంధ మున్నది.

అభినవగుప్తుఁడభినవభారతిలో శాంత రస ప్రాధాన్యమును ప్రతిపా దించెను. అలంకారికులలో నేదో యొక రసమునకుఁ ప్రకృతిత్వమును మిగిలిన వానికిఁ దదంతర్భూతత్వమును సూచించిన ప్రథమాచార్యుఁ డితడే. శాంతము పురుషార్థములలో నత్యుత్తమమైన తురీయ పురుషార్థమునకు సంబంధించి యుండుటయుఁ. గావ్యజనితమైన రసానంద మైహికానంద భిన్నమును, నతి లోకమును, ననంతమునునై యొప్పారుచు, శాంతము తోడి సంపర్కమును సూచించుచుండుటయు, నాతఁడా రసమునకుఁ బ్రాధాన్యము కల్పించుటకు హేతువు. అదిగాక, శాంతమునకు స్థాయియైన యాత్మ సర్వమానవ వ్యాపారములకును మూలభూతమై, శృంగారాది వృత్తిరూపముల వహించు చిత్తమునకు వికాసము చేకూర్చుచుండును. అందుచేతనే యిది స్థాయితమ మనియు దీని పరిణామమై శాంతము ప్రకృతి రసమనియుఁ జెప్పఁబడుచున్నది.

ఇప్పుడు లభించుచున్న నాట్యశాస్త్ర ప్రతులలో శృంగార రసము మొదటి రసముగాఁ బేర్కొనఁబడుటచే దానిని గూర్చిన చర్చయే మొదటఁ గావవచ్చు చున్నది. కాని యభినవ గుప్తుఁడు చూచిన చిరంతన ప్రతులు కొన్నిటిలో శాంత రస వివరణమే ముందొనఁగఁబడినదట! భరతుఁడు శాంతము నట్లు ముందు వివ రించుట దాని ప్రధానత్వము నూహించియే యని తలంపవలయును. దీని కుప బలముగా శాంతమును నవమ రసముగాఁ ప్రతిపాదించు శ్లోకములు గల పాఠ ములో * "రత్యాదులగు భావములు వికారములు. శాంతము ప్రకృతి యైనట్టిది.

---

* భావా వికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే.

వికారములు ప్రకృతియందే పుట్టి యందే లయ మొందుచున్న" వని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

విశ్వనాథుఁడు సాహిత్య దర్పణమున నారాయణోపజ్ఞముగా నద్భుత రస ప్రాధాన్య సిద్ధాంతమును బేర్కొనెను. ఆ సందర్భమున నాతఁ డుదహరించిన ధర్మ దత్తుని శ్లోకము "రసమున సారమైన చమత్కారము సర్వత్ర అనుభ వింపఁబడుచున్నది చమత్కార సారత్వమువలన నద్భుత రస మెల్లెడను గలదని చెప్పవచ్చును. అందుచే నారాయణుఁ డద్భుతమే రసమని నుడివియుండె" నని తెల్పుచున్నది. రసాస్వాద రూపమని చెప్పఁబడు చమత్కార మద్భుత రస మయమైనట్టిదే. మఱియు రసాస్వాదనము నందలి లోకోత్తరత్వ మద్భుత రస ప్రాధాన్యమును సూచించుచున్నది. శృంగారాది రసములం దన్నింట నద్భుత మంగముగా గోచరించుననియు, నదియే యంగిగా నున్నప్పు డద్భుతరసమని చెప్పఁబడుచున్నదనియు రసతరంగిణిలో భానుదత్తుఁడు వివరించియున్నాఁడు.

కావ్యములందు రస వస్త్వలంకారములు మూఁడింట నద్భుత రసము వ్యాపించియే యుండును. రస ప్రతీతి పరాకాష్ఠ నొందు నపుడన్ని రసములందు నద్భుతము గోచరించుట యనుభవసిద్ధమే. అద్భుతము కొన్ని యితర రసములకుఁ బుష్టి చేకూర్చు ననుట సత్యదూరము కాదు. శృంగార రస పోషణమున కద్భుత మెక్కువగాఁ దోడ్పడును. వీరరసమున నద్భుతమున కెక్కువ ప్రసక్తి యుండుట చేతనే భరతుఁడు దానిని వీరరస జన్యమని పేర్కొనెను. ఇంక హాస్యమునకును, నద్భుతమునకును గల సంబంధము వేఱే చెప్పనక్కరలేదు. నాటక ప్రయోగ సందర్భమున సామాజిక మానసముల నావరించుట కద్భుత రసమున కపారమైన శక్తి కలదు. ఇందుచేతనే భరతుఁడు నాటక కథ యందలి కొన్ని యంశములను వెల్లడించుచుఁ గొన్నిటిని నిగూఢ మొనరించుచుఁ బ్రతి క్షణము సామాజికుల హృదయములకు విస్మయ మావహిల్లునట్లుగా వస్తువు ననుసంధింపవలెనని చెప్పియుండెను. వస్తుసంధానమున సంధ్యంగములకుఁ గల యొక ప్రయోజన మద్భుతమును జేకూర్చుటయే. మఱియుఁ గథ నుచితరీతిఁ గ్లిష్టముగా నొనరించి యంతమున నందలి గ్రంథుల నన్నింటి విడఁదీసి సామాజికుల కద్భుతము

కలిగింప వలసిన యక్కల కలవని భరతుఁడు సూచించెను. అందుచేతనే యతఁడు నాటక కార్యము గోపుచ్ఛాగ్రాకారమై యుండవలె ననియు, గోపుచ్ఛమునకుఁ జివర వాలగుచ్ఛ ముండునట్లు కథాంతమున నద్భుత సన్నివేశముల సమాహారము కానరావలె ననియు వచించి యుండెను. నిర్వహణ మద్భుత రసమయమై యుండవలె ననుట కిదియే యర్థము. ఇంక నలంకార విషయమున దండి భామహు లతిశయోక్తిని బ్రధానముగాఁ బేర్కొని యలంకారాంతరములు దాని వివిధ రూపములని చెప్పుట యద్భుత రస ప్రాధాన్యమును సూచించుచునే యున్నది. అతిశయోక్తికిని నద్భుతమునకును గల సంబంధమే యిందుకుఁ గారణము ఆనందవర్ధనుఁడును నభినవగుప్తుఁడును గూడఁ గావ్యములం దతిశయోక్త్య ద్భుతములకుఁ గల ప్రాముఖ్య పాటవములను వివరించి యున్నారు

శక్తిభద్ర విరచితమైన యాశ్చర్య చూడామణి యద్భుత రస ప్రధానమై యా రసము యొక్క ప్రాముఖ్యమును బలువిధములఁ బ్రకటించుచున్నది. కృత్యా రావణ మను నాటకముకూడ నాశ్చర్యచూడామణి వలెనే యద్భుత రస ప్రాధాన్య మును బ్రకటించు నట్టిదే యఁట! మహాదేవ విరచితమైన యద్భుతదర్పణము న రాముఁ "దద్భుతైక రసావృత్తి రంత ర్మే లయవతీపమా" మ్మని పల్కుటయు నాకవి కద్భుత రస ప్రాధాన్యమునఁ గల ప్రత్యయమును జాటుచున్నది.

రసప్రదీప కారుఁడైన ప్రభాకరుఁ డద్భుత రస ప్రాధాన్య వాదమున ఖండించుచు "నారాయణుఁ దద్భుత మొక్కటే రసమని వాకొనెను. ధర్మదత్తాద లాతనిననుసరించిరి. కాని యది యుక్తముకాదు. అనుభవమున నది విలక్షణముగ నుండుటచే యిందుకు హేతువు వ్యభిచారులందు స్థాయికి వలె రత్యాదు లంద విస్మయమున కనుగమము లేదు. శోకాదు లిందు కుదాహరణము" లని పలికెను అతఁ డలంకార రహస్య మను గ్రంథమును రచించె ననియు నందద్భుత రసము సర్వాన్యరసాంతర్భూతమై యుండునను సిద్ధాంతమును బూర్తిగాఖండించెననియుఁ దెలియుచున్నది. కాని యా గ్రంథ మిప్పుడుపలభ్యమానము కాదు.

శృంగారాదులగు కొన్ని యితర రసములతోఁ గూడ నద్భుతాంశ గోచరించుచున్న మాట సత్యమే యైనను బ్రభాకారుఁడు వచించినట్లు కరుణము దానికి స్థానమేలేదు. రసాస్వాదము చిత్త సంవాదమే యైనను ఆ చిత్త సంవా

మన్ని రసముల సందర్భమునను విస్తారరూపమునే వహింపదు. అది కొన్ని కొన్ని రసముల విషయమున భిన్న రూపములు వహించుచుండును. కరుణ శృంగారముల విషయమున నది ద్రుతిరూపమును బీభత్సము విషయమున సంక్షోభ రూపమును వహించుట యిందుకు దృష్టాంతము. మఱియు శృంగార కరుణము లందలి ద్రుతి బీభత్స భయానక రౌద్రాద్భుతములం దించుకయుఁ గానిపింపనే కానిపింపదు. దీనిని బురస్కరించుకొని చూచినచో నొక రసముననే యితర రసము లన్నియు నంతర్భూతములై యుండు ననుసమీకరణ వాదము లోప భూయిష్ఠముగా గోచరించును. శాంత శృంగార సమీకరణ వాదములే యితరములైనవాని కంటెఁ గొంత మెఱుఁగు.

ఏకైక రస ప్రకృతిత్వము నీ విధముగా నంగీకరించుట కష్టమే యైనను అనిర్వాచ్యానంద రూపమైన రస మొక్కటే యని చెప్పుటకు సందేహింపఁ బని లేదు. ఆలంకారికులు పలువురు దీని నంగీకరించి యుండిరి. దానికి రసమని యొక్కటే పేరు. బ్రహ్మము వలె నది యేకైకము. అద్వితీయము. అందుచే శృంగార వీరాద్భుతాది నామములను వాని వైవిధ్యమును యదార్థములు కావు, అవి యేకమైన యంగిరసము యొక్క వివిధ భాగములు. అందుచేతనే భరతుఁడు "నహి రసాదృతే కశ్చి దర్థః ప్రవర్తతే" యను సూత్రమున రసశబ్దమునేకవచనముగా నుపయోగించెనని యభినవగుప్తుఁడు చెప్పుచున్నాడు. "ఏక ఏవ తావత్పరమార్థతో రసః సూత్ర స్థానత్వేన రూపకే ప్రతిభాతి తస్యైవ పునర్భాగదృశా విభాగః". అనుభవమునఁ గూడఁ జిత్త విశ్రాంతి రూపమును ననిర్వచనీయమును నగు రసాస్వాద మన్ని రసముల విషయమునను సమానముగానే గోచరించుచున్నది. భోజుని సరస్వతీ కంఠాభరణమునకు వ్యాఖ్యానము చేయుచు భట్ట నరసింహుఁడు సర్వ రసములకును గూటస్థమైన స్వాదాత్మ యొక్కటే యనియు రసము లన్నియు దద్విశేషములనియు నుడివి యుండెను. ఈ సిద్ధాంతము నభినవగుప్తుఁడు సూచింపకపోయినను ఇది యాతనికి విరుద్ధముమాత్రముకాదు.

కవికర్ణపూరగోస్వామి యలంకార కౌస్తుభమున నీ విషయమునే చక్కఁగా నిరూపించి యుండెను. "రజస్తమో హీనమై శుద్ధ సత్త్వ స్వరూపమగు మనస్సున కాస్వాదాంకుర కంద మను ధర్మము కలదు. ఆ యానందమే యేకైక

మగు రసమునకు స్థాయి యని విజ్ఞులు చెప్పుదురు. అదియే విభావ వైవిధ్యము వలనఁ బృథగ్విధత్వమును బొందుచున్న" దని నుడివి యుండెను. స్థాయి రూపమైన యా ధర్మ మొక్కటేయైనచో నొకటే స్థాయికి వీర రసమున నుత్సాహత్వమును గరుణ రసమున శోకత్వమును, నద్భుత రసమున విస్మయత్వమును, నెట్లు కలుగఁ జాలునను ప్రశ్నమునకు వ్యాఖ్యానమున నిట్లు సమాధాన మొసఁగఁబడినది. "ఆ ధర్మ మొక్కటేయైనను వివిధమైన విభావములయొక్క భేదములచే భిన్నమై కానవచ్చుచున్నది. ఒకే స్ఫటికము జపాకుసుమాది నానా పదార్థముల సంగము వలన నొకప్పుడు రక్తమగును. నొకప్పుడు పీతముగను, నొకప్పుడు శ్యామమునునై వివిధాకారముల నొందునట్లే స్థాయి రూపమైన యొకే ధర్మము వీర రసాది పోషకములైన నానా విధ భావముల సంగము వలన నొకప్పు డుత్సాహ రూపమును నొకప్పుడు విస్మయరూపమును నొకప్పుడు శోకరూపమును బొందుచున్నది.

శృంగారాది రసములు నామ భేదముచే వేర్వేఱుగాఁ గనఁబడినను వాని వలన మానవులు పొందు నానంద మేక విధమైనట్టిదే. రసము కూడ నొక్కటే దానికి స్థాయి యానందము. రత్యాదులైన యుపాధుల భేదముచే దానికి నానాత్వము కలుగు చున్నది. పలువిధములైన పాత్రలయందుండు జలమున భేద మున్నను వాని యందుఁ బ్రతిఫలించు సూర్యుని ప్రతిబింబ మొక్కటే. అట్లే రత్యాదులందుఁ దారతమ్య మున్నను ఆనంద మొక్కటే. భేదము కేవల ముపాధిగతమైనదే.

## 6. రసాభాసాదులు :—

రసాభాసము : అనౌచిత్యము ప్రవర్తిల్లినచో రస భావముల కాభాసత్వము కలుగు నని చెప్పుదురు. లోక మర్యాద నతిక్రమించి వర్తించుటయే అనౌచిత్యము. జగన్నాథుఁ డనుచితమైన విభావము నాలంబనముగాఁ గలిగియుండుట రసాభాస మని నుడివి యుండెను. అనఁగా ననుచితమైన విభావములందు రత్యాదులు కలుగుట రసాభాస మని యతని యభిప్రాయము.

శృంగార రసాభాసము : అనురాగము నాయకా నాయికలలో నొకరికే యుండుట. అది (తిర్యక్) పశుపక్షి మ్లేచ్ఛగతమై యుండుట. స్త్రీకిఁ బలు పురు

నాయకులం దాసక్తి యుండుట- అని శృంగార రసాభాసము మూఁడు రకములుగా నుండునని ప్రతాపరుద్రీయమునఁ జెప్పఁబడినది. సాహిత్యదర్పణకారుఁ డుప నాయక సంస్థమును, ముని గురుపత్నీగతమును, బహునాయక విషయమును, అనుభయ నిష్ఠమును, ప్రతినాయక నిష్ఠమును, అధమపాత్ర తిర్యగాది గతమును నైన శృంగార మనౌచిత్యవంత మగుటచే నాభాస మగు నని చెప్పియున్నాఁడు. మ్లేచ్ఛాదు లుత్తమ ప్రకృతులు కాకపోవుటచేఁ దద్గత మైన శృంగారము ధర్మ విరుద్ధమౌట కవకాశము కలదు. అందుచే నది ఆభాసముగాఁ బరిగణింపఁ బడినది. తిర్యగ్గత మైన శృంగార ముభయ నిష్ఠమయ్యుఁ గొండొకచో నౌచిత్య శోభితము కాక పోవచ్చును. అందుచే నిదియు రసాభాసముగా నెన్నఁబడినను గొంద ఱాలంకారికులును మహాకవులును దాని నంగీకరించి యుండిరి. విద్యా ధరుఁడు ఏకావళి యందు పాత్రలకు విభావాది జ్ఞానము కాని కళాకౌశలము కాని యక్కఱ లేదనియు తద్రాహిత్యముచే తిర్యగ్గతిని రసాభాసముగా గణించుట యుక్తము కాదని వచించి యది రసమే యని సిద్ధాంతీకరించెను. మనుచరిత్ర యందలి వరూధినీ ప్రవరుల శృంగార మనుభయ నిష్ఠ మగుటచేతను, తారా శశాంకము నందలి శృంగారము గురుపత్నీగత మగుటచేతను, అహల్యాసం క్రందన మందలి శృంగారము మునిపత్నీగత మగుటచేతను రసాభాసత్వమును బొందుచున్నవి. ఇట్లే వేశ్యాకులటల శృంగారము బహునాయక విషయమై యుండును గావున రసాభాస మగును.

ద్రౌపదికి పాండవు లైదుగురి యందుఁ గల యనురాగము బహునాయక గతమని చెప్పుటకు వీలున్నది. అయ్యు వారైదుగురు నామెను బెండ్లియాడిన వారే కాని యుపపతులు కారు. మఱియు నామె వారిలో నొక్కొక్కరితో నొక్కొక్క యేఁడు కాపురము చేసెను గాని యేక కాలముననే వారందఱితోఁ గాపురము చేసి యుండలేదు. అందుచే నామె రతి రసమే కాని రసాభాసము కాదు. ఒక్కొక్కప్పుడు నాయికా నాయకులలో నొకరు మఱియొకరి గుణ రూపాలను జూచియో వినియో రతి వహింతురు. తరువాతఁ గొంత కాలమునకుఁ గాని యా రతి యుభయ నిష్ఠము కాకపోవచ్చును. అట్టియెడ నది యేకతర నిష్ఠమై యుండునంత దనుక రసాభాసమే యనియు నుభయనిష్ఠమైన పిమ్మట రస మగుననియు లోచనాకారుని మతమని సాహిత్యదర్పణము చెప్పుచున్నది.

"తిర్యగాది" పదము నందలి ఆది పదముచే తాపసాదులు సూచింపఁబడుచున్నారు. పూజ్యులైన తాపసులయు నుత్తమ దేవతలయు మాతాపితురులయు రతిని వర్ణించుట యత్యంతా నౌచిత్యమున కాకర మగుటచే రసాభాసమే యని మమ్మటుని యభిప్రాయము.

స్త్రీకి బహునాయక రతి యుండుట వలననే పురుషునికి బహునాయికా రతి యుండుటయు రసాభాసమే యని కొందఱి మతము దీనినిబట్టి దక్షిణ నాయకానురాగము రసాభాసమే యని చెప్పవలసి వచ్చును. అది సరికాదనియు. "తుల్యోఽనేకత్ర దక్షిణః" అను లక్షణ మందలి తుల్యత్వ మనువృత్తియందే కాని యనురాగమందుఁగాదనియు కుమారస్వామి సోమయాజి చెప్పుచున్నాఁడు. అందుచే శ్రీకృష్ణాది దక్షిణ నాయకుల యనురాగము బహునాయికా గతమయ్యు రసమే కాని రసాభాసము కాదు. స్త్రీకి బహునాయకులందుఁ గల్గు రతియే రసాభాసము.

శృంగారము సంభోగ విప్రలంభ భేదములచే రెండు విధములు. ఈ రెండు విధములందు నాభాస ముండవచ్చును. నాయకుఁడు పరకీయను గలయుట సంభోగాభాసము, అనురాగ మేకత్ర నిష్ఠమై యున్నప్పుడు నాయకుఁడు గాని నాయిక గాని పొందు విప్రలంభము విప్రలంభాభాసము.

<u>భావాభాసము</u> : అనౌచిత్యమునఁ బ్రవర్తిల్లు రసము రసాభాస మైనట్లే భావము భావాభాస మగును. నాయకుఁడు పరకీయా విషయమునను, నాయిక యుపపతి విషయమునను, నాయికానాయకులలో నొకరు తన్ను ప్రేమింపని మఱొకరి విషయమునను పొందు సంచారీభావము లెల్ల భావాభాసములే.

<u>హాస్యాభాసము</u> : మునులు, గురువులు, తల్లిదండ్రులు మున్నగువారు పరమ పూజ్యులు. హాసమట్టి వారి నాలంబనముగాఁ జేసికొని ప్రవర్తిల్లుచో ననౌచిత్యమున కాకరమై హాస్యాభాస మగును.

<u>కరుణాభాసము</u> : ధీరోద్ధత నాయకులు పరిస్థితుల ననుసరించి తమ శత్రువుల సంహరింతురు. అట్లు సంహరింపఁ బడిన వారిని గూర్చి వారు శోకించుటలో నౌచిత్యము లేదు. ఆ శోకము కరుణ రసాభాస మనఁబడును.

రౌద్రాభాసము : లోకమునఁ గోపమునకు విషయములు కాఁదగిన వారు కొందఱుందురు. అట్టి వారిపైఁ గోపము ప్రదర్శించుట సహజమే. అట్లుకాక పూజ్యులైన గురు పితృాచార్యాదుల పై ప్రదర్శింపఁబడు కోప మనౌచిత్య హేతువగుటచే రౌద్రాభాస మనఁ బడును.

వీరాభాసము : సద సద్వ్యాపారములు రెండింటి యందును మానవు లుత్సాహము ప్రదర్శింప వచ్చును. లోక రక్షణాదు లందుఁ జూపఁబడు నుత్సాహ మౌచిత్యవంత మై వీరరస మగును. అట్లు గాక బ్రహ్మహత్యాదు లందుఁ జూపఁబడు నుత్సాహమును, అథమ పాత్ర నిష్ఠమైన యుత్సాహమును వీరాభాసము లగును.

భయానకాభాసము : ఉత్తమ పాత్ర లెప్పుడును భయమును ప్రదర్శింపరు. దానికి స్త్రీలును నీచ పాత్రలును ఆలంబనములు కాఁ దగుదురు. అట్లుగాక భయ ముత్తమ పాత్ర గతమై వర్తిల్లినచో భయానకాభాస మగును.

బీభత్సాభాసము : బీభత్సమునకు స్థాయి భావము జుగుప్స. హేయ వస్తువులను జూచు నప్పు డది కలుగుట సహజము. అట్లుగాక సుందర వస్తువుల యెడఁ గూడ జుగుప్స వర్తిల్లుచో నది బీభత్సాభాస మగును.

అద్భుతాభాసము : లోకోత్తర వస్తు సన్నివేశములను జూచి నప్పుడు కాక సర్వ సామాన్యములైన వానిని జూచు నప్పుడు కల్గు విస్మయ మద్భుతాభాస మగును.

శాంతాభాసము : శాంత ముత్తమ నాయక నిష్ఠము కాక హీన నిష్ఠ మగుచో శాంతాభాస మగును.

భావోదయము : భావోదయ మనఁగా భావము యొక్క పుట్టుక. నిర్వికార మైన చిత్తమునఁ గలుగు ప్రథమ వికారము భావము నాయికా నాయకులకు వివిధ పరిస్థితులలో వివిధ భావము లుదయించును. ఆ భావముల ఉత్పత్తియే భావోదయము.

భావశాంతి : పుట్టిన భావము లడంగుటకు భావశాంతి యని పేరు. మానము, ఈర్ష్య, సుప్తి, ఆలస్యము, మోహము, ఔత్సుక్యము, త్రాసము, ధృతి

మున్నగు భావములు నాయికా నాయకుల మనస్సు లందుఁ గలిగియుఁ దరువాత శాంతి పొందుట భావశాంతి యనఁబడును. నాయికకుఁ బ్రణయ వ్యాపారమున నొకప్పుడు కోపము గలుగ వచ్చును. నాయక ప్రార్థనచేఁ గాని నాయక ప్రేషిత దూతీ ప్రార్థనలచేఁ గాని యది యడంగుట భావశాంతి కుదాహరణము.

భావసంధి : రెండు భావముల కలయికకు భావసంధి యని పేరు. ఈ రెండును ఉపమర్ద్యోపమర్దక భావముతో నుండి యొకరికే కలుగ వలయును. ఇవి పరస్పర విరుద్ధము లైనప్పుడే ఉప మర్ద్యోప మర్దక భావము కలిగి యుండును. ఉదా : నరకాసురునితో యుద్ధము చేయు నప్పుడు సత్యభామకు, గృష్ణునిఁ జూచు నప్పుడు హర్షమును నరకాసురునిఁ జూచు నప్పుడు కోపమును గలుగుచుండెను. ఇట హర్షకోపములకు సంధి. ఈ రెండును బరస్పర విరుదములు హరము కోపముచే నుపమర్ద్య మగుచున్నది.

భావ శబలత : భావ శబలత యనఁగా భావవైవిధ్యము. ఒకరి హృదయ ముననే వివిధ భావము లుదయించుటకు భావశబలత యని పేరు. ఇచ్చట నీ భావముల కుప మర్ద్యోపమర్దక భావము నియమితముగా నుండ నవసరము లేదు. నరసభూపాలీయమున నీ క్రింది పద్యము భావశబలత కుదాహరణముగా నొసంగఁ బడినది.

చెలు లేమందురొ భావవీథి, సకటా! శ్రీ నారసింహేంద్రు కౌఁ
గిలి నాకెన్నఁడు కల్గునో, నృపతితోఁ గ్రీడింపఁగా బోవు చం
చలపుం జిత్తము నేమిసేయుదు, గురున్ సద్భక్తిఁ బ్రార్థింతునో,
యల ప్రాణేశ్వరుఁ జూడకున్నఁ బరితాపాటోపముల్ మానునే.

ఇందు నాయిక హృదయమున శంక, ఉత్కంఠ, దైన్యము, మతి. వితర్కము అను పలు భావముల శబలత (వైవిధ్యము-మేళనము) కనవచ్చు చున్నది.

రసభావ రసాభాస భావాభాసాదులు ప్రధానములుగాక యంగములుగా వర్ణింపఁ బడుచో రసవదా ద్యలంకారము లగును. ఒక భావమునకుఁగాని రసము

నకుఁ గాని మఱొక రసమంగ మగుచో రస వదలంకారము. మఱొక భావ మంగమగుచో ప్రేయోఽలంకారము. ఒక భావమునకు రసాభాసము కాని భావా భాసము కాని యంగము లగుచో ఊర్జస్వ దలంకారము రసమునకు భావశాంతి యంగముగా నుండుచో సమాహితాలంకారము ఈ రసవదా ద్యలంకారములు గుణీభూత వ్యంగ్య భేదమగు నపరాంగములోఁ జేరును.

రససంకరము : రస సంకర మనఁగాఁ బలురసముల కలయిక. పలురస ముల కూడిక యొక్కచో వర్ణింపఁ బడుచో నది రససంకర మనఁబడును.

## 7. రసములెన్ని (శాంతము రసమగునా?)

భరతుని నాట్యశాస్త్రమున రసములను స్థాయి భావములను బేర్కొను శ్లోకములు రెండున్నవి. అవి యన్ని ప్రతులలో సమానముగా నుండక రెండు విధములైన పాఠభేదములతోఁ గనవచ్చుచున్నవి. అందొక పాఠ మిట్లున్నది.

శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభ త్సాద్భుత సంజ్ఞా చే త్యష్టౌ నాట్యే రసాః స్మృతాః
రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః

ఈ శ్లోకములలో నెనిమిది రసములును ఎనిమిది స్థాయిభావములును బేర్కొనఁ బడినవి. ఈ క్రిందిది రెండవ పాఠము.

శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభ త్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః
రతి ర్హాసశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శమాః స్థాయి భావాః ప్రకీర్తితాః

ఇందు తొమ్మిది రసములును తొమ్మిది స్థాయి భావములును జెప్పఁబడినవి మొదటి పాఠమున లేని శాంత రసమును శమ స్థాయిభావమును రెండవ పాఠమున నుండుటయే యీ రెండు పాఠములకును గల భేదము. దీని వలన రసము లెనిమిదియా తొమ్మిదియా. శాంతము రసమగునా కాదా యను ప్రశ్న లుదయించినవి.

వాసుకి యను నతఁడు శాంత రసమును స్థాపించెనని కొందరును కోహలుఁడు దానిని స్థిరపఱిచెనని కొందఱును చెప్పుచున్నారు. కాని వారి ప్రమాణ వాక్యములిప్పు డుపలభ్యమానము లగుటలేదు. కాఁగా రసములలో శాంతమును గూడఁ గలిపి నవరస సిద్ధాంతమును మొదట వెల్వరించిన వాఁ డుద్భటుఁ డని చెప్పవచ్చును. (1) ఇతఁడు తన కావ్యాలంకారసారసంగ్రహమున తొమ్మిది రసములను పేర్కొని తదనుగుణముగాఁ దొమ్మిది స్థాయిభావములను సూచించి యుండెను. ఇతఁడు భరతుని నాట్యశాస్త్రమున కొక వ్యాఖ్యానము రచించి నట్లును. తొమ్మిది రసములను దొమ్మిది స్థాయిభావములను బేర్కొను శ్లోకముల నితఁడే నాట్యశాస్త్రమునఁ జొప్పించి నట్లును జెప్పుదురు. ఇతఁడు రచించిన నాట్యశాస్త్ర వ్యాఖ్యాన మిప్పుడు లభించుటలేదు.

శాంతము రసము కాదను వా రిట్లు వాదింతురు. భరతుఁడు శాంతమును రసములలోఁ జేర్పక "అష్టౌ నాట్యే రసాః స్మృతాః" అని చెప్పి యుండెను. మఱియు నతఁడు స్వర లయ గుణాలంకార వృత్తి వృత్తముల నెనిమిది రసములకే నిరూపించెను గాని శాంతమునకు నిరూపించి యుండలేదు. (2) ఆనందవర్ధనుఁడు ధ్వన్యాలోకమున శాంతరస చర్చ కావించుచు స్వోపజ్ఞములైన యుక్తులనే ప్రకటించెను గాని తన వాదమునకుఁ బోషకముగా భరతుని ప్రమాణము నుద్ధరించి యుండలేదు. నిజముగా భరతుఁడు శాంతమును గూడ రసములలోఁ జేర్చి యుండినచో నాతఁడు తద్వాక్యములను బ్రమాణముగా నేల యుద్ధరింప కుండును? (3) దశరూపక కర్తయైన ధనంజయుఁడు "శాంతమును రసముగాఁ గొందఱు పేర్కొనిరి. కాని దానికి నాట్యములందుఁ బుష్టి లే" దని చెప్పి యుండెను. శ్రవ్య కావ్యములలో దానిని బోషింప వచ్చునా అను విషయమున నాతఁ డేమియుఁ జెప్పియుండలేదు. (4) దశ రూపకమునకు వ్యాఖ్యానము రచించిన ధనికుఁడు "అనాది కాల ప్రవాహాయాతములైన రాగద్వేషములను భేదించుట శక్యము కాక పోవుటచే శాంతరస మనున దిలేదను పరమతమును సూచించెను. (5) రస మనుకర్తయైన నటుఁడే అనుభవించు నని భావించువారు "శాంతము శమ సాధ్య మగుట చేతను, నటుని యందది అసంభవ మగుట చేతను నాట్యమున రసము లెనిమిదే. అందు శాంతము యుక్తముకా" దని చెప్పియుండిరి. (6) ఇప్పటి కొన్ని నాట్య శాస్త్రపు ప్రతులందు వలెనే అభినవగుప్తుని నాఁటి ప్రతులందును

శాంతరస ప్రసక్తి లేదని అతని వాక్యముల వలనఁ దెలియుచున్నది. (7) కొందఱు శాంతము ప్రత్యేక రసము కాదనియు నది దయావీరము నందో బీభత్సాదులయందో అంతర్భవించు ననియు నభిప్రాయ పడియున్నారు. పైవాదమును బట్టి శాంతము రసము కాదనియు నెనిమిదే రసము లనియుఁ దేలుచున్నది.

ఆనందవర్ధనుఁడు, అభినవగుప్తుఁడు మున్నగు వారు పై హేతువులను ఖండించి శాంతముకూడ రసమే యని నిరూపించి నవరస సిద్ధాంతమును స్థాపించి యున్నారు. (1) భరతుఁడు నాట్యశాస్త్రమున శాంతముకూడ రసమే యని ప్రత్యక్షముగాఁ జెప్పియుండకపోయినను పరోక్షముగా నాయా సందర్భములందు దానిని గూడ సమ్మతించియే యున్నాడు. "నాట్యము దుఃఖార్తులకు, శ్రమార్తులకు, శోకార్తులకు తపస్వులకు క్రమముగా ధర్మమును వినోదమును అర్థమును శమమును గలిగించు వినోదమును జేకూర్చు ననియు, *యువకులు కామమందును, అర్థపరు లర్థమందును, విరాగులు మోక్షమందును తుష్టి నొందుదు రనియు, నానావస్థాంతరాత్మకమును, లోకవృత్తానుకరణమును అగునట్లుగా తనచే సంతరింపఁబడిన నాట్యమున సప్తద్వీపానుకరణము ప్రతిష్ఠింపఁ బడిన దనియు, నాట్యమునఁ గానఁ బడని జ్ఞానము కాని శిల్పము కాని విద్య కాని కళ కాని యోగము కాని కర్మ కాని లే" దనియు నాతఁడెడ నెడ నాట్య శాస్త్రమునఁ జెప్పిన వాక్యము లిందుకుఁ దార్కాణములు. విరాగులు మోక్షమునఁ దుష్టి నొందుదు రనగా శాంతరసాస్వాదముచే సంతసింతు రని యర్థము. శాంతరసము గూడఁ బోషింపనిచో నాట్యము నానా భావోపసంపన్నమును త్రైలోక్యానుకరణమును ఎట్లు కాఁజాలును? నాట్యమునందు లేని దేదియు లేదన్నప్పు డందు శాంతము మాత్రమేల లేకుండును? మఱియు 'క్వచిచ్ఛమః' అని చెప్పుటచే భరతముని శాంతమునుగూడ నంగీకరించియే యున్నాఁడు. అందుచే భరతుఁడు నాట్యశాస్త్రమున రస సంఖ్యానము చేయు సందర్భమందు శాంతమును జెప్పియుండలేదను వాదము యుక్తియుక్తము కాదు. మఱియు భరతుఁడు నాట్యశాస్త్రమున వికృతి రసములనే పేర్కొనఁదలచె ననియు సర్వోత్కృష్టమును ప్రకృతి రసమునునైన శాంతము నుక్తప్రాయముగా భావించి

---

* క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచి దర్థః క్వచి చ్ఛమః దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్ విశ్రాంతి జననం కాలే నాట్య మేత ద్భవిష్యతి.

వేఱుగాఁ జెప్పఁ దయ్యె ననియుఁ గొందఱు భావింతురు. అదిగాక అభినవగు ప్తుడు ప్రాక్తనములైన నాట్యశాస్త్రగ్రంథములందు మొట్టమొదట శాంతరసప్రసంగము కావించిన పిమ్మటనే భరతముని శృంగారాద్యన్య రస ప్రసంగము కావించినట్లు కనఁబడుచున్నదని స్పష్టముగాఁ జెప్పి యున్నాఁడు. *(2) ఆనందవర్ధనుఁడు శాంతరస స్థాపన సందర్భమున భరతముని వాక్యముల నుద్ధరింపక పోయినను అతని ననుసరించియే ఆ రసము స్థితిని నిరూపించి యుండెను. అతఁడు భరతుని శ్లోకముల నుద్ధరింప నంత మాత్రమున భరతుఁడు శాంతరసము నంగీకరింప లేదని నిశ్చయింపరాదు. (3) ధనంజయుఁడు దశరూపకమున నాట్యములందు శాంతమునకుఁ బుష్టి లేదని చెప్పిన సందర్భమున వ్యాఖ్యాత "శాంత మనభినేయ మగుటచే దానికి నాట్యమునఁ బ్రవేశము లేకపోయినను సర్వసూక్ష్మాతీత వస్తువు లను శబ్దముచేఁ బ్రతిపాదింప నవకాశ మున్నది కావున దానికిఁ గావ్య విషయత్వము నివారింపఁ బడుటలే" దని చెప్పి శ్రవ్యకావ్యములలో శాంతమును బోషింప వచ్చునని యంగీకరించెను. అతఁడు ద్వంద్వాతీతమైన దశయే శాంత మనియు, అది మోక్షావస్థ యందే కలుగుననియు, దానిని నిర్వహించుట అసాధ్య మనియు, దానికి సంచార్యాదులు లేవనియు, ననిర్వచనీయమైన దాని ననుభవించు సహృదయు లుండ రనియు భావించి నప్పటికిని అది సంతుష్టి దయా మైత్రీ రూపమున నెల్లరచే నాస్వాదింపఁబడు ననియుఁ దదాస్వాద సమయమున నితర రసముల నాస్వాదించు నప్పుడు వలెనే చిత్తద్రుతి వికాస విస్తారములు కలుగు ననియుఁ జెప్పియుండెను. సాహిత్యదర్పణమున విశ్వనాథుఁడు యుక్తవియుక్త దశావస్థితమైన శమము రసత్వమును బొందు ననియు దానికి సంచార్యాదు లుండు టలో విప్రతిపత్తిలేదనియుఁ దెల్పి శాంతమును దృశ్యశ్రవ్యకావ్యమును రెండింటఁ బోషింపవచ్చు నని నిరూపించెను. (4) అనాది కాలము నుండి వచ్చుచున్న రాగ ద్వేషముల నుచ్ఛేదించుట అశక్య మగుటచే శాంత రసము లేనే లేదని ధనికుఁడు సూచించిన పర మతమును బరిశీలించి ఆనందవర్ధనుఁడు "కామాదులందు సము చితములైన రత్యాది చిత్తవృత్తులు కవినట వ్యాపారముచే సహృదయు లైన సమాజికులందు శృంగారాది రసములుగా నాస్వాద్య మానము లగునట్లే మోక్ష

---

* తథాచ చిరంతన పుస్తకేషు స్థాయి భావాన్ రసత్వ ముపనేష్యామః
ఇత్య నంతరం శాంతోనామ శమస్థాయి భావాత్మకః ఇతి లక్షణం పఠ్యతే.

పురుషార్థోచితమైన చిత్తవృత్తి సైత మర్హులైన సహృదయములందు రసత్వము నేల పొందరా" దని తెల్పి రాగద్వేషాదిద్వంద్వ రహితులైన వీతరాగులు కొంచ ఱుందు రనియు, స్వల్ప సంఖ్యాకులైనను అట్టివారు శాంత రసము నాస్వాదింపఁ జాలుదు రనియు నిరూపించెను. (5) శమము నటులం దసంభవమగుటచే శాంత రసమునకుఁదావులేదను వాదము సమంజసముకాదు. ఏలయన రసము నటనిష్ఠము కానేకాదు. అది సామాజిక నిష్ఠము సహృదయులైన సామాజికునిలో శాంతచిత్తులైనవారు కొందఱైననుందురు. కావున వారు శాంతరసము ననుభవింతురనుటలో నాక్షేపములేదు. రసము నాస్వాదించువాఁడు నటుఁడుకాదు. కావున నాట్యమున నెవి మిదే రసము లనువాద మసంగతమని సంగీత రత్నాకరముకూడఁ జెప్పుచున్నది. (6) దయావీరము వీర రస భేదములలో నొకటి దీనికి స్థాయిభావ ముత్సాహము. శాంతమునకు స్థాయిభావము శమము. ఉత్సాహ మహంకారరూపము; శమమహంకార ప్రశమన రూపము అందుచే శమస్థాయికమైన శాంత ముత్సాహ స్థాయికమైన వీరమున నంతర్భవించుట కవకాశములేదు. అహంకారరహితములు కాఁగల్గుచో దయావీరాదులే యొకప్పుడు శాంతమున నంతర్భవింప వచ్చును. శాంతము వీర బీభత్సాదులం దుద్భవించునని కొందఱు చెప్పుచున్నట్లు దశరూప కావలోకము పేర్కొనుచున్నది. ఇదియు సంగతము కాదు. ఏలయన బీభత్సమునకు స్థాయి భావమైన జుగుప్స రౌద్రకరుణ వీర భయా కాద్భుతముల కౌగ్ర? నిర్వేదధృతి త్రాస హర్షాములవలె శాంతమునకు వ్యభిచారి భావము కాఁగల్గునే కాని స్థాయి భావము కాఁజాలదు. అందుచే జుగుప్స శాంతమునకు స్థాయి యనియు. శుద్ధబీభత్సము మోక్షసాధనమని చెప్పుటయు సమంజసముకాదు. ఈ విధముగా ఆనందవర్ధనాభినవగుప్తాదు లష్టరసవాదమును ఖండించి రసములుతొమ్మిదియనినిరూపించిరి.

కొందఱు శాంతమును నవమరసముగా నంగీకరించియు దానిని పాక్షికముగా మాత్రమే గ్రహించిరి. ధనికుఁడు శాంతమును శ్రవ్య కావ్యములలో మాత్రము పోషింపవచ్చునని భావించెను ధ్వన్యాలోక వ్యాఖ్యానములలో నొకటగుచంద్రికలోఁ దత్కర్త శాంతమును కావ్యములలో నంగి రసముగాఁ గాక అంగ రసముగా మాత్రమే పోషింపవలెనని సిద్ధాంతీకరించి నాగానందమున శాంత మంగరసము గానే నిర్వహింపఁబడినదని తెల్పెను. సంగీతసుధాకరకర్త అగు హరిపాలుఁడు శాంతమును శాంతరసము బ్రహ్మరసము అని రెండుగా విభజించి యా రెంటింటికిని క్రమముగా నిర్వేదానందములు స్థాయి భావములని తెల్పెను.

శాంతరసమనిత్య మనియు మోక్షము నొసంగఁ జాలదనియు బ్రహ్మరసము నిత్యమనియు మోక్షము నొసంగఁ జాలుననియు నతఁ డభిప్రాయపడెను. ఈ విధముగా వీరు శాంతమును పాక్షికముగా గ్రహించిన వారైనను నవరస సిద్ధాంతము నంగీకరించిన వారే. బౌద్ధ జైన కవులు క్రీ. శ. ౪, ౫ శతాబ్దులకుఁ బూర్వమే శాంతరస ప్రధానములైన కావ్యములు రచించి యుండిరి.

శాంతరసమునకు స్థాయి యేదను విషయమునఁగూడ నభిప్రాయభేదము లున్నవి. కొందఱు శాంతమునకు స్థాయి భావము శమ మనియుఁ గొందఱు సర్వచిత్తవృత్తి ప్రశమ మనియుఁ, గొందఱు నిర్విశేష చిత్తవృత్తి యనియు' గొందఱు నిర్వేదమనియుఁ గొంద ఱుత్సాహ మనియు, గొందఱు జుగుప్స యనియుఁ, గొంద రాత్మరతి యనియు నుడివి యుండిరి. రుద్రటుఁడు శాంతమునకు సమ్యగ్జ్ఞానము స్థాయి యనెను. ఆనందవర్ధనుఁడు దానికి తృష్ణాక్షయ సుఖము స్థాయియని నుడివెను. భోజుఁడు ధృతి(నిత్యసంతుష్టి) యని సూచించెను. కొందఱు శాంతమునకు రత్యాదులలో నేదో యొకటి కాని రత్యాదు లన్నియుఁ గలసి కాని స్థాయి భావము కావచ్చునని అభిప్రాయపడిరి. అభినవగుప్తుఁడీ అభిప్రాయమును ఖండించి శాంతమునకు తత్త్వజ్ఞానము (ఆత్మజ్ఞానము) స్థాయి యని నిర్ణయించి అది వట్టి స్థాయి కాక తక్కిన స్థాయిభావము లన్నింటికి మూలభూతమగుటచే స్థాయి తమమని సూచించెను. కాని చిరంతన నాట్యశాస్త్ర గ్రంథములలో శాంతము శమ స్థాయిభావాత్మక మని యున్నదని యాతఁడు చెప్పియుండుటచే శమమును గూడ స్థాయిగా నంగీకరించె ననియే చెప్పవచ్చును. ఆత్మజ్ఞానమున శమ మంతర్గతమై యుండుటచే నిట్లు చెప్పుటలో విప్రతిపత్తి లేదు. పలువురు లాక్షణికులు శాంతమునకు శమమే స్థాయిభావముగా నిర్ణయించియున్నారు.

రస సంఖ్యను తొమ్మిది కధికముగా నిర్ణయించిన వారును-గలరు. రుద్రటుఁడు స్నేహ స్థాయికమైన ప్రేమరసమును పదవ రసముగాఁ బేర్కొనుటయే కాక నిర్వేదాదులు కూడ విభావాది సంయోగమున సమ్యక్పరిపుష్టములై రసత్వమును బొందునవి అభిప్రాయపడెను. లోకరూఢి ననుసరించి భరతాదులు తొమ్మిది రసములనే పేర్కొన్నను నిజమునకు రసము లనంతము లని చెప్పిన భట్టలోల్లటుని మతమే రుద్రటుని అభిప్రాయమునకు మూలము. ఈ యభిప్రాయ మభినవగుప్తునకు సమ్మతము కాదు.

ఆ యా రసములందు వర్ణముల నెట్లుచ్చరింప వలయునో చెప్పు సందర్భమున భరతుఁడు వాత్సల్యమును గూడ నొక్కచోఁ బేర్కొని యుండుటచే విశ్వనాథుఁడు దానినిగూడ రసాంతరముగాఁ బేర్కొని ప్రేమయుక్తమగు రతి దానికి స్థాయి భావమని తెల్పెను. జగన్నాథుఁడు వాత్సల్యము భావమే కాని రసము కాదని నిర్ణయించెను. కొందఱు మృగయ, ద్యూతము, శ్రద్ధ, ప్రీతి, స్నేహము, లౌల్యము, దుఃఖము, సుఖము, ఉద్ధతము, కార్పణ్యము మున్నగు వానిని గూడ రసములుగాఁ బరిగణించిరి. అభినవగుప్తుఁడు ఇవి భావములే కాని రసములు కాదని అభిప్రాయపడెను.

ఉజ్జ్వలనీలమణికర్తయగు రూపగోస్వామియు భక్తిరసాయనకారుఁ డగు మధుసూదనసరస్వతియు భక్తినిగూడ రసముగాఁ బేర్కొనిరి. రూపగోస్వామి చిత్తద్రవమును, మధుసూదన సరస్వతి భగవదాకార చిత్తవృత్తియు దానికి స్థాయి భావములని నుడివిరి. ధనంజయుఁడు, మమ్మటుఁడు, జగన్నాథుఁడు మున్నగువారు భక్తిభావమే కాని రసము కాదని తలంచిరి రసములకును భావములకును రంజన విషయమున భేద మున్నది. రత్యాదులగు స్థాయి భావములు విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావ సంపర్గముచేఁ బరిపుష్టములై రసత్వము నొందును. నిర్వేదాదులగు భావము లట్లు రసత్వమును బొందఁ జాలవు. అందుచేతనే భరతుఁ డెనిమిదో తొమ్మిదో మాత్రము రసములని తెల్పియుండెను. రుద్రటుఁడు నిర్వేదాదులు కూడ నాస్వాద్యము లగుటచే రసములే యని భావించెను. కాని అన్యు లా భావము నంగీకరింపలేదు.

భానుదత్తుఁడు రసతరంగిణిలో మాయారసమును వేఱుగాఁ బేర్కొని దానికి మిథ్యాజ్ఞానము స్థాయిభావమని తెలిపెను. మందార మరంద చంపున ఈ అభిప్రాయమును బలపరిచెను. కావ్య విలాసకర్త మిథ్యాజ్ఞానము మాయకుఁ గారణ మనుట శాస్త్ర విరుద్ధ మనియు, నశ్వరము తుచ్ఛము నగు మాయ నిత్యము బ్రహ్మానంద స్వరూపము నగు రసముకాఁ జాలదనియుఁ మాయకు రసత్వము నిరాకరించెను.

ఈ విధముగా రసము లెనిమిది యని కొందఱు, తొమ్మిది యని కొందఱు పది యని కొందఱు, అనంతములని కొందఱు అభిప్రాయపడి యుండిరి. రస మొక్కటే యని చెప్పినవారు కూడఁ గొందఱు గలరు. రస సమీకరణ మను వ్యాసమున ఈ విషయము చర్చింపఁబడినది. ఈ విధముగా రసములెన్ని యను విషయమున భిన్నమతము లున్నను నవరస సిద్ధాంతమునకే లోకమున నెక్కువ ప్రాచుర్య మున్నది.

---

[illegible]

# 4. ధ్వనిసోపానము

## వృత్తులు : వాచ్య లక్ష్య వ్యంగ్యార్థములు :

నామవిభక్తులతోఁ గాని క్రియావిభక్తులతోఁ గాని కూడిన అర్థవంతమైయుండు నక్షర సమూహమునకు పదమని పేరు. పదములకును వాని యర్థములకును గల సంబంధము శక్తి యని నైయాయికులు నిర్వచించి యుండిరి. (పద పదార్థ సంబంధ శ్శక్తిః) ఈ శక్తినే కొందఱు వృత్తి యనియుఁ గొందఱు వ్యాపార మనియుఁ బేర్కొని యుండిరి. వృత్తులు శబ్దమును అర్థమును ఆశ్రయించి రెండు విధములుగా నుండును. వానికి క్రమముగా శబ్ద వృత్తులు అర్థవృత్తులు అని పేర్లు. ఇట నర్థమనగా రసమని యర్థము.

శబ్దవృత్తులు : అభిధ, లక్షణ, వ్యంజన అని శబ్దవృత్తులు మూఁడు విధములు. అభిధావృత్తిచే బోధింపఁబడు నర్థమునకు వాచ్యము, అభిధేయము లేక శక్యము అనియు, లక్షణావృత్తిచే బోధింపఁబడు నర్థమునకు లక్ష్య మనియు, వ్యంజనా వృత్తిచే బోధింపఁబడు నర్థమునకు వ్యంగ్య మనియుఁ బేర్లు. వాచ్యార్థమును బోధించు శబ్దము వాచకము లేక శక్తము. లక్ష్యార్థమును బోధించునది లక్షకము. వ్యంగ్యార్థమును బోధించునది వ్యంజకము. పైని పేర్కొనఁబడిన శబ్ద శక్తులు మూఁడేకాక తాత్పర్యశక్తి యను వాక్యశక్తి మఱొకటి కలదని మీమాంసకులలో నొకతెగ వారగు అభిహితాన్వయ వాదులు చెప్పుదురు. శబ్దశక్తులు పదముల యొక్క అర్థములను మాత్రమే బోధించు ననియు వాక్యమునందలి పదముల కన్నింటికి నన్వయము కలిపి దాని సంపూర్ణార్థమును బోధించుటకు వేఱొక శక్తి ఆవశ్యక మనియు, అదియే తాత్పర్య శక్తి యనియు వీరి అభిప్రాయము. వీరి మతము ననుసరించి పదముల అర్థము బోధపడిన తరువాత వాక్యార్థ మవగతమగును. మీమాంసలో అన్వితాభిధానవాదులను వేఱొక తెగవారు తాత్పర్య శక్తి అను నాలుగవ శక్తి నంగీకరింపలేదు. వీరి మతమున వాక్యార్థ మవగతమైన పిమ్మటనే పదముల అర్థము బోధపడును. అందుచే తాత్పర్య శక్తిని వేఱే చెప్ప నవసరము లేదని వీరి అభిప్రాయము. విద్యానాథుఁడు ప్రతాప

రుద్రీయమున "తాత్పర్యార్థము వ్యంగ్యార్థమే. అది వేఱుకాదు" అని చెప్పియుండెను. తత్ అనగా రసాది. తత్పరము లనఁగా రసాద్యాసక్తములగు విషయములు, వాని భావము తాత్పర్యము. మహాకవులు తమ కావ్యములలో కేవల పదార్థ తదన్వయములను మాత్రమే కాక వాక్యార్థమును అంతకంటె రమణీయతరమగు వ్యంగ్యార్థమును గూడఁ ప్రకటింతురు. దీనికే తాత్పర్యార్థమని పేరు. ఇదియును వ్యంగ్యార్థమును అభిన్నములు. భావ ప్రకాశకారుఁడు కూడ తాత్పర్యరూపముగా గమ్యమాన మగునదే ధ్వన్యర్థమని తెల్పియుండెను.

అభిధావృత్తి : శబ్దార్థములకుఁ గల పరస్పర సంబంధమును నిర్ణయించుటకు సంకేత మని పేరు. ఈ శబ్దమున కీయర్థ ముండవలె నను ఈశ్వరేచ్ఛయే సంకేత మని పూర్వులును లోకేచ్ఛయే సంకేతమని నవ్యులును అభిప్రాయపడియుండిరి. అట్లు సంకేతితమైన శబ్దార్థమును తెల్పు శక్తి అభిధ యనఁబడును. సంకేతితార్థ మనఁగా వాచక శబ్దమునకుఁ గల ముఖ్యార్థము. దీనినే వాచ్యార్థ మందురు ఇది వ్యాకరణము, ఉపమానము, ఆప్తవాక్యము, వ్యవహారము, వివరణము, అన్యపద సాన్నిధ్యము అను వానిచే నిర్ణయింపఁబడును.

సంకేతము యొక్క స్వరూప స్వభావములను బట్టి వాచక శబ్దము నాల్గు విధములు. ౧. జాతి వాచకము. ఉదా. గోవు ౨ గుణవాచకము ఉదా, శుక్లము నీలము. ౩ క్రియావాచకము ఉదా చదువుచున్నాఁడు. వండునది. ౪. ద్రవ్య వాచకము. ఇచ్చట ద్రవ్యమనఁగా పేరు. ఉదా. కృష్ణుఁడు రుక్మిణి. మనము నిఘంటువును జూచినచో కొన్ని శబ్దములకు పెక్కర్థము లున్నట్లు తెలియవచ్చును. అప్పుడు శబ్దమునకు పెక్కర్థములను బోధించుటకు పెక్కు అభిధాశక్తులుండునా అను సందేహము కలుగును అభిధాశక్తులు పెక్కుండవు. ఒక్కటే అభిధాశక్తి యుండును.. అది ఒక్కొక్క సందర్భమున ఒక్కొక్క అర్థమునే బోధించుచుండును సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధిత, అర్థము, ప్రకరణము, లింగము (గుర్తు) అన్యశబ్ద సాన్నిధ్యము, సామర్థ్యము, ఔచితి, దేశము, కాలము, వ్యక్తి (స్త్రీ పుం నపుంసక లింగములు) స్వరము, అభినయము మున్నగునవి అభిధాశక్తిని నియమించి అర్థమును నిర్ణయించుటకు సహకారులగుచుండును. ఉదాహరణమునకు రామకృష్ణులను సమాసమును బరిశీలింపుఁడు. రాముఁ

దనఁగా దశరథరాముఁడు, బలరాముఁడు, పరశురాముఁడు అను నర్థము లున్నవి. కాని యిచ్చట కృష్ణ శబ్ద సాహచర్యములచే రాముఁడనఁగా బలరాముఁడను నర్థమే స్ఫురించును. అట్లే రామలక్ష్మణులను నప్పుడు రామ శబ్దమునకు లక్ష్మణ శబ్ద సాహచర్యముచే దాశరధి అను నర్థమే స్ఫురించును. ఈ విధముగనే సంయోగ విప్రయోగాదులను బట్టి కూడ శబ్దముల అర్థమును నిర్ణయము చేయవచ్చును.

స్వరూప స్వభావములను బట్టి వలెనే అర్థబోధక స్వభావమును బట్టి కూడ వాచక శబ్దము. 1. యౌగికము, 2 రూఢము, 3. యోగరూఢము, 4. యౌగిక రూఢము. అవి నాలుగు విధములు. వ్యుత్పత్త్యర్థమును మాత్రమే తెల్పు శబ్దము యోగికము ఉదా. (కవయతీతి కవిః) వర్ణించువాఁడు కవి. వ్యుత్పత్త్యర్థముతో సంబంధము లేకుండ సముదాయార్థమునే బోధించు శబ్దము రూఢము. ఉదా. మేఘము, చెట్టు. వ్యుత్పత్త్యర్థముకంటె సముదాయార్థమునకే యెక్కువ ప్రాధాన్య మొసంగు శబ్దము యోగరూఢము. దీనికి యోగికార్థము రూఢార్థము రెండును ఉండును. కాని రూఢార్థమునకే ప్రాధాన్యము. ఉదా. వారిజము అను దానికి నీటి యందుఁ బుట్టినది అను వ్యుత్పత్త్యర్థ మున్నను అది పద్మ మను నర్థమందే రూఢమై యున్నది. యోగిక రూఢార్థములను రెండింటిని సమానముగా బోధించునది యౌగిక రూఢము. ఉదా. ఉద్భిదము. దీనికి భూమి నుద్భేదించునది అను వ్యుత్పత్తిని బట్టి తరుగుల్మాది యనియు రూఢ్యర్థమును బట్టి యజ్ఞవిశేష మనియు నర్థములు గలవు.

<u>లక్షణావృత్తి</u> ; ముఖ్యార్థమున కనుపపత్తి కలుగునప్పుడు ప్రయోజనమును బట్టి కాని లోకమునందలి రూఢినిబట్టి కాని ముఖ్యార్థముతో సంబంధముగల వేఱొక అర్థమును బోధించు శబ్దశక్తికి లక్షణ యని పేరు. ఇది బోధించు నర్థము లక్ష్యార్థము. ఇది వాచ్యార్థముతో సంబంధము కలిగి యుండునే కాని దానికిఁ గేవలము భిన్నముగా నుండదు. ఇచ్చట ముఖ్యార్థ బాధ. ముఖ్యార్థ సంబంధము. ప్రయోజనము గాని రూఢి కాని యుండుట అను మూఁడు విషయములను గమనింప వలయును.

'గంగాయాం ఘోషః' అనఁగా గంగయందు గొల్లపల్లె యని వాచ్యార్థము. గంగయందు గొల్లపల్లె యుండుట అసంభవము. ఇట వాచ్యార్థమున కనుపపత్తి

కలినగిది. అందుచే దానితో సంబంధము గల యింకొక యర్థమును గ్రహింప వలెను. దీనినిబట్టి గంగాతీరమందు గొల్లపల్లె అను నర్థము గ్రహింపవచ్చును. ఇట్లు గ్రహించుటకు రూఢి కాని ప్రయోజనము కాని కారణములై యుండ వలయును. "గంగాయామ్" అను మాటకు గంగాతీరమందను లోకరూఢి లేదు. కాని ప్రయోజన మున్నది. అట్లు చెప్పుటవలన గంగయందలి శీతత్వ పావనత్వాదులు ఘోష మందును గలవని స్ఫురించుటయే ఆ ప్రయోజనము. "గంగాతీరమందు గొల్లపల్లె" యని వివరించి చెప్పుట వలన ఆ ప్రయోజనము స్ఫురింపదు. ప్రయోజనమును బట్టి యిచ్చట "గంగాయాం ఘోషః" అను దానికి గంగాతీరమందు ఘోష మని వాచ్యార్థ సంబంధముగల మఱొక యర్థము చెప్పుకొనుచున్నాము. ఈ యర్థమును స్ఫురింపఁజేయు శబ్దశక్తికే లక్షణయని పేరు.

లక్షణ-సంబంధ నిబంధనా లక్షణ, సామ్య నిబంధనా లక్షణ యని ప్రధానముగా రెండు విధములు. ఇవి మరల ప్రయోజనమును బట్టియు రూఢిని బట్టియు నొక్కొక్కటి రెండేసి విధములు. సంబంధ నిబంధనా ప్రయోజన లక్షణ, సంబంధ నిబంధనా రూఢి లక్షణ, సామ్య నిబంధనా ప్రయోజన లక్షణ, సామ్య నిబంధనా రూఢి లక్షణ అని వానికి పేర్లు. గంగాయాం ఘోషః అను దానికి గంగాతీరమందు ఘోషమని పైని చెప్పఁబడిన యర్థము సంబంధ నిబంధనా ప్రయోజన లక్షణ కుదాహరణము. మనము కుశల శబ్దమును "నేర్పుగల" అను నర్థమున వాడుచుందుము. వాఁడు కార్యమునఁ గుశలుఁ డనఁగా పనియందు నేర్పుగలవాఁడని యర్థము. కుశల శబ్దమునకు (కుశాన్ లాతి = కుశలను గ్రహించువాఁడు) అనునది వ్యుత్పత్త్యర్థము. వాఁడు కార్యమున కుశలుఁడను నప్పుడీ వాచ్యార్థమునకు అనుపపత్తి సంభవించును, అనఁగా వాచ్యార్థము కుదురదు. అప్పుడు దానితో సంబంధము గల మఱొక అర్థమును గ్రహింపవలయును. ఆ ట్లర్థాంతరమును గ్రహించుటకు ప్రయోజనము కాని లోకరూఢి కాని యుండ వలయును. ఇచ్చట ప్రయోజనములేదు కుశల శబ్దమునకు నేర్పరి యను రూఢి యున్నది. కుశలు వాడియైన యంచులు కలిగి యుండును. అశ్రద్ధగా వానిని గ్రహించినచో వ్రేళ్లు తెగిపోవును. అట్టి క్లేశము లేకుండ మెలఁకువతో కుశలను గ్రహించువాఁడు కుశలుఁడు, అందుచే కుశల శబ్దమునకు నేర్పరి అను రూఢి యేర్పడినది. దీనిని బట్టి వాఁడు కార్యమున కుశలుఁడను వాక్యమునకు వాఁడు

పనిలో నేర్పరి అను లక్ష్యార్థము చెప్పుకొనుచున్నాము ఇది సంబంధ నిబంధనా రూఢి లక్షణ కుదాహరణము. మన మందమైన యువకుని గూర్చి చెప్పునప్పుడు అతఁడు మన్మథుఁ డని చెప్పుచుందుము. నిజమున కతఁడు మన్మథుఁడు కాదు. అందుచే నీవాక్యమున వాచ్యార్థమునకు అనుపపత్తి కల్గినది. అప్పుడు దానితో సంబంధము గల వేఱొక యర్థము చెప్పుకొనవలెను మన్మథునందుఁగల సౌంద ర్యము అతనియందుఁ గూడ నుండుటచే ఆ సామ్యమువలన అతఁడు మన్మథ సదృశుఁడను అర్థము చెప్పుకొందుము. ఈ అర్థాంతరము గ్రహించుటకు సౌంద ర్యము ప్రయోజనము సామ్య ప్రయోజనములను బట్టి యేర్పడిన యర్థాంతరము కావున నిది సామ్య నిబంధనా ప్రయోజన లక్షణ కుదాహరణము. మనము తైల పదమును తఱచుగా వాడుచుందుము. తైల మనఁగా తిలలనుండి తీయఁబడిన నూనె (నువ్వులనూనె) అని వ్యుత్పత్త్యర్థము. కొబ్బరినూనెను సంస్కృతమున నారికేళతైల మందురు. ఇచ్చట తైలశబ్దమునకు వాచ్యార్థము పొసఁగదు అప్పుడు తత్సాదృశ్యమును బట్టి కొబ్బరినూనె అను నర్థమును చెప్పుకుందుము. ఈవిధ ముగా తైల శబ్దమును నూనె అను రూఢి యేర్పడినది. ఇది సామ్య నిబంధనా లక్షణా రూఢి కుదాహరణము. (నిబంధన మనఁగా మూల మని యర్థము).

సంబంధ నిబంధనా లక్షణ జహదభిధేయ, అజహాభిధేయ అని రెండు విధములు. జహత్ అనఁగా విడుచుచున్న అని అర్థము. అభిధేయ మనఁగా వాచ్యార్థము. విడుచుచున్న వాచ్యార్థము కలది జహదభిధేయ. విడువని అజహత్ వాచ్యార్థము కలది అజహాభిధేయ. మంచాః క్రోశన్తి అనఁగా మంచెలు మ్రోయు చున్నవని అర్థము. మంచెలు జడపదార్థములు. అవి మ్రోయుట అసంభవము. అందుచే నిచ్చట మంచెలనఁగా మంచెలపై నున్నవారను అర్థాంతరమును గ్రహింప వలెను, గంగాయామ్ అనఁగా గంగాతీరమునం దని వలెనే మంచాః అనఁగా మంచగతుః ని లక్ష్యార్థము, ఇచ్చటి వాచ్యార్థమునకు ప్రవేశములేదు. అందుచే నిది జహదభిధేయ. దీనికే జహద్వాచ్య, జహల్లక్షణ అని నామాంతరములు, గొడుగులు వేసికొని పలువురు వచ్చుచున్నప్పు డాదృశ్యముచూచి మనము అవిగో! గొడుగులు వచ్చుచున్నవని చెప్పుదుము, గొడుగు లచేతనములు. అవి వచ్చుట అసంభవము, వాచ్యార్థమున కిచ్చట అనుపపత్తి కల్గుటచే ఆ వాక్యమునకు గొడుగులు ధరించిన మనుష్యు లని లక్షణార్థము చెప్పు కొందుము. నిజమున కిచ్చట ఛత్రధారుల

తోపాటు ఛత్రములు కూడ వచ్చుచున్నవి. అందుచే తాత్పర్యమున వాచ్యార్థము నకు కూడ ప్రవేశ మున్నది. ఇది విడువని వాచ్యార్థము కలది. కావున అజహద విధేయ. దీనికి అజహద్వాచ్య, అజహల్లక్షణ అని నామాంతరము.

సామ్య నిబంధనా లక్షణ సారోప, సాధ్యవసాయ అని రెండు విధములు. అవనిపాలుఁడు సింహ మను వాక్యమును వినఁగానే రాజు సింహ మెట్లగునను సందేహము పుట్టును. ఇది బ్రాహ్మణుఁ డగ్ని. అతఁడు మన్మథుడు. అను వాక్యముల వంటిది. ఇచ్చట శౌర్యాది గుణసామ్యముచే రాజు సింహసదృశుఁ డను నర్థము చేసికొందుము. రాజుపమేయము; సింహ ముపమానము. ఈ రెండును ఈ వాక్యమున వేఱు వేఱుగా నున్నవి. ఉపమేయమునం దుపమాన గుణము లారోపింపఁ బడుచున్నవి. అందుచే నిది సారోప (స+ఆరోప) ఇట్లువమా నోపమేయములను రెండింటిని భిన్నముగాఁ జెప్పక ఉపమానమును మాత్రమే చెప్పుటయు. గలదు శౌర్య ధైర్యసమగ్రుడైన యోధుఁ డొకఁడు వచ్చుచుండగా అదిగో! సింహము వచ్చుచున్నదని మనము చెప్పుదుము ఇచ్చట నుపమాన పదమే కావి ఉపమేయము వాడఁబడి యుండలేదు. ఉపమా నోపమేయములు రెండింటికి అభేద ప్రతిపత్తి చెప్పఁబడినది. అందుచే నిది సాధ్యవసాయ. (స+అధ్యవసాయ). అధ్యవసాయ మనఁగా అభేద ప్రతిపత్తి.

పైని పేర్కొనఁ బడిన లక్షణా భేదములే కాక లక్షిత లక్షణ, విపరీత లక్షణ అను మఱిరెండు భేదములు కూడ నున్నవి. వాచ్యార్థముతో సాక్షాత్సం బంధము కాక పరంపరా సంబంధముగల లక్షణ లక్షితలక్షణ ఉదా. ద్విరేఫము. దీనికి రెండు రేఫములు కలదని యర్థము నిజమునకు రెండు రేఫములు కల యే పదమైనను ద్విరేఫము కావచ్చును. లోకమున ద్విరేఫమనఁగా భ్రమరము (తుమ్మెద) అను రూఢ్యర్థ మున్నది. పదము తుమ్మెద యెట్లగును? అందుచే నిచ్చట వాచ్యార్థమున కనుపపత్తియు పిమ్మట రూఢినిబట్టి భ్రమరమును లక్ష్యార్థ మును ఏర్పడినవి. భ్రమర పదము తరువాత తుమ్మెద అను నర్థమును బోధించు చున్నది. ఈ విధముగా వాచ్యార్థముతో పరంపరా సంబంధముగల ఈ లక్షణ లక్షితలక్షణ. రోదర శబ్దముకూడ నిట్టిదే. రేఫ మురమందుఁ గలది రోదరము. అనఁగా చక్రము అనఁగా చక్రవాకము. ఇచ్చటఁ గూడ వాచ్యార్థముతో పరం

పరా సంబంధము గల చక్రవాక మను నర్థము స్ఫురించుచున్నది. కాని లోక రూఢి లేనిచోట వర్ణముల సాయమున నిట్టి శబ్దములను కల్పించకూడదు. అట్లు కల్పితములగు శబ్దము లీప్సితార్థమును బోధింపఁ జాలవు.

వాచ్యార్థమునకు విరుద్ధమైన అర్థమును బోధించు లక్షణ విపరీత లక్షణ. వీఁడు బృహస్పతి అను వాక్యము వినఁగానే మనకు సామ్య ప్రయోజనముల బట్టి వీఁడు బృహస్పతి సదృశుఁడు; మహా బుద్ధిశాలి; అను లక్ష్యార్థము స్ఫురించును. ఇది సామ్య నిబంధనా ప్రయోజన లక్షణ. కాని ఆ వాక్యమ నేమియు చదు వెఱుంగని పామరుని గూర్చి వాడినచో వీఁడు వట్టి మూర్ఖుఁడు అని విపరీతార్థము స్ఫురించును. ఇచ్చట వాచ్యార్థమున కనువర్తియు పిమ్మట తద్విరుద్ధమైన మూర్ఖుఁడను లక్షణార్థమును దోఁచుచుండుటచే నిది విపరీత లక్షణ.

ప్రతాపరుద్రీయమున గౌణవృత్తి కూడ లక్షణా భేదమే అని చెప్పఁబడినది. లక్షణావృత్తి యందు వలెనే గౌణవృత్తిలోఁగూడ ముఖ్యార్థమున కనుపపత్తి కలుగును. "అగ్ని ర్మాణవకః" అనుచో "గంగాయాం ఘోషః" అనువాక్యము నందు వలెనే ముఖ్యార్థమునకు బాధ యేర్పడుచున్నది. అగ్ని సదృశ మానవుఁ డను లక్షణార్థము స్ఫురించుచున్నది. కాని కొందఱు మిమాంసకులు లక్షణా గౌణ వృత్తులు రెండును భిన్నములని చెప్పుదురు. ఏలయన "అగ్ని ర్మాణవకః" అనునప్పుడు అగ్నియందలి శుచిత్వాదులు మాణవకు నందు వాచ్యమును దిరస్కరించి వ్యంగ్యముగా భాసిల్లు చున్నవని వారి యభిప్రాయము.

వ్యంజనావృత్తి: శబ్దములకు వాచ్యార్థము పొసఁగిన పిమ్మట దానికి శోభా హేతువగు నర్థాంతరమును దోఁపించు శక్తికి వ్యంజన యని పేరు. అభిధాశక్తి ప్రాకరణికమైన వాచ్యార్థమును మాత్రమే తెలుపును. లక్షణాశక్తి వాచ్యార్థమున కనుపపత్తి కలిగి నప్పుడు దానితో సంబంధముగల మఱొక యర్థమును బోధించును. వ్యంజనాశక్తి ప్రకృతార్థమును అంతకంటె సుందరతరమైన అప్రకృతార్థమును గూడ స్ఫురింపఁజేయును. ఇది బోధించు నర్థమునకే వ్యంగ్యమని పేరు. వ్యంజనా శక్తిని సాహిత్యరంగమున సుప్రతిష్ఠితము కావించినవా రానందవర్ధనా చార్యుల వారు. అంతకుముందున్న పండితులు శబ్దమునకుఁగల అర్థబోధకశక్తిని బరిశీలించి అభిధాలక్షణాశక్తులు రెండింటినే అంగీకరించిరి. వారికి వ్యంజనా శక్తి

విషయ మస్ఫుట స్ఫురితముగా నుండెను. అట్టితటి పాండిత్య పాథోనిధులైన ఆనందవర్ధనాచార్యులవారు ప్రతిభా మహితముగను హేతువాద పురస్సరముగను దానిని నిరూపించి విద్వదానంద వర్ధనులై విరాజిల్లిరి.

వ్యంజనాశక్తి శబ్దశక్తి మూలవ్యంజన, అర్థశక్తి మూలవ్యంజన, ఉభయ శక్తి మూలవ్యంజన అని మూఁడు విధములు. కాని శబ్దము లనేకార్థములను బోధించుశక్తి గల్గియుండును. దీనికి అర్థశక్తి అని పేరు. ఇది మూలముగాఁగల వ్యంజన శబ్దశక్తి మూలవ్యంజన. ఇచ్చటి వ్యంజనశబ్దములు పరివృత్తిని సహింపవు. అనఁగా ఇచ్చటి శబ్దములను దొలగించి వాని స్థానమున పర్యాయపదముల నుంచినచో వ్యంగార్థము పొసఁగదు. ఉదా; నరసింహుని కరమున నొప్పు నసి నిజధారా నిమజ్జన తత్పరులగు నరులకు ననిమిషత్వము చేకూర్చును. నరసభూపాలుని చేతియందలి కత్తి తన ధారాజలముల మునుఁగు శత్రువులకు తెప్పపాటు లేమిని (నిశ్చేష్టతను) గలిగించునని యిందలి వాచ్యార్థము. ఇది ప్రకృతార్థము నృసింహమూర్తి చేతికత్తి తన ధారాజలముల మునుఁగఁగోరు నరులకు (మానవులకు) దేవత్వము నొసంగునని యిందలి వ్యంజనార్థము. ఇది అప్రకృతార్థము. ప్రకరణముచే వాచ్యార్థము నియమితమై ముగిసిన పిమ్మట నరసింహదేవునికి సంబంధించిన వ్యంగ్యార్థము ప్రకటితమగుచున్నది. ఇచ్చట నృసింహుని నరులకు, అనిషత్వము అనునవి వ్యంజకములైన పదములు, వీనికి బదులు నరసభూపాలుని. శత్రువులకు తెప్పపాటు లేమి అను పదములను వాడినచో వ్యంగ్యార్థము స్ఫురింపదు. శబ్దశక్తి కారణముగాఁగల వ్యంజన కావున నిది శబ్దశక్తి మూలవ్యంజన.

అర్థశక్తి కారణముగాఁ గల వ్యంజన అర్థశక్తి మూలవ్యంజన. ఇందు శబ్దములు పరివృత్తి సహించును. అనఁగా వ్యంజనములైన శబ్దములకు బదులు పర్యాయ పదములను వాడినను వ్యంగార్థమునకు భంగమురాదు. ఉదా, నరస భూపాలా! నీ విరోధిభార్య పర్వతముల నివసించుచు నచ్చటి భిల్ల కాంతలతో "మా యూరి చంద్రుఁడు చల్లనివాఁడు మా యూరి మలయ మారుతము చల్లనిది" అని పల్కుచుండును. ఇచ్చట నరసరాజు విరోధి భార్య ముగ్ధ యనియు, భర్తృ విరహముచేఁ గ్రాగు చుండెననియు. నరస భూపాలుఁ డెల్ల రాజులను

జయించెననియు వ్యంగార్థము స్ఫురించుచున్నది. ఇందలి పదము లన్నియుఁ బరివృత్తి సహించునట్టివే. అందుచే నిది అర్థశక్తి మూలవ్యంజన.

వ్యంజకములైన శబ్దములు కొన్ని పరివృత్తిని సహించియుఁ గొన్ని సహింపకయు నున్నచో నది ఉభయశక్తి మూలవ్యంజన. ఇందు శబ్దశక్తి-అర్థశక్తి మూలవ్యంజనలు రెండును గలసి యుండును. ఉదా: నరసింహుఁ డరిదర కరుఁడై సుమనోవరభరణ ధురీణుఁడై లక్ష్మీ స్థిరవాస భాసురుఁడై ప్రకాశించుచున్నాడు. నరసభూపాలుఁడు అరి = శత్రువులకు; దర = భయమును, కరుఁడై = చేయువాఁడై; సుమనోవర = పండిత శ్రేష్ఠులను; భరణ = పోషించుటయందు; ధురీణుఁడై = సమర్థుడై, (భారము వహించువాఁడై) రాజ్యలక్ష్మియొక్క స్థిర నివాసముచేఁ బ్రకాశించువాఁడై యొప్పుచున్నాఁ డనునది యిందలి వాచ్యార్థము. నరసింహ దేవుఁడు అరి, దర, కరుఁడై = చక్రమును శంఖమును జేతఁగల వాఁడై సుమనోవర. భరణ ధురీణుఁడై = దేవేంద్రుని భరించుటయందు సమర్థుఁడై, ఇందిరా దేవియొక్క స్థిరమైన వాసముచేఁ బ్రకాశించువాడై యొప్పుచున్నాఁడనునది, వ్యంగార్థము. ఇచ్చట అరిదరకరుఁడు. సుమనోవర భరణ ధురీణుఁడు. నృసింహుఁడు అనునవి పరివృత్తి సహింపవు లక్ష్మీస్థిరవాస భాసురుఁడు, ప్రకాశించుచున్నాఁడు అనునవి పరివృత్తి సహించును. కొన్ని శబ్దములు పరివృత్తిని సహించియు, కొన్ని సహింపకయు నుండుటచే నిందలి వ్యంజన ఉభయ శక్తి మూల వ్యంజన.

వ్యంజనకు ధ్వని, ధ్వననము గమనము ద్యోతనము, ప్రత్యాయనము, అనునవి పర్యాయ పదములు.

## 2. ధ్వని యనగా నేమి? ధ్వని భేదములు.

ధ్వని యనగా నేమి : అభినవగుప్తుఁడు ధ్వని శబ్దమునకు ధ్వని కావ్యము వ్యంగ్యార్థము, వ్యంజనాశక్తి అను మూఁడు విధములైన యర్థములను దెల్పి యుండెను. ఎచ్చట అర్థమును శబ్దమును తన్ను తన యర్థమును అప్రధానము కావించి యర్థాంతరమును వ్యక్తము చేయునో యట్టి కావ్య విశేషమునకు ధ్వని

యని పేరు. *ఇది కావ్య పరమైన యర్థము. శబ్దములకు వాచ్యము వ్యంగ్యము అను రెండు విధములైన అర్థము లుండును. అందుకు వాచ్యార్థమును నిఘంటు వ్యాకరణాదుల సాహాయ్యమున నెఱుంగవచ్చును. దీనికే ముఖ్యార్థము. సంకేతితార్థము అని నామాంతరములు. ఒక్కొక్కప్పుడు వాచ్యార్థము బోధపడినపిమ్మట అసూర్యంపశ్యలగు స్త్రీల యవయవములందుఁ దద్భిన్నముగా లావణ్యము ప్రకాశించు విధమున మహాకవుల కావ్యములందు వాచ్యార్థముకన్న భిన్నమును సుందరతరమునైన యర్థాంతరము ప్రకాశించు చుండును. ఇది వస్తురూపమునఁ గాని అలంకార రూపమునఁగాని రసరూపమునఁగాని యుండును. దీనికే వ్యంగ్యార్థమని పేరు. ఇది వాచ్యార్థ సామర్థ్యముచేతనే ఆక్షిప్త మగుచుండును. అనఁగా ముందు వాచ్యార్థము స్ఫురించిన పిమ్మట దాని సాహాయ్యము చేతనే అంతకన్న రమ్యతరమైన ఈ వ్యంగార్థము తోఁచు చుండును. ఈ క్రమము వస్త్వలంకార వ్యంగ్యములందు స్పష్టముగా గోచరించును గాని రసవ్యంగ్యమందు గోచరింపదు. వ్యంజనా శక్తినిగూర్చి యిదివఱకుఁ జెప్పఁబడినది. పదార్థము లాకాంక్షాది వశమున పరస్పర సంబద్ధములు కాఁగా కలిగిన వాక్యార్థమునకు శోభా హేతువైన అర్థాంతరమును స్ఫురింపఁజేయు శబ్దశక్తికి వ్యంజన యని పేరు. ప్రకృతార్థమును మాత్రమే బోధించు నభిదాశక్తి కంటెను ప్రకృతార్థమున కనుపపత్తి కలిగినపుడు వాచ్యార్థ సంబంధములుగ వేఱొక యర్థమును బోధించు లక్షణాశక్తి కంటెను ముందు ప్రకృతార్థమును తరువాత నంతకంటె రమణీయమైన అప్రకృతార్థమును గూడ బోధించు వ్యంజనాశక్తి విలక్షణ మైనట్టిది.

ధ్వని భేదములు : పై మూడర్థములలో కావ్యమున కాత్మ ధ్వని యనునప్పుడు ధ్వని శబ్దమునకు వ్యంగ్యార్థ మను నర్థమునే గ్రహింప వలయును. ఈ ధ్వని అభిధామూలధ్వని, లక్షణా మూలధ్వని అని రెండు విధములు. అభిధామూల ధ్వనికి వివక్షితాన్య పరవాచ్య మనియు లక్షణా మూలధ్వనికి అవివక్షిత వాచ్య మనియు నామాంతరములు. వివక్షితాన్య పరవాచ్య మనఁగా అన్య (ధ్వని) పరముగా వివక్షింపఁబడిన వాచ్యము గలదని యర్థము. యిందు వాచ్యార్థము పొసఁ

* యత్రార్థ శబ్దోవా తమర్థ ముపసర్జనీకృత స్వార్థౌవ్యంక్తః కావ్య విశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః.

గినను ధ్వని పరముగా వివక్షింపఁబడును. అవివక్షిత వాచ్య మనఁగా వివక్షింపఁబడని వాచ్యముగలది. ఇందు వాచ్యార్థము పొసఁగనే పొసఁగదు.

అభిధా మూలమైన వివక్షితాన్య పరవాచ్యము లక్ష్య క్రమ వ్యంగ్యము, అసంలక్ష్య క్రమ వ్యంగ్యము అని రెండు విధములు. మొదటిదానియందు వాచ్య వ్యంగార్థముల క్రమము స్ఫుటముగా గోచరించును. అనఁగా ముందు వాచ్యార్థము గోచరించి తరువాత వ్యంగార్థము స్ఫురించును. అందుచే దీని కనుకరణవ్యంగ్య మను నామాంతరము కల్గినది. రణన మనఁగా ధ్వని; అనురణన మనగా ప్రతి ధ్వని. ధ్వని శ్రుతమైన పిమ్మటఁ గదా ప్రతిధ్వని శ్రుత మగుచుండును. రెండవ దానియం దత్యంత సూక్ష్మ మగుటచే వాచ్య వ్యంగ్యముల క్రమము గోచరింపదు. శతపత్రము నూఱు రేకుల కొకదానిపై నొకటిగా నమర్చి సూదితో గ్రుచ్చినచో ఆ సూది నిజముగా నొక్కొక్క రేకును గ్రుచ్చుచు పోయినను మనకా క్రమము గోచరింపక అది అన్ని రేకుల నొక్కమాఱే గ్రుచ్చినట్లు గోచరించును. అట్లే అసంలక్ష్య క్రమమునఁ గూడ అర్థము వాచ్యమునుండియే వ్యంగ్యమునకు తరలినను ఆక్రమము గోచరింపదు. అందుచే దాని కసంలక్ష్య క్రమమను పేరు కల్గినది.

లక్ష్యక్రమ వ్యంగ్యము శబ్దశక్తి మూలము, అర్థశక్తి మూలము, ఉభయ శక్తిమూలము అని మూఁడు విధములు. ఇందు శబ్దశక్తి మూలము వస్త్వలంకార రూపముల రెండు విధములు. ఇవి యొక్కొక్కటి పదవాక్య భేదములచే రెండేసి విధములు. ఈ విధముగా శబ్దశక్తి మూల (లక్ష్యక్రమ) వ్యంగ్యము మొత్తము నాలుగు విధములు.

అర్థశక్తి మూల (లక్ష్యక్రమ) ధ్వని స్వతస్సిద్ధము. కవి ప్రౌఢోక్తి సిద్ధము, కవి నిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధము అని మూఁడు విధములు. అది యొక్కొక్కటి వస్తురూపము, అలంకార రూపము, వస్తు కృతాలంకార రూపము, అలంకార కృతాలంకార రూపము అని నాలుగు విధములు. ఈ విధముగా విది పండ్రెండు విధము లగును. ఈ పండ్రెండును పదగత, వాక్యగత, ప్రబంధ గత భేదములచే ముప్పదియాఱు విధము లగును.

ఉభయశక్తి మూల (లక్ష్యక్రమ) వ్యంగ్యము కావ్యగతమై ఏకైక విధముగా నుండును.

ఇట్లు శబ్దశక్తి మూలము నందలి నాలుగు విధములు, అర్థశక్తిమూలము నందలి ముప్పదియాఱు విధములు. ఉభయశక్తి మూలముయొక్క విధము కలసి లక్ష్యక్రమ వ్యంగ్యము మొత్తము నలువది యొక్క విధములు.

అసంలక్ష్యక్రమ వ్యంగ్యము పదగతము. వాక్య గతము. వర్ణ గతము. రచనా గతము. పదైక దేశ గతము. ప్రబంధ గతము అని ఆఱు విధములు. ఈ విధముగా అభిధా మూలమైన వివక్షితాన్య పరవాచ్యము (41 + 6) మొత్తము నలువది యేడు విధములు.

లక్షణా మూలమైన అవివక్షిత వాచ్యధ్వని అర్థాంతర సంక్రమిత వాచ్యము అత్యంత తిరస్కృత వాచ్యము అని రెండు విధములు. ఇవి రెండును పద వాక్య గత భేదములచే మొత్తము నాలుగు విధములు.

ఈ విధముగా అభిధా మూలమగు వివక్షితాన్య పర వాచ్యము నందలి నలువది యేడు విధములును, లక్షణామూలమైన అవివక్షిత ధ్వని యందలి నాలుగు విధములును గలసి శుద్ధధ్వని ఏఁబదియొక్క రకములు.

ఈ ధ్వను లేఁబది యొక్కటియు నొండొంటితోఁ గలసి సంకీర్ణములై 1326 విధము లగును. ఇవి మరల త్రివిధ సంకరములచేతను ఏకవిధ సంసృష్టి చేతను మొత్తము నాలుగు రెట్లగుటచే 5304 భేదము లేర్పడును.

పై ధ్వని భేదములలో ముఖ్యములైన వానికి క్రింద లక్ష్యములును వానికి లక్షణముతో సమన్వయమును చూపఁబడుచున్నవి.

1. కాంతారవాస సంతప్తులైన ఓ నృపతులారా! నేను చెప్పు ఈ హితము నాలకింపుఁడు. మీ రిప్పుడు రాజ పాద సేవ కావింపుఁడు. "ఓ నృపతులారా! మీరు కాంతారవాసముచే సంతాపము నొందుచున్నారు. కావున చంద్రకిరణ సేవ కావింపుఁడు, మీ సంతాపము చల్లారును." అని వాచ్యార్థము. "మీరు ప్రతాపరుద్ర మహారాజు పాదసేవ కావింపుఁడు, ఇట్లరణ్యమున వసించుచు నేల సంతాపము

నొందెదు' రని వ్యంగ్యార్థము. రాజ పాద సేవ అనుట యందలి శబ్దశక్తిచే వ్యంగ్యార్థ స్ఫూర్తి కలుగుచున్నది. ఇది వస్తురూపమున నున్నది. "రాజ పాద సేవ" అను పదమును దొలఁగించి వాని స్థానమున పర్యాయ పదముల నుంచినచో నిట వ్యంగ్యార్థము పొసఁగదు. అవి పరివృత్తి సహింపవు. మరియు నిందు చంద్ర కిరణసేవ అను వాచ్యార్థమునుండి ప్రతాపరుద్ర మహారాజ పాద సేవ అను వంగ్యార్థము పొసఁగిన క్రమము గోచరించుచున్నది. అందుచే ఇది శబ్దశక్తి మూల లక్ష్య క్రమ వస్తుధ్వని.

2. ఓ రాజా! ఈ తరుణి పద్మిని, నీ వెప్పుడు నెల్లరను బ్రోచునినుఁడవు. నీ కర స్పర్శ లేనిచో నీమె యెట్లు బ్రదుకును.? "పద్మిని, ఇనుఁడు, కరస్పర్శ" అనువాని యందలి శబ్దశక్తిచే "ఈమె పద్మలత. నీవు సూర్యుఁడవు. నీ కిరణముల స్పర్శ లేనిచో నీమె యెట్లు జీవించును." అను వ్యంగ్యము స్ఫురించుచున్నది. ఈ శబ్దములు పరివృత్తిని సహింపవు. సూర్యకిరణ స్పర్శ లేనిచో పద్మలత జీవింప నట్లు ప్రభువైన నీ హస్తస్పర్శ లేనిచో పద్మినీజాతికిఁ జెందిన యీ తరుణి జీవింప" దని యిందుపమాలంకారము ధ్వనిత మగుచున్నది. వాచ్య వ్యంగ్యముల క్రమముకూడ స్ఫుటముగా గోచరించుచున్నది. అందుచే నిది శబ్ద శక్తి మూల లక్ష్యక్రమాలంకార ధ్వని.

3. ప్రతాపరుద్రుని శత్రువుల భార్యలు ఋతువులులేని సంవత్సరములను శుక్లపక్షములులేని మాసములను రాత్రులులేని దివసములను గోరుచున్నారు. ప్రతాపరుద్రుని శత్రువుల భార్యలు ఋతు శుక్లపక్ష రాత్రులు కామోద్దీపకము లగుటచే నవిలేని వర్షమాస దివసములను గోరుచున్నారనియు, వారు భర్తృ వియోగము ననుభవించుచున్నా రనియు, ప్రతాపరుద్రుఁడు శత్రువుల నందఱిని సంహరించె ననియు వస్తురూపమైన వ్యంగ్యము స్ఫురించు చున్నది. ఇందలి పదములు పరివృత్తిని సహించు నట్టివి. అందుచే నిది అర్థశక్తి మూలము. వాచ్య వ్యంగ్యముల పౌర్వాపర్యక్రమ మిందు కనవచ్చుచున్నది. అందుచే నిది అర్థశక్తి మూల వస్తుకృతవస్తు లక్ష్యక్రమ వ్యంగ్యము.

4. ప్రతాపరుద్రుని జగద్వ్యాప్తమైన కీర్తి నిగాంచి శివుఁ డందు వసించుటకును, విష్ణువందు శయనించుటకును, దివ్యముని గణ మందు స్నానము చేయుట

కును, సముద్రము లుప్పొంగుటకును, ఆదేనుఁగు సవిలాసముగా స్పృశించుటకును గోరుచున్నవి. ప్రతాపరుద్రుని కీర్తిని గాంచి శివుఁడు కైలాసమనియు, విష్ణువు దుగ్ధాబ్ధియనియు, మునులు సురనదియనియు, సముద్రములు చంద్రకాంతియనియు, ఆదేనుగ్గైరావత మనియు భ్రమించిరని వ్యంగ్యము. ఇందలి పదములు పరివృత్తి సహములు. అందుచే నిది అర్థశక్తి మూలము. ఇచ్చట వస్తువు భ్రాంతి మదలంకారమును ధ్వనింపఁ జేయుచున్నది. అందుచే నిది అర్థశక్తి మూలవస్తు కృతాలంకార లక్ష్య క్రమ వ్యంగ్యము.

5. ఇతఁడు భుజస్తంభ జృంభమాణాద్భుతాయుధుఁడైన జిష్ణుఁడు. ఓ భూభృత్తులారా! మీరింక నిజపక్ష విజృంభితమును విడువుడు. "ఇతఁడు భుజము లందు ప్రకాశించు నద్భుతమైన యాయుధముగల జయశీలుఁడు. ఓ రాజులారా! మీరిక సేనాబలము గలదను గర్వము నుజ్జగింపుఁడు" అనునది ప్రకృతార్థము. "ఇతఁడు భుజములందుఁ బ్రకాశించు నద్భుతాయుధము (వజ్రాయుధము) గల ఇంద్రుడు. ఓపర్వతములారా! మీరింక రెక్కలు గలవను గర్వము నుజ్జగింపుఁ" డని అప్రకృతార్థము. ఇందు జిష్ణుఁడు. నిజపక్ష విజృంభితము అనునవి పరివృత్తి సహింపవు, భుజస్తంభ జృంభమాణాద్భు తాయుధుఁ డనునది పరివృత్తి సహించును. అందుచే నిది శబ్దార్థోభయ శక్తి మూలము ఇందు వాచ్యవ్యంగ్యముల క్రమము గోచరించుచున్నది. వజ్రాయుధ ధారియైన యింద్రుని ముందు పర్వత ముల రెక్కల గర్వము వలెనే అద్భుతాయుధ హస్తుఁడైన ప్రతాపరుద్రదేవుని ముందు రాజుల సేనాగర్వము వ్యర్థమను నుపమాలంకారము ధ్వనించుచున్నది. అందుచే నిది ఉభయ శక్తి మూల లక్ష్య క్రమ వ్యంగ్యము.

5. శూన్యమైన వాసగృహమును జూచి, మెల్లగా శయనమునుండి లేచి, నిద్రావ్యాజమును బొందిన ప్రియుని ముఖమును దిలకించి, సవిస్రంభముగా ముద్దాడి, గండస్థలము జాతపులక మగుట నారసి, సిగ్గుచే మొగమువాంచి యున్న యొక తరుణి నవ్వుచున్న ప్రియునిచే గాఢముగా చిరకాలము కౌగలించుకొనఁబడి నది. ఇందు విభావానుభావ సంచారి భావములచే శృంగార రసము వ్యక్తము చేయ

బడు నున్నది. *ఇందు వాచ్య వ్యంగ్యముల పౌర్వా పర్యము కానవచ్చుటలేదు. వాచ్యము తోడనే వ్యంగ్యమైన సంభోగ శృంగారము కూడ స్ఫురించుచున్నది. అందుచే నిది అసంలక్ష్య క్రమ (వివక్షితాన్య పరావాచ్య) వ్యంగ్యము.

8. ''ఓ శిరములారా! మీ రాస్మాకములు, ఔన్నత్యమేల కోరుదురు'' అని ప్రతాపరుద్రుని శత్రువు లతనికి నతు లగుచున్నారు. ఇచ్చట ఆస్మాకము లనఁగా కేవలము అస్మత్సంబంధులను నర్థమేకాక సర్వదైన్యములకును నిలయములైన మాకు సంబంధించినవారను అర్థాంతరమును స్ఫురించుచున్నది. ఇచ్చటవాచ్యార్థము వివక్షిత మగుటలేదు. అందుచే నిది అర్థాంతర సంక్రమి తావివక్షిత వాచ్యధ్వని.

8 ప్రతాపరుద్రుని తెల్లని కీర్తులెల్ల దిక్కులకును వెల్లవేసి స్వేచ్ఛగా విహరించుచున్నవి. దిక్కులు రూపము గలవి కావు. అందుచే వానికి వెల్ల వేయుట అనునది ఉపపన్నముకాదు. ఇచ్చట సున్నము పూయుట అను వాచ్యార్థము తిరస్కృతమై తెల్లని కాంతికలవిగాఁ జేయుచున్నవను వ్యంగ్యార్థము మాత్రమే స్ఫురించుచున్నది. అందుచే నిది అత్యంత తిరస్కృత అవివక్షిత వాచ్యధ్వని. విస్తర భీతిచే మిగిలిన ధ్వని భేదములకు లక్ష్యముల నొసంగుటలేదు. ఈ విధము గనే వాని నూహించు కొనవలయును.

''ఈ ధ్వనిసిద్ధాంతమును నీవు క్రొత్తగఁగల్పించితివి. ఇది ప్రామాణికము కాదు'' అని ఆనందవర్ధనాచార్యుల నితర పండితు లాక్షేపింపఁగా నతఁడు తాను దానివి వైయాకరణుల నుండి గ్రహించితి ననియు, నది అప్రామాణికము కాదనియు వారికి జవాబు చెప్పియుండెను. వర్ణములు రెండు క్షణములు మాత్రమే యుండి మూఁడవ క్షణమున నశించునని నైయాయికుల సిద్ధాంతము. శ్రీ అను శబ్దము నందు శ్, ర్, ఈ అను మూఁడు వర్ణము లున్నవి. అందు మూఁడవ వర్ణ

---

* శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించి చ్ఛనై
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యు ర్ముఖం
విస్రబ్ధం పరిచుంబ్య జాతపుల కామాలోక్య గండస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా.



3. లక్ష్య క్రమ వ్యంగము (41)
శబ్దశక్తి మూలము (4)
అర్థ శక్తి మూలము (36)
ఉభయశక్తి మూలము (1)
స్వతస్సిద్ధము.
కవిప్రౌఢోక్తి సిద్ధము
కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తి సిద్ధము
వస్తు (3)
అలంకార (3)
వస్తుకృతా అలంకార (3)
అలంకార కృతాలంకార (3)
Do
Do
Do
పదగతము
వాక్యగతము
ప్రబంధగతము
వస్తు (3)
అలంకార (3)
Do
వస్తుకృతాలంకార (3)
Do
అలంకార కృతాలంకార(3)
Do
పదగము
వాక్యగతము
ప్రబంధగతము
వస్తు (3)
అలంకార (3)
Do
వస్తుకృతా లంకార (3)
Do
అలంకార
Do కృతాలంకార (3)
పదగతము
వాక్యగతము
ప్రబంధగతము
4. అసంలక్ష్య క్రమ వ్యంగ్యము (6)
రచనాగతము
కావ్యగతము

## 3. ధ్వన్యభావవాదములు—తత్ఖండనము.

ధ్వన్యాలోకము మొదట ఆనందవర్ధనుఁడు (కారికా కర్తయగు ధ్వని కర్తయు-వృత్తికర్తయగు ఆలోక కర్తయు భిన్నులని కొందఱి అభిప్రాయము) "కావ్యమున కాత్మ ధ్వనియని యేది పూర్వము పండితులచేఁ జెప్పఁబడినదో దానికి కొందఱు అభావము పలికిరి. అన్యు లది భాక్తమని (లక్షణాంతర్గతమని) చెప్పిరి. కొందఱు దాని తత్త్వము వాక్కులకగోచరమని తెల్పిరి. అందుచే సహృదయ మనః ప్రీతికై దాని స్వరూపమును వివరింతుము." అని చెప్పియుండెను. దీనిని బట్టి ఆనందవర్ధనునికి ముందే ధ్వని సిద్ధాంత ముండె ననియు దాని యునికిని గూర్చి పండితులతో వాగ్వాదములు జరుగుచుండె ననియుఁ దెలియు చున్నది. ధ్వని సిద్ధాంతము నంగీకరింపని వారికి ఆనందవర్ధనుఁడు మూఁడు తెఱఁగులుగా విభజించెను. మొదటి తెగవారు ధ్వని యనున దసలు లేనే లేదనువారు (ధ్వన్యభావవాదులు)రెండవ తెగవారిది లక్షణాంతర్గతమే కాని తద్భిన్నము కాదని చెప్పువారు (భాక్తవాదులు). మూఁడవ తెగవా రదియున్నను దాని తత్త్వము వాచామగోచర మని నుడువువారు. (అలక్షణీయతా వాదులు). మొత్తము మీద ఈ మూడు తెఱఁగులకుఁ జెందిన వారును ధ్వనికి వ్యతిరేకులే.

<u>అభావ వాదము:</u> "తస్యాభావం జగదురపరే" అని ధ్వనికర్త చెప్పిన మొదటి తెగకుఁ జెందిన అభావవాదులు వృత్తిలో మూఁడు విధములుగా వివరింపఁబడి యున్నారు. వారు ధ్వని యనునది లేనే లేదని చెప్పుచు నిట్లు వాదింతురు. "శబ్దార్థములు కావ్యమునకు శరీరము, శబ్దార్థాలంకారములు, శబ్దార్థగుణములు అను నాలుగే కావ్యమునకు సౌందర్య హేతువులు. ధ్వని కూడ కావ్య సౌందర్య హేతు వగునెడల అదియు గుణమో అలంకారమో కావలయును. గాని వేఱు కాదు. రీతి వృత్తులు కూడ గుణాలంకారములకంటె భిన్నములుకావు. అందుచే గుణాలంకారములకంటె వేఱగు కావ్య సౌందర్య హేతువు మఱొకటి యుండదు. కావ్యార్థముగాఁ జెప్పఁదగిన ధ్వని యనునది యొకవేళ ఉన్నను అది నృత్త గీత నేత్ర సంజ్ఞాదుల వంటిదే కాని కావ్య సౌందర్య హేతువును కావ్య సంబంధియు కానేరదు. కొందఱిని సహృదయులుగా నేర్పఱిచి వారి కభిమత మగు కావ్య తత్త్వము ధ్వనియే యని యొక దానిని కల్పించినంత మాత్రమున

నది విద్వాంసుల కంగీకార్యము కాఁజాలదు. గుణాలంకారములలోనే ఒక దానికి ధ్వని అను క్రొత్తపేరు పెట్టి, లేని సహృదయత్వమును భావించుకొని, ధ్వని వాదులు కనులు మూసుకొని 'ధ్వని ధ్వని' అని నృత్యము చేయుచున్నారు. అందుచే ధ్వని అనునది ప్రవాద మాత్ర మే కాని నిజముగా నున్నది కాదు''

ఆనందవర్ధనుఁడు ధన్యభావవాదుల అభిప్రాయముల నీవిధముగా ఖండించెను. ''ధ్వన్యభావవాదు లందఱును కావ్యమునకు శబ్దార్థములు శరీరమని చెప్పుచున్నారు. ఈ శరీరముకంటె భిన్నమైనదాని నుజ్జీవింపఁజేయు ఆత్మ యొకటుండవలెను. ఇది అందఱికిని సులభముగా నవగతము కాదు. ఇది వాచ్యార్థము కాక వాచ్యార్థ సామర్థ్యముచే ఆకర్షింపఁబడి స్ఫురించు ప్రతీయమానార్థము. వాచకమును వాచ్యమును అగు శబ్దార్థములు కావ్యశరీరమే కాని కావ్యాత్మ కాఁజాలవు కాంతల శరీరమున అవయవముల కంటెను వాని నలంకరించు నలంకారముల కంటెను భిన్నమైన ప్రకాశించు లావణ్యమువలె కావ్యమునఁ దచ్ఛరీరమై శబ్దార్థములకంటెను వాని నలంకరించు గుణాలంకారములకంటెను భిన్నమై ప్రకాశించు ఆత్మ వాచ్యమగు ధ్వన్యర్థ ముండును, గుణాలంకారములు శబ్దార్థములకంటె భిన్నములే యైనను వాని నాశ్రయించుకొని యుండు పట్టి విశేషములే, శబ్దార్థ గుణాలంకారములచే నాకర్షింపఁబడి వ్యంజనచే స్ఫురింపఁ జేయఁబడు ధ్వన్యర్థము స్పష్టముగాఁ దోఁచు చుండగా నది గుణాలంకారములకంటె వేఱు కాదనుట సమంజసముకాదు. ఆధ్వని వస్త్వలంకార రసరూపమై మూఁడు విధములుగా నుండును. ఈ మూఁడు భేదము లందును అది వాచ్యముకంటె భిన్నమే. అది మహాకవుల నాట్యములందు ప్రసిద్ధమై యుండును. కొందఱ అప్రసిద్ధమని త్రోసిపుచ్చినంతమాత్రమున అది లేకుండఁబోదు. రామాయణ మహాభారతాదులను బరిశీలించిన నదియే సారభూతమై సహృదయ హృదయ రంజకమగు కావ్యతత్త్వముగా గోచరించును. ఆత్మలేని శరీరమువలె ధ్వనిలేని కావ్యమలంకార యుక్తమయ్యును శోభిల్లదు. అది కావ్య సంబంధులుకాని నృత్త గీతాదుల వంటిదికాదు. శరీరమున కాత్మవలె నది కావ్య శరీరమున సన్నిహిత సంబంధము కల్గి ప్రకాశించును.వాచ్యార్థము తెలిసికొనఁగల్గు వారందఱికిని వ్యంగ్యార్థము తెలియక పోవుట అనుభవసిద్ధ మగుటచేతను వాచ్యార్థము తెలియఁబడిన పిమ్మటనే

అంతకంటె సుందరతరమగు వ్యంగ్యార్థస్ఫూర్తి కలుగుచుండుటచేతను వాచ్యార్థము కంటె వ్యంగ్యార్థము భిన్నమని స్పష్టపడుచున్నది. గుణాలంకారము లభిధ చేతనే తెలుపబడుటవలన వాచ్యములే అగును. వాచ్య సామర్థ్యమున వ్యంజనచే స్ఫురింపఁ జేయబడుఁ వ్యంగ్యార్థము నా వాచ్యములం దంతర్భవింపఁజేయుట తగదు. ధ్వని అంగి. అలంకారాదు లంగములు. వస్త్వలంకారము లొకప్పుడు వాచ్యములగుట సంభవించినను రసాదు లెప్పుడును వాచ్యములు కావు. అవి విభావాది వాచ్యసామర్థ్యమున ఆక్షేపింపఁబడి ప్రతీయమానములే అగుచుండును. వాచ్యముకంటె ప్రతీయమానము వేఱని ప్రత్యేకముగాఁ జెప్పనక్కఱలేదు. సమాసోక్తి, ఆక్షేపము మున్నగు నలంకారములందుఁగూడ వ్యంగ్య మున్నను అచ్చట దానికి ప్రాధాన్యముండదు. వాచ్యమునకే ప్రాధాన్యముండును. అందుచే నవి గుణీభూతవ్యంగ్యము లగును. వానియందు ధ్వనిని అంతర్భవింపఁజేయుటకు వీలులేదు. వానినే ధ్వనియం దంతర్భవింపఁ జేయవలయును. ఏదో అలంకారమునకు ధ్వనియని పేరు కల్పింపఁ బడినదని భావించుట పొరపాటు, అలంకారము లేనిచోట కూడ కొన్నిచోట్ల ధ్వని స్పష్టముగా గోచరించు చుండును. అవి అలంకారము కాదు; అలంకార్యము. రీతి వృత్తి గుణాలంకారాదు లంగి యగు ధ్వని కంగములు. అంగాంగుల కభేదము చెప్పరాదు. అలంకారము ధ్వనింపఁ జేయఁబడి అంగి అగునపుడు కూడ ధ్వని ప్రభేద మగునే కాని అదే ధ్వని కాదు. ఏలయన ధ్వని వస్తురసాది రూపమునఁ గూడ నుండుట కవకాశ మున్నది. అందుచే అలంకార ధ్వనియందుఁ గూడ ధ్వని నంతర్భవింపఁజేయుట తగదు. వైయాకరణుల శబ్దధ్వని (స్ఫోటము) తోడి సామ్యమును బట్టి వాచ్య సాహాయ్యము చేతనే ఆక్షిప్తమయ్యు దానికంటె సుందరతరమై భాసించు అర్థాంతరమునకు మేము ధ్వని యను పేరొసంగి యున్నాము. దానిని భావించుకొని ధ్వనివాదు లానంద పారవశ్యము నందుటలో నసందర్భము కాని అనౌచిత్యము కాని లేదు.''

అంతర్భావ వాదము : కొందఱు పైని పేర్కొనఁబడిన అభావ వాదుల వలె ధ్వని యసలు లేనే లేదని చెప్పక అది అభిధయందో, లక్షణయందో, తాత్పర్యమునందో, అనుమేయము నందో అంతర్భవించునని చెప్పుదురు, అభిధాంతర్భావు లిట్లు వాదింతురు. ''వాచ్యార్థము తోఁచిన పిమ్మట నర్థాంతరమును స్ఫురింపఁజేయుటకు వ్యంజనా శక్తియను క్రొత్తశక్తి యవసరములేదు. దానిని

అభిధాశక్తియే వ్యక్తము చేయును. ఏలయన నేర్పరియైన విలుకాఁడు విసరు బాణము మొదట కవచమును పిమ్మట శరీరమును తరువాత ప్రాణమును గ్రమముగఁ దాఁకునట్లే ప్రతిభావంతుఁడైన కవి ప్రయోగించు శబ్దమున కభిధాశక్తి కూడ మొదట సంకేతితార్థమును పిమ్మట తాత్పర్యమును తరువాత వ్యంగ్యార్థమును బోధింపఁ జాలును.''

''అభిధాశక్తి సంకేతితార్థము నొక్కదానికే కాని వ్యంగములగు వస్త్వలంకార రసాదులను బోధింపఁ జాలదని ప్రాచీన సంప్రదాయము. నేర్పరియగు విలుకాఁడు విసరిన బాణమునకువలె నభిధాశక్తికిని దీర్ఘదీర్ఘతర వ్యాపార మున్నదనుటకు ప్రమాణము లేదు. అట్టి వ్యాపారమే దాని కున్నచో వ్యంజనా శక్తికే కాక లక్షణాశక్తికిని ఆవశ్యక ముండదు. ఏలయన అదియే ఆ రెండింటి వ్యాపారమును నిర్వహించును. అభిధాశక్తిచే బోధింపఁబడు వాచ్యార్థమునకును వ్యంజనాశక్తిచే స్ఫురింపఁ జేయఁబడు వ్యంగ్యార్థమునకును జాల భేదమున్నది. వాచ్యార్థ మందఱికిని ఒక్క విధముగనే తోఁచుచుండును. వ్యంగ్యార్థ మట్లుకాక వక్త, ప్రకరణము బోద్ధవ్యము, దేశము, కాలము మున్నగువాని ననుసరించి పలువిధముల భాసించుచుండును. వాచ్యార్థము విధి రూపమున నుండ వ్యంగ్యార్థ మొక్కొక్కప్పుడు నిషేధ రూపమున నుండును. అట్లే అది నిషేధ రూపమున నుండ నిది విధిరూపమున నుండును. అది విధి నిషేధ రూపముల నుండ నిది యనుభయ రూపమున (అనగా విధి రూపమునఁ గాని నిషేధ రూపమునఁ గాని యుండక) యుండును. ఒక్కొక్కప్పుడు వ్యంగ్యార్థము వాచ్యార్థము కంటె నత్యంత భిన్నముగా నుండును. వాచ్యార్థము శబ్దమును మాత్ర మాశ్రయించి యుండ వ్యంగ్యార్థము శబ్దము, శబ్దైకదేశము, అర్థము, వర్ణములు, రీతి అనువాని నాశ్రయించి యుండును. వాచ్యార్థమును నిఘంటు వ్యాకరణాదుల సాయమున నెఱుంగవచ్చును. వ్యంగ్యార్థము ప్రకరణాదులను బట్టి ప్రతిభావంతులు మాత్రమే తెలిసికొనఁదగి యుండును. వాచ్యార్థము పదార్థ జ్ఞానమును మాత్రమే కలిగింప వ్యంగ్యార్థము రమణీయమైన చమత్కారముద్వారా ఆనందము కలిగించును. ఈ విధముగా నన్యోన్య భిన్నములైన వాచ్య వ్యంగ్యార్థములు రెండింటిని అభిధా శక్తియే బోధించుననుట సమంజసము కా'' దని ఆనందవర్ధనుఁ డభిధాంతర్వాదుల వాదమును ఖండించెను.

తాత్పర్యాంతర్భావులు వ్యంజనా వృత్తి తాత్పర్యవృత్తియందే యంత ర్భవించును గావున దానిని వేఱుగాఁ జెప్ప నవసరము లేదని వాదింతురు. ఆలంకారికుల మతమున తాత్పర్యార్థమును వ్యంగార్థమును నొక్కటే. (తాత్ప ర్యార్థము కూడ వ్యంగ్యార్థమే కాని పృథగ్భూతము కాదని ప్రతాపరుద్రీయము). మీమాంసకులలో నొకతెగ వారైన అభిహితాన్వయవాదులు వాక్యము నందలి పదముల కన్వయము కలిపి యఖండార్థమును బోధించు శక్తినే తాత్పర్య శక్తి యని పేర్కొనిరి. ఇది పదసమన్వయమును మాత్రమే బోధించును గాని తద నంతరము ప్రకరణాదుల వలనఁ దోఁచు నర్థాంతరమును బోధింపఁజాలదు. అందుచే దీనియందు వ్యంగ్యార్థ మంతర్భవించునని చెప్పుటకు వీలులేదు.

భాక్తావాదము: ధ్వన్యాలోక కర్త లక్షణాశక్తిని భక్తి యనియు లక్ష్యార్థమును భాక్త మనియు పేర్కొని యుండెను అందుచే భాక్తావాదమును లక్షణాంతర్భావుల వాదమును ఒక్కటే వారిట్లు చెప్పుదురు. "లక్ష్యార్థ వ్యంగ్యా ర్థములు రెండును సమానములే. లక్షణా శక్తి శబ్దమునకు ముఖ్యార్థ బాధ కలిగినప్పుడు తొలుత దానితో సంబంధము గల యర్థమును బోధించి పిమ్మట ప్రయోజన సహితమైన యర్థమును గూడ లక్ష్యార్థముగనే బోధించును. శబ్దమునకు వ్యంగ్యార్థము బహువిధముగా నుండునట్లె లక్ష్యార్థము కూడ శబ్దార్థాధీనమును ప్రకరణ సాపేక్షమునై నానావిధములుగా నుండును. అందుచే వ్యంజనావృత్తి లక్షణావృత్తి యందే యంతర్భవించును గావున దానివి వేఱుగాఁ జెప్ప నవ సరము లేదు.

ఆనందవర్ధనుఁడీ వాదము నిట్లు ఖండించెను. లక్షణా వ్యంజనా వ్యాపారములు భిన్నములైనవి. శబ్దమునకు వాచ్యార్థము పొసఁగ నపుడు లక్షణ దానిని విడిచి దానితో సంబంధముగల వేఱొక యర్థమును బోధించును. (గంగా యాంఅనగా గంగా తీరమునందు అని చెప్పుట యిందుకు దృష్టాంతము). అనఁగా లక్ష్యార్థము వాచ్యార్థ సంబంధము కలిగియే యున్నను. అందు కొంత భాగమును విడిచి వేయును. వ్యంగ్యార్థ మట్లుకాక వాచ్యార్థము కంటె భిన్న ముగా నుండియు దానిచే నాకర్షింపఁబడియే ప్రకాశించుచుండును. అభిధ సంకేతితార్థమునే కాని ప్రయోజనమును బోధింపఁ జాలదు. ప్రయోజన సహిత

మైన లక్షణయు నుండదు. శబ్దమునకు ముఖ్యార్థ బాధ కలుగు నప్పుడది ప్రయోజనమును బట్టి కాని రూఢినిబట్టి కాని యర్థాంతరమును బోధించును దీనికే లక్ష్యార్థమని పేరు. లక్ష్యార్థ ప్రయోజనములు భిన్నములు. అవి రెండు నెప్పుడు నేకకాలమున గోచరింపవు. ప్రయోజనమును బోధించుటకు వ్యంజన తప్పక యుండవలయును లక్షణ మొదట నొక లక్ష్యార్థమును బోధించి మరల నింకొక లక్ష్యార్థమును బోధింపఁ జాలు ననుట పొరపాటు. గంగాయాం ఘోషః అను నప్పుడు గంగాయాం అనగా గంగాతీర మందని లక్ష్యార్థము. గంగాతీరే ఘోషః అను నప్పుడు ముఖ్యార్థమునకు అనుపపత్తి లేనేలేదు. గంగాతీరమంద నునది వాచ్యార్థమే. శీతత్వ పావన త్వాదులు గంగతో సంబంధించినవే కావి గంగాతీరమునకు సంబంధించినవి కావు అందుచే గంగాయాం అనునప్పుడు వలె గంగాతీరే అనునప్పుడు శీతత్వ పావన త్వాదులను ప్రయోజనము భాసింపదు. వానినే లక్ష్యార్థముగాఁ జెప్పినచో నింక నచ్చట ప్రయోజనాంతర ముండనే యుండదు. ప్రయోజనము లేనిచోటఁ గూడ కొన్ని యెడల లక్షణ యుండవచ్చును కాని ప్రయోజన మున్నచోట మాత్రమే వంగ్యముండును. అట్టిచోటఁ గూడ లక్షణకు విషయ మగు నర్థము లక్ష్యార్థమే కాని ప్రయోజన రూపమగు వ్యంగ్యార్థము కాదు. అందుచే లక్షణా వ్యంజనలు భిన్నములనక తప్పదు.

భక్తి (లక్షణ) ధ్వనికి లక్షణ మనుటలో అతివ్యాప్త్యవ్యాప్తి దోషములు కానవచ్చును. దానిని బట్టి భక్తి యున్నచోట్ల నెల్ల ధ్వని యున్నట్లు చెప్ప వలయును. కాని ప్రయోజన రూఢి హేతుక లక్షణ లుండు చోట్లగూడ నొక్కొక్కప్పుడు ధ్వని యుండదు. అందుచే పై వాక్యమున నతివ్యాప్తి కలిగినది అట్లె ధ్వని యున్న చోట్ల నెల్ల (భక్తి) లక్షణ యుండక పోయినచో నవ్యాప్తి దోషము కల్గును. అభిదామూల ధ్వని (వివక్షితాన్య పరవాచ్యధ్వని) భేదము లైన సంలక్ష్య క్రమ వ్యంగ్యము అసంలక్ష్య క్రమ వ్యంగ్యము అను వానిలో భక్తి యుండదు. అందుచే పై లక్షణమున నవ్యాప్తి కలుగుచున్నది. దీనిని బట్టి భక్తి ధ్వనికి లక్షణము కాదు ఆ రెండును భిన్నములు. వ్యంగ్యార్థమును వలె నొకప్పుడు లక్ష్యార్థమును నానా విధములుగా నుండి నను పెక్కర్థములు గల శబ్దమునకు సంయోగాదుల వలన నొకటే యర్థము నియమిత మౌనట్లు లక్షణచే లక్ష్యార్థము కూడ నియమింపఁబడుచుండును. లక్షణ వాచ్యార్థ సంబంధముగల

యర్థమునే కాని తత్సంబంధములేని యర్థమునెప్పుడును బోధింపక పోవుటయే యందలి నియమము. అందుచేతనే దానికి అభిదా పుచ్ఛమను పేరు కలిగినది. వ్యంగ్యార్థ మిట్లు గాక నియత సంబంధము కలిగియు, అనియత సంబంధము కలిగియు, సంబద్ధ సంబంధము కలిగియు, పలువిధముల నొప్పారు చుండును. మఱియు లక్షణాశక్తి శబ్ద మాత్రము నాశ్రయించి యుండ వ్యంజనాశక్తి శబ్ద శబ్దైక దేశ వర్ణ రీత్యాదుల నాశ్రయించి యుండును. అందుచే నాశక్తులు రెండును బృథగ్భూతములే” అని ఆనందవర్ధనుడు లక్షణాంతర్భావ మత మును ఖండించెను.

కొందఱు పండితులు వ్యంగ్య మనుమాన ప్రమాణ గమ్యమగు ననుమేయములోనే అంతర్భవించు నని చెప్పి వ్యంజనా వృత్తి యనవసర మని వాదింతురు. పొగ గోచరించుట వలన పర్వతమున నిప్పున్నదని మన మూహింతుము ఇట పొగ లింగ మనియు నిప్పులింగి యనియుం జెప్పం బడును. ఈ లింగి లింగములకు నియత సంబంధ ముండును. అట్లే శబ్దము లింగము, వ్యంగ్యార్థము లింగి లేక అనుమేయము లింగముచే లింగి యూహింపంబడును. అందుచే వ్యంజనా వృత్తి వేఱుగా నుండ నవసరము లేదని వారి యభిప్రాయము. కాని అనుమేయమును వ్యంగ్యార్థమును అభిన్నములు గావు. శబ్దోచ్చారణానంతరము తోచు నర్థము అనుమేయము ప్రతిపాద్యము అని రెండు విధములు ఆ అనుమేయము మరల శబ్దస్వరూప ప్రయోగేచ్ఛ అర్థ ప్రతిపాద నేచ్ఛ అని రెండు విధములు. ఈ రెండు విధములైన ఇచ్ఛలే అనుమేయములు (లింగి). శబ్దము లింగము. ప్రతిపాద్యార్థము ప్రతిపాద్యము వ్యంగ్యము అని రెండు విధములు. ఇవి అనుమేయములు కావు శబ్దము లింగ మనియు, వ్యంగ్యము లింగి యనియు భావింపరాదు. ఏలయన లింగలింగి సంబంధమువలె శబ్దవ్యంగ్యార్థ సంబంధము నియతమైనది కాదు ఈ శబ్ద మి వ్యంగ్యమునే బోధింప వలెనను నియమము లేదు. అనుమాన ప్రమాణము వ్యంగ్యార్థమును బోధింపం జాలదు. దానిని బోధించుటకు వ్యంజనా శక్తి తప్పక యుండ వలయును. అందుచే అనుమేయమునసే వ్యంగ్య మంతర్భవించు నని భావించుట సమంజసము కాదు.

<u>అలక్షణీయతా వాదము</u>: ధ్వని వాదము నంగీకరింపని మూడవ తెగ వారు ధ్వని కుచితమైన లక్షణము చెప్పంజాలక అది వాక్కులకగోచర మనియు,

సహృదయ హృదయైక వేద్య మనియు చెప్పుదురు. ధ్వని అనిర్వచనీయ (అలక్షణీయ) మని వారి అభిప్రాయము. కాని ఈ అభిప్రాయము సమంజసము కాదు. ప్రతిభావంతులైన పండితులు ధ్వని లక్షణమును అందలి పెక్కువాంతర భేదములను వివరించి యున్నారు. ఇట్లు చెప్పఁబడిన పిమ్మటఁ గూడ నది అలక్షణీయమే యగు నెడల జగత్తు నందలి సర్వ వస్తువులును అలణీయములే కావలసి వచ్చును. లోకమున శబ్దార్థములకు గోచరము కావి వస్తు వుండదు. ఈ ధ్వని యనునది "వాచామగోచర" మని చెప్పుట కూడ నొక విధముగా దానిని వివరించుటే అగుచున్నది. ఇది యతిశయోక్తితోఁ గూడి యున్నను ధ్వని తత్త్వము సారవత్తర మని చక్కగా వ్యక్తము చేయుచునే యున్నది. అందుచే అలక్షణీయతా వాద మంగీకరింపఁ దగినది కాదు,

ఈ విధముగా నానందవర్ధనుఁడు ధ్వన్యభావవాదుల వాదములను ఖండించి లక్షణా తాత్పర్యానుమేయముల కంటె వేఱై వ్యంజనా వ్యాపార మొకటి యున్నదనియు. దానిచే ధ్వన్యర్థము స్ఫురింపఁ జేయఁబడు ననియు నిరూపించి. పండితుల కానంద సంధాయకుఁడయ్యెను. ఈ సందర్భమున నతఁడు చూపిన యుక్తిచాతుర్యమునకును ప్రతిభా పాండిత్య విశేషములకును మేరలు లేవు అందుచేతనే

ధ్వని నాతిగభీరేణ కావ్య తత్త్వ నివేశినా
ఆనందవర్ధనః కస్య నాసీ దానందవర్ధనః

అని అతఁడు ప్రశంసింపఁబడి యున్నాఁడు.

## 4. గుణీభూత వ్యంగ్యము-అందలి భేదములు.

గుణీభూత మనఁగా అప్రధాన మని యర్థము. అప్రధానమైన వ్యంగ్య ముకలది (కావ్యము) గుణీభూత వ్యంగ్యము. ఇందు వ్యంగ్యార్థ మప్రధాన మును వాచ్యార్థము ప్రధానమునునై యుండును. అందుచేతనే యిది మధ్యమ కావ్యముగాఁ బరిగణింపఁబడుచున్నది. ఇది యెనిమిది విధములు.

1. **అగూఢము** : గూఢము కాని దగూఢము. కామినీ కుచకలశముల వలె గూఢముగా నున్నప్పుడే వ్యంగ్యము చమత్కారకారియై భాసిల్లును అది అగూఢ

ముగా (సువ్యక్తముగా) నుండుచో నందలి రామణీయకము తగ్గును. అందుచే తనే అది మధ్యమ కావ్య మగును. ఉ॥ "గుణరత్న రోహణ గిరివైన యో ప్రతాప రుద్ర ప్రభూ, నీ యౌన్నత్యమును వర్ణింతునేని నీచైః కృతములైన పర్వతములు నాపైఁ గోపించును. నీ గాంభీర్యమును గీర్తింతునేని సముద్రములు గాధీకృతములై క్షోభిల్లును అందుచే విన్ను వర్ణించుటకు భయపడుచున్నాను. లేదు లేదు. నీ పార్శ్వమం దున్నవాఁడనై నే నగస్త్యుఁడ నైతిని" ఇచ్చట నీ పార్శ్వము నందున్నవాఁడనై అగస్త్యుఁడ నైతి ననుటచే సముద్ర పర్వతముల వలన భయపడుట లేదను వ్యంగ్య మగూఢముగా గోచరించుచున్నది ఏలయన అగస్త్యుఁడు వింధ్యపర్వత గర్వము నడగించుటయు సముద్రోదకముల నొక గ్రుక్కతోఁ గ్రోలి చేయుటయు సుప్రసిద్ధములు.

2. అపరాంగము : మఱొకటి అంగముగాఁ గలది అపరాంగము, రస భావాదులకు రసభావాదు లంగములుగా వర్ణింపఁబడుచో నది అపరాంగ మగును. ఇచ్చట నాది శబ్దముచే భావ, రసాభాస, భావాభాస, భావశాంతి, భావోదయ, భావ శబలతలు సూచింపఁబడుచున్నవి. ఈ విధముగా అపరాంగమున ననేక భేదములుండవచ్చును. కాని యిచ్చట రసమునకు రస మంగముగా నున్న యుదాహరణమే యొసంగఁబడుచున్నది. ఉదా॥ "ప్రతాపరుద్ర భూపాలా ; నీవను మదనునిచే నుద్వేజితులైన శత్రురాజులు సిగ్గు విడిచి మౌనము నుజ్జగించి గాద్గద్యముతోఁ స్వేద ముప్పతిల్ల గాత్రములు కంపింప మూర్ఛ యావరింప కన్నీరోడ్చుచు భీతి సమాలింగితులై శైలగుహాలందుఁ గూడ విజన స్థలమునకుఁ బోవుచున్నారు " ఇచ్చట ప్రతాపరుద్రుని శౌర్యవర్ణనము ప్రకృతము శత్రురాజు లతని శౌర్యముచే భీతిల్లి సిగ్గు విడిచి యాక్రోశించుచు నంగములు కంపింప మూర్ఛాక్రాంతులై కన్నీరోడ్చుచు శైలగుహాలం దేకాంత ప్రదేశమున దాగుచున్నారని యర్థము. ఇందు భయానకరస మంగి, భీతి శబ్దము సంస్కృతమున స్త్రీలింగ మగుటచేతను, స్వేదకంపాదులు సాత్త్విక భావము లగుటచేతను నాయికాలింగితుఁ డగు నాయకుని రహస్య ప్రదేశ గమన మను నప్రస్తుతాంశము ద్యోతిత మగుట నిచ్చట సమాసోక్త్యలంకారము తోఁచు చున్నది. ఈ అప్రస్తుతార్థమున రసము శృంగారము. ఇది అంగము పై యుదాహరణమున ప్రధానమగు భయానక రసమునకు శృంగార రస మంగముగా నున్నది. అందుచే నిది అపరాంగ మగుచున్నది.

3. వాచ్యసిద్ధ్యంగము : వాచ్యార్థ సిద్ధికి అంగమైనది వాచ్యసిద్ధ్యంగము. వాచ్యార్థము కుదురనపుడు వ్యంగ్యార్థము వలన అర్థము కుదురుచో నది వాచ్య సిద్ధ్యంగ మగును ఉదా॥ "కాకతీంద్రుని కరాలమైన కరవాలనవాంబుదము తన ధారచే శత్రువుల యుగ్రమైన ప్రతాపజ్వలనమును శమింపఁ జేయుచున్నది." ఇచ్చట ప్రతాపరుద్రుని కరవాలవర్ణము ప్రధానమైనది. అందుచే ధార యనఁగా కత్తివాదర యనియే ముఖ్యార్థము. కాని యీ యర్థమును గ్రహించినచో కరవాల నవాంబుదము (కత్తియను తొలుకారుమబ్బు) అను రూపకము కుదురదు రూపక ముత్తర పదార్థ ప్రధానము కావున మేఘము వాదరచే ప్రతాపాగ్ని శమింపఁ జేయుచున్నదని చెప్పవలసి వచ్చును. ఇది అసందర్భము. అందుచే ధారా పదమునకు జలధార యను నర్థాంతరమును గ్రహింపవలెను ఇదే వ్యంగ్యార్థము. ఇట్లు గ్రహించినచో వాచ్యార్థము పొసఁగును. ఈ విధముగా నిట వ్యంగ్యార్థము వాచ్యార్థసిద్ధి కంగమైనది కావున నిది వాచ్య సిద్ధ్యంగము.

4. అస్ఫుటము ; స్పష్టముకాని దస్ఫుటము. అనఁగా నది గూఢముగా నుండునది. ఉదా॥ "ప్రతాపరుద్ర భూపాలుని ఖడ్గము మహిమ నిరంకుశమైనది. ఏలయనన నది శత్రురక్తనదిని ద్రావి కీర్తిగంగను ప్రసరింపఁ జేయుచున్నది." పూర్వము జహ్నుమౌని తాను మొదటఁ ద్రావిన గంగనే తిరిగి లోకమునఁ బ్రవహింపఁ జేసెను. అందు విశేష మేమియు లేదు. మఱి ప్రతాపరుద్రుని ఖడ్గమో ఎట్టిని శత్రురక్త నదిని ద్రావి తెల్లని కీర్తిగంగను బ్రసరింపఁ జేయుచున్నది. ఇచ్చట ఖడ్గ ముపమేయము. జహ్నుమౌని యుపమానము. ఉపమానముకంటె నుపమేయమే గుణాధిక్యము కలదిగా వర్ణింపఁ బడుటచే వ్యతిరేకా లంకారము స్ఫురించు చున్నది. కాని యీస్ఫూర్తి ఆలస్యముగను అస్ఫుటముగను జరుగు చుండుటచే నిది అస్ఫుట మగుచున్నది.

5. సందిగ్ధము ; సందేహముతోఁ గూడినది సందిగ్ధము రెండు వ్యంగ్యార్థములు స్ఫురించునప్పు డందేది యుద్దిష్టమైన దను సందేహము కలిగినచో సందిగ్ధమని కొందఱును, వాచ్యార్థ వ్యంగ్యార్థములలో నేది ప్రధాన మను సందేహము కలిగినచో సందిగ్ధమని కొందఱును జెప్పుదురు. ఇందు రెండవదే సరియైనది. ఉదా॥ "కాకతి భూపాలుని దృష్టి అనురాగ తరంగితమై కల్హారమాల

వలె చెలువయున్నత స్తన ద్వయమున లగ్న మైనది" ఇచ్చట ప్రతాప రుద్రుఁడు చెలువ కుచద్వయమును జూడఁ గోరుట వాచ్యార్థము. ఆమెను గౌగలింపఁ గోరుట వ్యంగ్యార్థము ఈ వాచ్య వ్యంగ్యములలో నేది ప్రధాన మను సందేహము కలుగుచుండుటచే నిది సందిగ్ధము.

నరసభూపాలుని సంగరమున నెదిరించు శత్రువులు ముందరగా నరుగుదురు. ఆయితపడుదురు. అత్యంత సంభ్రమమున శరములు విడుతురు'' అను నది నరసభూపాలీయ మందొసంగఁబడిన యుదాహరణము. ఇచ్చట శత్రువులు ''సిద్ధపడుచున్నారు శరములు విడుచుచున్నారు'' అను నప్పుడు బాణములు వేయుచు యుద్ధమునకు సిద్ధపడుచున్నారా బాణములు విడిచివైచి పాఱిపోయి అడవులకరుగ సిద్ధపడుచున్నారా అను రెండర్థములలో నేది యుద్దేసింపఁబడినదో సందిగ్ధముగా నుండుటచే నిది సందిగ్ధ మగుచున్నది.

6. తుల్య ప్రాధాన్యము: సమానమైన ప్రాధాన్యము గలది తుల్య ప్రాధాన్యము. ఇచ్చట తుల్యత వాచ్య వ్యంగ్యార్థములు రెండింటికిని ఉదా॥ రాజులారా, మీరు ప్రతాపరుద్ర దేవుని పాదపద్మములు సేవింపుఁడు. లేనిచో బ్రసన్నమగు నాతని మనసు కలుషాయిత మగును.'' ఇచ్చట పాదపద్మములు సేవింపనిచో ప్రతాపరుద్రుఁడు కోపించు ననునది వాచ్యార్థము. రాజులకు వారి వారి రాజ్యములు విలువ వనియు వారికి నగరములందు వాసము దుర్లభ మనియు వ్యంగ్యార్థము. ఇచ్చట నీ రెండర్థములును తుల్య ప్రాధాన్యములు.

వాచ్య వ్యంగ్యార్థములలో నొకటి ప్రధానము మఱొకటి అప్రధానము నగుసపుడే యేకవాక్యత కుదురునవియు. నారెండింటికిని సమ ప్రాధాస్య ముండుచో వాక్యభేద మేర్పడు ననియు, నందుచే రెండును ప్రధానముగా నుండరాదనియుఁ గొందరి మతము. వారి మతము ననుసరించి తుల్య ప్రాధాన్య మను గుణీభూత వ్యంగ్యభేద ముండదు.

7. అసుందరము: సుందరముకాని దసుందరము. వ్యంగ్యార్థము కంటె వాచ్యార్థమే సుందరమై భాసించినచో నప్పుడది అసుందర మగును. ఉదా॥ ఏకశిలా నగర మందలి స్త్రీలకు నరేంద్ర దర్శనామోదము కలుగుచున్నదని

వినఁగనే గురుజనాధీన మైన వధువు ముఖము నల్లపడినది" ఇట నరేంద్ర దర్శన నిమిత్తమైన హర్షమును భావించుచున్న వధువు ముఖము నల్లపడె ననునది వాచ్యార్థము. గురుజనాధీన నగుటచే నరేంద్రదర్శనమున కే నరుగఁ జాలనైతి ననునది వ్యంగ్యార్థము. ఇచ్చట వ్యంగ్యము కంటె వాచ్యయే సుందర తరముగా నుండుటచే నిది యసుందరము.

8. **కాక్వాక్షిప్తము:** కాకుస్వరముచే నాక్షిప్తమైనది కాక్వాక్షిప్తము. క్రోధశోక విస్మయాదులచేఁ గలుగు భిన్నకంఠ ధ్వనికిఁ గాకువని పేరు. సాధారణముగా వ్యంగ్య కావ్యమున మొదట వాచ్యార్థమును తరువాత వాచ్యసాహాయ్యమున వ్యంగ్యార్థమును స్ఫురించుచుండును. కాకు వున్నచోట వ్యంగ్యము వాచ్యార్థానంతరముకాక వాచ్యార్థము తోడనే స్ఫురించుచుండును. అనఁగా నచ్చట వ్యంగ్యార్థము వాచ్యార్థముచే నాక్షిప్తముకాదు. కాక్వాక్షిప్తమై వాచ్యార్థముతో సమముగా తోఁచును, అప్పుడది కాక్వాక్షిప్తమగును. ఉదా॥ ''చెలి చెప్పుము. భూలక్ష్మి సరస్వతులు నాకంటె నధికలా? గుణవిశేజ్ఞుఁడైన నరపతి వారిని బహూమానించు చున్నాఁడు. ఇచ్చట అధికలా అను పదము నందలి కాకుస్వరముచే అధికలు కారను వ్యంగ్యము స్ఫురించుచున్నది. ఇచ్చట వ్యంగ్యము కాకుస్వరాక్షిప్తమై వాచ్యార్థ విషేధము తోడనే భాసించుచున్నది. కాకు వున్నచోటఁ గూడా వాచ్యార్థము తరువాతనే వ్యంగ్యార్థము స్ఫురించుచో నది ధ్వనియే కాని గుణీభూత వ్యంగ్యము కాదు.

సమాసోక్తి, అక్షేపము, అప్రస్తుత ప్రశంస మున్నగు నలంకారములందు వస్తువ్యంగ్యమును. రూపక తుల్యయోగితా దీపక నిదర్శ నాదులం దలంకార వ్యంగ్యమును గోచరించుచుదుంట నిజమే, అయ్యును అందు వ్యంగ్యములైన వస్త్వలంకారములచేఁ గాక వాచ్యములైన వానిచేతనే సౌందర్యాతిశయము కలుగుచుండుటచే నవి ధ్వనికిఁ గాక గుణీభూతవ్యంగ్యమునకే లక్ష్యములగును. వస్త్వలంకారములును రభావ రసాభాస భావాభాసాదులును అంగాంగి భావముచే నొండొంటిని వ్యంజితము లొనర్చు నప్పుడొక సందర్భమున ధ్వనియు నింకొక సందర్భమున గుణీభూత వ్యంగ్యమును తోఁచుట కవకాశముండును. అప్పుడు నిర్ణయము చేయు టెట్లని శంక కలుగ వచ్చును. అవ

న్నియు నపరాంగములే యయ్యును అచ్చట వ్యంగ్యములైన వస్త్వలంకార రసభావాదుల చేతనే చమత్కారము కలుగు చుండుటచే నివి యుత్తమకావ్యములే యగునని జగన్నాథుఁ డభిప్రాయ పడియుండెను.

## 5. ధ్వని-శ్లేష :

శ్లేష యలంకారములలో నొకటి. శబ్దమునకు నానార్థ సంశ్రయత యున్నచో ననఁగా శబ్ద మనేకార్థముల నొసంగుచో శ్లేషాలంకార మగును. ధ్వని యున్నచోటఁ గూడ మొదట వాచ్యార్థము నొసంగిన పిమ్మట నంతకంటె రమణీయతర మగు నర్థాంతరము స్ఫురించును. ఇది వాచ్య సామర్థ్యము చేతనే ఆక్షిప్త మగుచుండును. అయ్యును అర్థాంతర స్ఫూర్తి యుండును గావున శ్లేష కును దీనికిని భేద మేమను శంక కల్గును. ఆ భేదము నిట్లు సూచింప వచ్చును.

శ్లేష ప్రకృతము, అప్రకృతము, ప్రకృతాప్రకృతము అని మూఁడు విధములు. ప్రకృత శ్లేషమున రెండర్థములును ప్రకృతములే యై యుండును. ఉదా॥ "ఓ నరస భూపాలా ! నీ ధర్మములు పరిణత గుణభరితములును, నిరుపమ తరశాస్త్రకలన నిర్నిద్రములునై యొప్పారు చున్నవి." నీ ధర్మములు (ధనుస్సులు—రాజ్యధర్మములు) పరిణత గుణ భరితములును (మిక్కిలి వంగిన అల్లె త్రాళ్ళతోఁ గూడినవియు-పరిపక్వములై సంధి విగ్రహాది గుణములతోఁ గూడినవియు) నై ప్రకాశించుచున్నవి. అని అర్థము. ఇందొక యర్థము నరస భూపాలుని ధనుస్సులను రెండవది అతని రాజధర్మములను వర్ణించు చున్నది. రెండును నరసభూపాలునికి సంబంధించినవే కావున రెండును ప్రకృతములే. ఇచ్చట ధర్మములను విశేష్యమును పరిణత గుణాది విశేషణములును గూడ శ్లేషించుచున్నవి.

అప్రకృత శ్లేషముల రెండర్థములును అప్రకృతములుగనే యుండును. ఉదా॥ ఈ ప్రతాపరుద్రుఁడు శిరోగృహీత సన్మార్గ స్ఫురత్కటక సంపత్కులైన మహాకుల మహీభృత్తులతో సమానుఁడు" శిరోగృహీత.. తలయందు గ్రహింపఁబడిన సాధుమార్గము కలవారును (శిఖరములచే గ్రహింపఁబడిన నక్షత్ర మార్గము కలవియును) ప్రకాశించు నలంకారముల సంపదగలవారును (ప్రకాశించు చరియల సంపద కలవియును) అగు మహాకుల ... ఉన్నత కులము గల

(హరిశ్చంద్రాది) రాజులతో (ఎత్తైన కులపర్వతములతో సమానుఁడని యుందలి యర్థములు. శిరోగృహీత...అను విశేషణ మందలి రెండర్థములలో నొకటి హరిశ్చంద్రాది రాజులకును, మఱొకటి కులపర్వతములకును సంబంధించి యున్నవి. ఈ రెండును అప్రకృతములే (రాజపర్వతములు) యయి యుండుటచే నిది అప్రకృతశ్లేష. ఇచ్చట కూడ విశేష్య (రాజకుల పర్వతములు) విశేషములు (శిరోగృహీత-) రెండును శ్లేషించుచున్నవి. ఇచ్చట విశేష్యములు శ్లేషించుట యైచ్ఛికమని పండిత రాయల అభిప్రాయము.

పకృతా ప్రకృతశ్లేషలో శ్లిష్టపదము లందలి యర్థములలో నొకటి ప్రకృతమునకును రెండవది అపకృతమునకును సంబంధించి యుండును. ఉదా॥ అరిదర కరుఁడును సుమనోవర భరణ ధురీణుఁడును లక్ష్మిస్థిరవాస భాసురుఁడును నై నరసభూపాలుఁ డాదినరసింహుఁ డనఁ బ్రకాశించు చున్నాడు. నరసభూపాలుఁడు శత్రువులకు భయము కలిగించు వాఁడును, పండితశ్రేష్ఠులను భరించుటందు సమర్థుండును, రాజ్యలక్ష్మికి స్థిరమైన నివాసమునునై ప్రకాశించు చున్నాడు. ఇది ప్రకృతార్థము; నరసింహమూర్తి చక్రము. శంఖము కరము లందుఁ గలవాఁడును, దేవతల ప్రభువైన యింద్రుని రక్షించుటయందు నమర్థుఁడును లక్ష్మిదేవికి స్థిరమైన నివాసమునునై ప్రకాశించు చున్నాఁడు. ఇది అప్రకృతార్థము. ఇట నర్థములు ప్రకృతా ప్రకృతములు రెండింటికి సంబంధించిన వగుటచే నిది ప్రకృతా ప్రకృతశ్లేష. ఇందు విశేషణములే కాని విశేష్యములు (నరసింహుఁడు ఆదినరసింహుఁడు) శ్లేషించి యుండలేదు.

"ప్రతాపరుద్రుని క్షోణీ పాణిగ్రహణోత్సవమును విని రాజులంగుష్ఠముతోఁ బాద పీఠిని గిరుచు నతానను లైరి" అను దానియం దర్థశక్తి మూలమైన ధ్వని యున్నది. ప్రతాపరుద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడు కాఁగానే యితర రాజులు భయ విషాదాదులను బొందిరను వస్తువిచ్చట వ్యంగ్యమగుచున్నది. ఇచ్చట శబ్దముల నేకార్థత్వము లేదు అనఁగా శ్లేషించుటలేదు అయ్యును రమ్యతరమైన అర్థాంతరము స్ఫురించుచున్నది. దీనిని ప్రతిభచే గ్రహింప వలయునే కాని నిఘంట్వాదుల సాహాయ్యముచే గ్రహింప వీలులేదు. శ్లేష యున్నచోట నిఘంట్వాదుల

సాహాయ్యమున రెండర్థముల నెవ్వరైన గ్రహింప వచ్చును. అందుచే నర్థశక్తి మూలధ్వని శ్లేష యని భ్రమించుట కవకాశము లేదు.

శబ్దశక్తి మూల ధ్వనిలో నట్టి అవకాశమున్నది. "జగత్పతియు రాజ మౌళియు నగు రుద్రదేవుఁడు విజితారి పురుఁడును మూర్తి విలస త్పర్వమం గళుఁడునునై ప్రకాశించుచున్నాడు." ఇందు శబ్దశక్తిమూలధ్వని యున్నది. జగ త్పతియు రాజశ్రేష్ఠుఁడునగు ప్రతాపరుద్రుఁడు జయింపఁబడిన శత్రువుల పుర ములు గలవాఁడును, మూర్తియం దొప్పారు సకలశుభములు గలవాఁడునై జయింపఁబడిన త్రిపురములు గలవాఁడును మూర్తియం దొప్పారు పార్వతి గల వాఁడునునై జగన్నాయకుఁడును చంద్రశేఖరుఁడునగు రుద్రునివలెఁ ప్రకాశించు చున్నాఁడని యిం దుపమాలంకారము ధ్వనించుచున్నది. ఇందన్ని శబ్దముల కును రెండర్థములున్నవి. విశేషణములు రెండును శ్లేషించు చున్నవి దీనినే "విజితారి పురుషుఁడును, మూర్తి విలస త్పర్వమంగళుఁడును, రాజమౌళియు నగు ప్రతాప రుద్రుఁడు రుద్రునివలెఁ బ్రకాశించుచున్నాఁ" డని చెప్పినచో శ్లేషా లంకార మగును ఇచ్చట విశేషణములే కాని విశేష్యములు శ్లేషించుట లేదు. మఱియు రుద్రునివలె అని యుపమాలంకారము వాచ్యముచేయఁబడినది. ప్రకృతా ప్రకృత శ్లేషలోని విశేషణములు మాత్రమే శ్లిష్టములైయుండ నర్థశక్తి మూలధ్వనిలో విశేషణ విశేష్యములు రెండును శ్లిష్టములైయుండును. శ్లేషలో నలంకారము గాని వస్తువు గాని వాచ్యమై యుండ నర్థశక్తి మూలధ్వనిలో నవి వాచ్యములు కాక వ్యంగ్యములై యొప్పారును.

ప్రకృత శ్లేషయందును అప్రకృత శ్లేషయందును రెండర్థములును ప్రకృతములే యగుటచే వానివి అభిధాశక్తియే బోధించును. అచ్చట ప్రకరణ నియమముండదు. ప్రకరణాదులచే నెచ్చట నొక యర్థము ప్రకృతముగను మఱొక యర్థమప్రకృతముగను దోఁచునో అట్టిచోట శబ్దశక్తి మూలధ్వని యగును ఉదాహరణ మునకు రాఘవ పాండవీయమును దీసికొందము. ఇందు ప్రతి పద్యమునకును రెండర్థములుండును. ఒకటి భారతపరమైనది; వేఱొకటి రామాయణ పరమైనట్టిది. భారతార్థమును గ్రహించు నప్పుడు రామాయణార్థ ముతోఁ బ్రసక్తియే లేదు. అట్లే రామాయణార్థమును గ్రహించు నప్పుడు భారతా

ర్థముతోఁ బ్రసక్తియుండదు. దేనిని గ్రహించునప్పుడా యర్థము నభిధా శక్తియే బోధించును. అప్పుట శబ్దమాత్ర సామ్యమే గోచరించును. అందుచే నప్పుట శ్లేషయేకానిధ్వనికాదు. వసుచరిత్ర మునందుఁగూడఁ బెక్కు పద్యములకు రెండర్థములు స్ఫురించును. అందొకటి ప్రకృతార్థము రెండవది అప్రకృతార్థము. అప్పుట నభిధా శక్తియే ప్రకృతార్థమును బోధించును. అప్రకృతార్థ బోధనకొఱకు వ్యంజనా శక్తి తప్పని సరియగును. ఏలయన వాచక శబ్దమునకు సంయోగాదులచే నొక్క యర్థమే నియతమైయుండును ఈ విషయమున మమ్మటుఁడు "అనేకార కమైన శబ్దమునకు సంయోగాదులచే వాచకత్వము నియంత్రితమై యుండ నర్థాంతరమును (అవాచ్యార్థమును) వ్యంజనయే బోధించు" నని చెప్పియున్నాఁడు.* అందుచే నట్టియెడ ప్రకృతా ప్రకృత శ్లేష రాక అర్థశక్తి మూల ధ్వనియే యని చెప్పవలయును. ధ్వన్యాలోకము ననుసరించి అప్రకృతార్థమును గూడ నభిధయే బోధించును. ఆ మతమున శబ్దశక్తి మూలాలంకార ధ్వనియే కాని శబ్దశక్తి మూలవస్తుధ్వని లేదు. అందుచే వసు చరిత్ర మందున్నది శ్లేషయే కాని ధ్వని కాదు. కాని అట్టియెడ విశేష్యశ్లిష్టత్వా శిష్టత్వములను బట్టి అది శ్లేషయో ధ్వనియో నిర్ణయింపవచ్చును.

శ్లేషయందు రెండర్థములును ప్రకృతములును వాచ్యములును అగుటచే అందవి విధిరూపములో నిషేదరూపములో అయి యుండును. ధ్వనియందు వాచ్యము విధిరూపమున నుండ వ్యంగ్యము నిషేధ రూపమున నుండవచ్చును. అది నిషేదరూపమున నుండ విది విధి రూపమున నుండవచ్చును.

రసధ్వనిలో శ్లేషకు ప్రసక్తియే లేదు. రస మెప్పుడును వ్యంగ్యముగనే యుండును గాని వాచ్యముగా నుండదు. విభావానుభావాదుల సమ్యగ్వర్ణనముచే రసము ప్రతీయమానమగును. అందు శబ్దమునకు రెండర్థములను గల్పింపవలసిన పని లేదు.

శ్లేషయందు దర్థశ్లేశమే కాని చమత్కార ముండదు. వ్యంగ్యము నందుఁ గూడఁ గ్లేశ మున్నను చమత్కారము పుష్కలముగా నుండును. ఒకటి, అంగము రెండవదంగి ఒకటి. అలంకారము; రెండవ దలంకార్యము రెండును భిన్నములు.

* అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రి
సంయోగాద్యై రవాచ్యార్థ ధీకృద్వ్యాపృతి రంజనమ్.

# 5. గుణరీతి వృత్త్యాది సోపానము

## 1. గుణములు :

కావ్యమునకు శబ్దార్థములు శరీరము. రసమాత్మ. గుణాలంకారములు వరుసగా నంతర్బహి స్సౌందర్య సంవర్ధకములు. శౌర్య ధైర్యాది గుణము లాత్మధర్మములైనట్లే మాధుర్యాది గుణములు రసధర్మములు. రసములకును గుణములకును అవినాభావము. అనగా రస మున్నచోట గుణములును గుణములున్నచోట రసములును ఉండును. గుణముల స్వరూప స్వభావములను నిర్వచించు విషయమునను సంఖ్యను నిర్ణయించు విషయమునను మత భేదములున్నవి. భరతుడు నాట్య శాస్త్రమున తొలుత దోషములను వివరించి వానికి విపరీతములే గుణములని చెప్పెను. అగ్ని పురాణము కావ్యమున కధికశోభ కలిగించునవి గుణములని నిర్వచించి శబ్దమునకు శోభ గూర్చునని శబ్దగుణములనియు, శబ్ద ప్రతి పాదితమైన వస్తువునకు శోభగూర్చునని అర్థగుణములనియు, శబ్దార్థములు రెండింటికి శోభగూర్చునవి ఉభయగుణములనియు తెల్పియుండెను. దండి విశిష్ట రచన గల పదావళికి గుణములు ప్రాణముల వంటివని తెల్పియందు గొన్నిటిచే వైదర్భీ రీతియు కొన్నిటిచే గౌడి రీతియు నేర్పడునని వ్యక్తముచేసెను వామనుడు కావ్య శోభాకరములైన ధర్మములు గుణము లనియు తదతిశయ హేతువు లలంకారములనియు నందు గుణములు నిత్యము లనియు నలంకారము లనిత్యము లనియు వెల్లడించెను. మమ్మటుడు శౌర్యాదు లాత్మకువలె రసమున కుత్కర్షాపాదకములై స్థిరముగా నుండు ధర్మములు గుణములని విశదీకరించెను లోకమున ఈరచన మధురము ఈరచన ప్రసన్నము అను వ్యవహార ముండుటచే మాధుర్యాది గుణములు రచనా ధర్మములని భావింప నక్కఱలేదు. అవి రసధర్మములే రసధర్మము రచనయం దారోపింపబడుటచే నట్టి వ్యవహార మేర్పడినది.

గుణము లెన్నియను విషయమున గూడ మత భేదములున్నవి. భరతుడు నాట్యశాస్త్రమున పది గుణములను పేర్కొని వానికి లక్షణము లొసంగెను. భామహుడు దశగుణములను పేర్కొన్నను అందు మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అను మూడే ముఖ్యములనితెల్పెను. దండి పది గుణములను

గ్రహించి వానిలోఁ గొన్నింటితో వైదర్భీ రీతియుఁ గొన్నింటితో గౌడీ రీతియు నేర్పడునని వ్యక్తపఱిచెను. వామనుఁడు కూడ దండి గ్రహించిన పది గుణము లను గ్రహించి శబ్దార్థ భేదములచే వాని నిరువది గావించెను. ఇతఁడును గుణముల చేతనే రీతులేర్పడునని యభిప్రాయపడెను. అగ్నిపురాణము శబ్దగతములు, అర్థగత ములు ఉభయగతములు అని గుణములను వివరించి శ్లేషాదులతో మఱి కొన్నిటిని గలిపి మొత్తము పందొమ్మిదింటిని పేర్కొనెను. ఆనందవర్ధనుఁడు భామహుని వలె మాధుర్యౌజః ప్రాసాదములను మూఁడు గుణములనే గ్రహించి అవి రసధ ర్మములని నిర్ణయించెను. మమ్మటుఁడు కూడ పైమూఁడే గుణములనియు, నిత రగుణములు కొన్ని వానిలోనే అంతర్భవించు ననియు, కొన్ని దోషత్యాగము వలననే సరిపడుననియు, కొన్ని దోషత్వగమునే భజించు ననియుఁ దెల్పెను. విద్యానాథుడు అర్థగుణము లుండవని తెల్పి భోజుఁడు చెప్పిన యిరువది నాలుగు శబ్దగుణములను మాత్రము గ్రహించెను. పీయూషవర్షుఁడు గుణము లెనిమిదే యని తెల్పెను, అతఁడు కాంతిని శృంగార మందును, అర్థవ్యక్తిని ప్రసాదము నందును అంతర్భవింపఁజేసెను. జగన్నాథుఁడు మాధుర్యౌజః ప్రసాద గుణ ములు మూఁడింటినే గ్రహించి సామాజికుని చిత్తమందుఁ గలుగు ద్రుతి, దీప్తి, వికాసము అను చిత్తవృత్తులే క్రమముగా నాగుణములగు ననియు, ఆయాగుణ ములతోఁ గూడిన రసమును జర్వణము చేయుటవలన నా చిత్తవృత్తు లేర్పడు ననియుఁ దెలిపెను భట్టుమూర్తి నరసభూపాలీయమున సర్వవిషయములందును ప్రతాపరుద్రీయమునే అనుసరించినను గుణముల విషయమున మాత్రము దాని ననుసరింపక వామనుఁడు చెప్పిన పది గుణములనే పేర్కొని లక్షణము రొసం గెను. అతఁడే కాదు: పలువురు లాక్షణికులు వామనుఁడు చెప్పిన శబ్దార్థ గుణ ములు అసంకీర్ణములై లక్ష్య లక్షణ సమన్వితము లగుటచేఁ గాఁబోలు వానినే గ్రహించి అనుసరించుటయో ఖండించుటయో కావించి యుండిరి.

గుణములు పదియని చెప్పిన వారు కూడా వానిని నిర్వచించుటలో భిన్నాభి ప్రాయములు ప్రదర్శించిరి. శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమా ర్యము, సమత, అర్థవ్యక్తి. ఉదారత, కాంతి, ఓజస్సు, సమాధి అను నవి యాపది గుణములు.

1. శ్లేషము: సంధిని గూడి పదము లొకే పదముగా నొప్పారినచో శ్లేషము సంధిని గూడుట వలననే కాక యేకస్థానీయములగు వర్ణము లధికముగా

నుండుట వలన అవి ఏకపదముగా భాసించునప్పుడు కూడ శ్లేషమే. దీనిని విద్యానాథుఁడుశ్లిష్టపదత్వ మనియు, వామనుఁడు మసృణత్వ మనియుఁ జెప్పియుండిరి.

ఉదా॥ "అలావణ్య మగణ్య, మాగుణగణం బవ్యాజ, మాతేజము
ద్వేలం, బావినయం బమేయతర, మావీర్యం బనిర్వాచ్య మా
యాలాపం బతిసత్య, మావితరణం బాశాంత విశ్రాంత, మా
శీలం బార్జవయుక్త, మెన్నఁదరమే శ్రీనారసింహాధిపున్"

2. ప్రసాదము: ప్రసిద్ధార్థములైన పదములతోఁ గూడి యుండుట ప్రసాదము. ఎచ్చట పదములు ఝటిత్యర్థ సమర్పకములై యుండునో అచ్చట ప్రసాదగుణ ముండును. వామనుఁడు బంధ శైథిల్యము ప్రసాదమని నిర్వచించి అది ఓజోగుణ మిశ్రితమై యుండవలెనని తెల్పెను.

ఉదా॥ "ముంగిటి పెన్నిధాన. మిలుముందటి కల్పక, మర్థికోటి ముం
గొంగుఁబసిండి, చెంగటన కూడిన బంగరుకొండ, దొడ్డిలో
నం గలకామధేను, వదనం బెరయీగలు లేని చొక్కపుం
దంగెటిజున్ను నీవితరణంబు నృసింహనృపాల శేఖరా"

3, మాధుర్యము: వాక్యమునందలి పృథక్పదత్వము మాధుర్యము. దీర్ఘ సమాసములు లేకుండ సరసములైన పదములను గూర్చుచో మాధుర్యగుణ మొప్పారును. సరసములైన వాక్కులు గలిగియుండుట మాధుర్యమని దండి గావించిన నిర్వచనము.

ఉదా॥ "పంకజపాణి శంఖ పరిభావక కంధర తల్లి యేలోకో
పంకులు గట్టె నంచుఁ గులశైల సుతాగ్రణి పాయఁద్రోచి ర
త్నాంకిత హారముంచ బరువానునొ బిడ్డకివేల కర్కశా
లంకృతులంచు హల్లక కలాపము లుంచు నదీలలామయున్"

4. సౌకుమార్యము: సుకుమారాక్షర ప్రాయమైనది సౌకుమార్యము. సుకుమారత్వ మనఁగా సానుస్వార కోమల వర్ణత్వము. "అరయఁగ బొట్లు పిఱుందల నరుదగునది సౌకుమార్యమగు" నని నరసభూపాలీయము అనిష్ఠురాక్షర ప్రాయమైనది మాధుర్య మని దండి నిర్వచనము. అర్థమునం దపారుష్యము కూడ సౌకుమార్యమే.

ఉదా॥ "చెందొవ విందు మందువలెఁ జిందు రుచిం దగఁ, జందునంబు వె
చ్చందన మొందు, నిందుముఖి చందము డెందమునం దలంప నీ
యందము నందె నందనమునందు మిళిందము పొందు పొందికం
జెందె, నృసింహ! కౌఁగిటను జేర్పుము, ముందుగ మందగామినిన్"

5. సమత: నాల్గు పాదములందు లలితమగు నర్థముకాని శబ్దబంధము కాని యొకే విధముగాఁ గూర్పఁబడుచో నది సమత. వైషమ్యము లేకుండఁ జెప్పుట సమతయని ప్రతాపరుద్రీయము. మార్గాభేదము (అనగా మొదట నుప క్రమించిన మార్గమునే తుది దాఁక విడువ కుండుట) సమత యని వామనుఁడు, అవిషమ బంధత్వము సమత యని దండి నిర్వచనము. విద్యానాథు నిర్వచనమును నిదియు నొక్కటే,

ఉదా॥ "శర వేగములు లేవె చలయంత్ర పాఠీన
పాటన క్రియకు నేర్పడవు గాక
చాతుర్యములు లేవే శారదా భండార
చోరకార శ్రీకిఁ జొరవుగాక" మొద.

6. అర్థవ్యక్తి : సంపూర్ణ వాక్యత్వ మర్థవ్యక్తి. అర్థ ప్రతిపాదనమున వాక్యము నిరాకాంక్షమై పరిపూర్ణమై యుండుట అర్థవ్యక్తియగును. అర్థమున నునే యత్వ మర్థవ్యక్తి యని దండి. దీని కర్థదీపన మనియు మఱియొక పేరు.

ఉదా॥ "నరసభూపాలః లోకమునందలి యేనుఁగుల నన్నిటిని ఐరావత సదృశములుగను, గుఱ్ఱములనెల్ల నుచ్చైశ్శ్రవ స్సదృశములుగను, చెట్లనెల్లఁ గల్పవృక్ష సదృశములుగను, నదుల నెల్ల గంగా సదృశములుగను జేసి వ్వర్గ సృష్టికి బ్రతి సృష్టి చేయుకీర్తి కౌశిక గోత్ర పావనుఁడవైన నీకే తప్ప నన్య నృపులకుఁ దగునా?"

7. ఔదార్యము : వికటాక్షర బంధత్వ మౌదార్యము. ఇది యున్నచోట పదవిన్యాసము నర్తన బుద్ధి నుత్పాదించుచు నాయా యర్థముల స్ఫురింపఁ జేయు చుండును. ఉత్కృష్ట గుణములతోఁ గూడిన వాక్కు గలిగి యుండుట యుదారత యని దండి. కతిపయ సంయుక్తాక్షర వితత మౌదార్య మగునని నరసభూపాలీయము.

ఉదా॥ "లలితంబులగు మట్టియల చప్పు డింపార
నంచకైవడి నడ నల్ల వచ్చి"

8. కాంతి : అత్యుజ్జ్వల బంధత్వము కాంతి. "విమల విచిత్రాయత వర్ణా వృత్తులు గల యతిమృదు బంధంబు కాంతి యగు" నని నరసభూపాలీయము. దండి దీనిని లౌకికార్థాశ్రయణత్వమని నిర్వచించెను. ఇది లేనిచోఁ గవి కావ్యము పురాతన చిత్రస్థానీయ మగును.

ఉదా. "ననయమ్మ వానిఁ గన్న నయమ్మగల యింతి
ననయమ్ముఁ దాల్చు వానన్నఁ దెగడి"

"నన + అమ్మ + వానిన్ = మన్మథుని; వాని + అన్న = వానన్న; లక్ష్మీ దేవిని సంతతము దాల్చు కృష్ణుని యన్నయైన బలరాముఁ దిరస్కరించి" యని కీర్తుల వర్ణనము.

9. ఓజస్సు: విలసిత సమాస భరితోజ్జ్వల బంధం బోజ మయ్యె" నని నరసభూపాలీయము సమాస భూయస్త్వ మోజమని ప్రతాపరుద్రీయము దండి కూడ దీని నిట్లే నిర్వచించెను. వర్గాక్షరమునందలి ప్రథమ తృతీయ వర్ణములు వరుసగా ద్వితీయ చతుర్థ వర్ణములతోఁ గలసినను (చ్ఛ,గ్ఘ మొద,) రేఫయోగము కాని తుల్యాక్షర యోగము కాని (ర్క—క్ర—ర్త—త్ర) టవర్గాక్షరములు కాని శష వర్గములు కాని దీర్ఘ సమాసములు కాని యున్నను గాఢబంధమైన ఓజోగుణ మేర్పడునని మమ్మటుఁడు.

ఉదా. "రాజమాత్రుండె వసుధాధిరాజ్యమతుల
నికట వికట మహానిల నికర సుకర
మధుకర కరంబి తాంఘ్రి పద్మ ద్వయుండు
నరస గుణహారి యోబయనరసశౌరి."

10. సమాధి : అన్య ధర్మముల నన్యత్ర ఆరోపించుట సమాధి. "అన్య గుణంబులు వేతొక్కటిపై సలరింప సమాధియయ్యె" నని నరసభూపాలీయము. దండి కూడ సమాధి కీ నిర్వచనమే యొసంగి యుండెను. వామనుఁ డారోహావరోహ క్రమము సమాధియని తెల్పెను. ఆరోహమున గుర్వక్షరములును అవరోహమున లఘ్వక్షరములును అధికముగా నుండుట.

ఉదా. "అలబలీంద్రుని చేత నడుగు వెట్టఁగ నేర్చి
ధారాధరము చేత నీరు మోసి

ధరణిఁ బ్రోది వహించిన దాన కన్య
సకల యాచక బాంధవుల్ సంతసిల్ల
నీ కరగ్రహణావాప్తి నెరసె నౌర
వైరి గజసింహ! యోబయ నారసింహ."

ఇట నడుగు పెట్టుట, నీరు మోయుట అనునవి క్రమముగా బలికిని వేష మునకును సంబంధించిన ధర్మములు. ఇవి దానకన్యయం దారోపింపఁబడినవి. వామనుని లక్షణమునకీ క్రింది పద్యమును లక్ష్యముగాఁ జూపవచ్చును.

"ఆ మందిడి యాతఁ దరిగిన
భూమీసురుఁ దరిగెఁ దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝ నిరీ క్షాపేక్షన్"

## 2. రీతులు.

విశిష్టమైన పదరచనకు రీతి యని పేరు. దేశమందలి యన్ని ప్రాంతముల వారును ఒకే విధముగా పదరచన కావింపరు. అది వారి వారి అభిరుచుల నాశ్రయించి యుండును. స్థానభేదముచే రీతులు మాఱుచుండును. గావున నాయా స్థానములను లేక దేశమును బట్టి రీతులకు నామము లేర్పడినవి. భామహునికి పూర్వము వైదర్భి. గౌడి అను రెండే రీతు లుండెననియు. నందు వైదర్భి యుత్తమమని. గౌడి అధమమని భావింపఁబడుచుండె ననియుఁ దెలియుచున్నది. భామహుఁడీయుత్తమాధమ భేదము సంగీకరింపక వక్రోక్తి యున్నచో నేరీతి యైనను గ్రహింపఁదగినదే యని వ్రాక్రుచ్చెను, దండి రీతికి బదులు మార్గము, వర్త్మము అను శబ్దములను వాడి యుండెను. అతఁడు వైదర్భి గౌడి అను రెండు మార్గములనే గ్రహించి అవి గుణములచే నేర్పడునని వచించెను, వామనుఁడు వైదర్భీ గౌడులతో పాటు పాంచాలిని కూడ నంగీకరించి రీతియే కావ్యమున కాత్మ యనియు, నది గుణములచే నేర్పడు ననియు, నలంకారములు కావ్య సౌందర్యమును పెంపొందించు ననియు వ్రాక్రుచ్చెను. రుద్రటుఁడు లాటీయ యను నాల్గవరీతిని కూడ పేర్కొనెను, భోజుఁడు సరస్వతీ కంఠాభరణమున ఆఱు రీతులను వివరించెను. అతఁడు రుద్రటుఁడు చెప్పిన

నాలుగు రీతులకు మాగధి, అవంతి అను వానిని గూడ కలిపెను శారదాతన యుఁడు ప్రతిపురుషుని బట్టియుఁ బ్రతివచనమును బట్టియు రీతులు భేదిల్లుచుండు ననియు, కొంద అవి నూటైదు విధములని తెల్పినను ప్రధానముగ నాల్గింటిని మాత్రము అంగీకరింప వచ్చుననియుఁ దెల్పెను. గ్రంథ కర్తలను బట్టి రీతు లేర్పడునని అతని అభిప్రాయము. కాని అది పొరపాటు. ఏలయన రీతులు రసా నుకూలముగా నుండునే కాని కర్తలను బట్టి ఏర్పడవు. విద్యానాథుఁడును నరస భూపాల కర్తయు వామనమతము ననుసరించి మూఁడు రీతులనే గ్రహించిరి.

మతమును మొదట వెల్వరించిన వాఁడు దండియే యైనను హేతువాద బలముతో దానిని సిద్ధాంతీకరించిన వాఁడు వామనుఁడే. అతఁడు విశిష్టమైన అనఁగా గుణసహితమైన పదరచనయే రీతి యనియు, సన్నని దారములచే రజ్జు నేర్పడునట్లు గుణముల సముదాయముచే రీతి యేర్పడు ననియు, నదే వాక్యాత్మ యనియు నభిప్రాయపడెను. అతని మతమున రసమునకుఁ గాక రీతికే ప్రాధా న్యము ఆనంద వర్ధనుఁడు రీతివాదము నంగీరింపక కావ్యమున కాత్మ వస్త్వ లంకార రసరూపమైన ధ్వనియే యనియు శౌర్యధైర్యాదిగుణము లాత్మ ధర్మము లైనట్లు మాధుర్యాది గుణములను వానిచే నేర్పడు రీతులును గూడ రస ధర్మ ములే యనియు వివరించెను అతఁడు రీతిని సంఘటన యని పేర్కొని యది సాధారణముగా రసమును బట్టియే యుండినను ఒక్కొక్కప్పుడు వక్తృ. వాచ్య ప్రబంధముల యౌచిత్యమును బట్టియు నేర్పడు చుండునని తెలిపెను. ఇచ్చట వక్తృవాచ్య ప్రబంధముల యౌచిత్య మనఁగా వాని నాశ్రయించిన రసములని భావము వక్తయనగా నాయకుఁడు. వాచ్య మనఁగా వర్ణనీయ విషయము ప్రబంధ మనఁగా కావ్య భేదము. నాయకులను, వర్ణనీయ విషయములను, ఆయా కావ్య భేదములను ఆశ్రయించిన రసముల కనుకూలముగా సంఘటన యుండవలె నని తాత్పర్యము. పాశ్చాత్యులలోఁ గూడ డెమిట్రియస్, ముర్రే మొదలగు వారు శైలి (Style) వక్తృ వాచ్యముల ననుసరించి యుండునని తెల్పియుం డిరి కేశవమిశ్రుఁడు కూడ రీతులు తత్తద్రసోపకారకములై యే యుండవల యునని సూచించెను పింగళి సూరన్న, "రసభావములకు సర్వాంబుగ వైదర్భి మొదలైన రీతు లిమ్ముగ నమర్చి" యనునప్పుడు రీతులు రసభావానుకూలము లుగనే యుండ వలెనని భావించెను కాని కొందఱు ప్రబంధ కర్తలాంధ్రమున వక్తృ వాచ్య ప్రబంధౌచిత్యముల కనుగుణముగా తులను సంఘటించి యుండ

లేదు. వారు వానితో సంబంధము లేకుండెనే యన్ని సందర్భములందుమ దీర్ఘ సమాసములను వాడి యుండిరి. కొందఱు రౌద్రాదుల సందర్భమునఁ గూడ నసమాసమైన రీతినే ప్రదర్శించిరి ఇట్టి రచన అలంకారిక మతమును బట్టి దోషమే యగును. అచ్చటి యాయా రీతు లాయా రసములను వక్త్తము చేయ సమర్థములై యుండక పోవుటయే యందుకుఁ గారణము.

విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమున గుణాశ్లిష్ట పద సంఘటనయే రీతి యని చెప్పినను అది రసానుకూలమై యుండవలెనని నిర్దేశించి యుండలేదు. దండివామనులు గుణరీతి వాదముల నంగీకరించిన వారే కావి రస ప్రాధాన్య వాదులు కామిచే గుణములను గాని వానిచే నేర్పడు రీతులను గాని రసములతో మేళవించి యుండలేదు. కాని రసధర్మములైన గుణములును వానిచే నేర్పడు రీతులును రసానుగుణములుగనే యుండుట యుక్తము.

వైదర్భి, గౌడి, పాంచాలి అని రీతి మూఁడు విధములు. బంధ పారుష్య రహితయు, శబ్దకాఠిన్య వర్జితయు, నాతిదీర్ఘ సమాసయునగు రీతి వైదర్భి ఈరచన యందు సమాసము ఉండనే యుండవు ఉన్నచో నాతి దీర్ఘములుగా నుండును.

ఉదా॥ "ఆడుదానియెదుట-నదిగాక యేలిక
రాణియెదుట సమరవాణి తనకు
సపిగ రాని వెలితి సర్వంసహాపతి
యెదకు వాఁడికత్తి పదను కోఁత" ఆంధ్రపురాణము.

ఇందు బంధ పారుష్యముగాని, శబ్దకాఠిన్యము కాని దీర్ఘ సమాసములు దాని లేమిచే నిది వైదర్భీరీతి. పరుషాక్షరముల తోడను, దీర్ఘ సమాసముల తోడను గూడిన రీతి గౌడి. ఇది ఓజః కాంతి గుణములచే నేర్పడును

ఉదా॥ "అంభోరాశి గభీర ! యోబయ నృసింహా ! నీరణోదస్తదో
స్తంభోత్తంభిత జృంభితాసి లతికా సంరంభ సంభావనా
దంభానర్గళదుర దుర్గమ మదోద్యద్దుష్టదృష్టారిరా
ట్పుంభ చ్ఛుంభ నిశుంభ సంభ్రమ హర స్ఫూర్తిన్ విడంబించురా."

ఇది పరుషాక్షరబంధముతోడను, దీర్ఘసమాసముల తోడను గూడి యుండుటచే గౌడి. వైదర్భి గౌడీ రీత్యుభయ లక్షణములను అవఁగాఁ గొంత మృదురచనయుఁ గొంత పరుష రచనయుఁ గలది పాంచాలి.

ఉదా॥ "చేసెడి చేఁతలందుఁ గవిసింహుని దీవన లూఁత మీయఁగా వ్రాసెడి వ్రాఁత లందు నృప వల్లభు నాదృతి మూదలింపఁగా
జెసెను నన్నిభట్టు రససింధు మహాంధ్ర కవిత్వ రాజ్యమున్
వ్రాసెను రాజరాజు గుణవత్సరి పాలన కావ్యబంధమున్"

ఆంధ్ర పురాణము

ఇందు ప్రథమార్థమున మృదుబంధముతోఁ గూడిన వైదర్భియు ద్వితీయార్థమున పరుషబంధముతోఁ గూడిన గౌడియుఁ గలసియుండుటచే నిది పాంచాలీరీతి.

ప్రతాపరుద్రీయము శృంగార కరుణములతిసుకుమారములనియు, రౌద్ర బీభత్సము లత్యుద్ధతములనియు, హాస్య శాంతాద్భుతములు కించిత్సుకుమారములనియు, వీరభయానకము లీషత్ప్రౌఢము లనియు నాయారసముల స్వభావములను దెలిపి యుండెను. దీనినిబట్టి శృంగారకరుణములకు వైదర్భీ రీతియు, రౌద్ర బీభత్సములకు గౌడీరీతియు,దక్కినరసములకు పాంచాలీరీతియు మిక్కిలి యనుకూలములుగా నుండునని భావింప వచ్చును.

## 3. వృత్తులు :

వ్యవహారమే వృత్తియని అభినవగుప్తుఁడు నిర్వచించెను. వ్యవహార మనఁగా నాయికా నాయకాదుల వ్యాపారము. సరస్వతీకంఠాభరణవ్యాఖ్యలో రత్నేశ్వరుఁడు కూడ "చిత్తమునకు వికాస విక్షేప వికాసములు కలిగించు వ్యాపారమే వృత్తి" యని నిర్వచనము కావించెను. ఈ వ్యాపారము శబ్దాశ్రితము అర్థాశ్రితము అని రెండువిధములు.శబ్దాశ్రిత వ్యాపారము శబ్దవృత్తి. అర్థాశ్రితమైన దర్థ వృత్తి. శబ్దవృత్తి-అభిధావివృత్తులు,ఉపనాగరికాది వృత్తులు అని రెండు విధములు. వీనిలో అభిధాది వృత్తులు ధ్వని సోపానమున వివరింపఁబడినవి. ఉపనాగరికాది వృత్తు లిప్పుడు వివరింపఁబడును.

ఉద్భటు ననుసరించి ఉపనాగరిక, పరుష, గ్రామ్య లేక కోమల అనునవి మూఁడును ఉపనాగరికాది వృత్తులు. ఇవి మొదట అనుప్రాసము నాశ్రయించి యుండెను. ఇచ్చట వృత్తి అనఁగా నియతములైన వర్ణములందుండు రస విషయ వ్యాపార మని యర్థము.రుద్రటుని మతము ననుసరించి మధుర, పరుష, ప్రౌఢ, లలిత, భద్ర అని వృత్తులైదు విధములు, మమ్మటు డుద్భటుఁడు

చెప్పిన మూఁ డుపనాగరికాది వృత్తులను వామనాదుల వై దర్భీ గౌడీ పాంచాలీ రీతులలో సంతర్భవింపఁ జేసెను. అభినవగుప్తుఁడు రీతులు గుణములందే పర్యవసించు ననియు వృత్తి రీతులు గుణవ్యతిరిక్తములు కావవియుఁ దెలిపి అనందవర్ధనుఁ డంగీకరించిన మాధుర్యము. ఓజస్సు. ప్రసాదము అను మూఁడు గుణములలోనే రీతివృత్తు లంతర్భవించునని పలికెను. గుణములు శబ్దాశ్రిత గుణసమష్టి రూపములు. రీతులవలె ఉపనాగరికాది వృత్తులును శబ్దాశ్రితములే అగుటచే నారెండును అభిన్నములే యనుటకు సందేహింప నక్కఱ లేదు. జగన్నాథుఁడు కూడ పండితులు రీతినే వృత్తియని వ్యవహరింతు రనియు. వాని నిర్మాణమున కవులు మిక్కిలి శ్రద్ధ వహింపవలెననియుఁ దెలిపెను. అందుచే నాయా రసములకుఁ దగినట్లుగా కావ్యముల నిరూపింపఁబడు మాధుర్యాది గుణములందే రీతులను ఉపనాగరికాది వృత్తులును అంతర్భవించు నని చెప్పవచ్చును.

అర్థవృత్తులు : ఇచ్చట నర్థమనఁగా నభిధేయము కాదు. దానికి రసమని కాని రసవంతమైన కావ్యఘట్టమని కాని యర్థము చెప్పవలయును. వృత్తి యనఁగా వ్యాపారము కావున అర్థవృత్తి యనఁగా రసోచితమైనవ్యాపార మని తెల్లమగును. అభినవగుప్తుఁడు కూడ "రసోచిత ఏవ చేష్టా విశేషః వృత్తిః" అని నిర్వచించి యుండెను. కావ్యములందు నాయకాదులు రసానుకూలముగాఁ జేయు వ్యాపారమే (Action) వృత్తి. అది రీతివలె రచనాశ్రయము కాదు. నటనాశ్రయము. రీతి వృత్తులకు మఱొక భేద మేమన వృత్తులు నాట్యాశ్రయము లగుటచే సాక్షా ద్రసోప స్కారకములు. రచనాశ్రయములును గుణసమష్టి రూపములు నగు రీతు లట్లుగాక పరంపరగా రసోపస్కారకములు. ఏల యన అవి వృత్తులను స్ఫుటీకరించి తద్ద్వారా రసోపస్కారకము లగును. రీతులు వాచికాభినయ రూపములు; వృత్తు లాంగి కాభినయరూపములు వాచికాభినయముతోఁగూడిన ఆంగికాభినయయే(అనఁగా రీతులచే స్ఫుటీకరింపఁబడిన వృత్తులే) సహృదయులకు రసస్ఫూర్తి కలిగించును. రీతివృత్తు లీవిధముగా పరస్పరాశ్రయములు

వృత్తుల సంఖ్య విషయమునఁగూడ భిన్నాభి ప్రాయములున్నవి. భరతుఁడు కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి అను నాల్గు వృత్తులను బేర్కొని భారతీ వృత్తి నటాశ్రయమైన వాగ్వ్యాపార మని చెప్పియుండెను. వాగ్వ్యాపార మనఁగా శబ్దవృత్తియే కదా. దీనిని బట్టి అతఁడు భారతిని, శబ్దవృత్తిగను,

కైశిక్యాదులు మూఁడింటిని అర్థవృత్తులుగను భావించెనని తెల్లమగుచున్నది. సింగభూపాలుఁడు కూడ వృత్తులు నాల్గింటిలో భారతి శబ్దవృత్తి యనియు, మిగిలిన వర్థవృత్తులనియు నభిప్రాయపడెను. విద్యానాథుఁడు భారతీవృత్తిని గూడ నర్థవృత్తిగా గ్రహించి మొత్తమర్థవృతులు నాలుగని చెప్పెను. సాహిత్య దర్పణకారాదులు కూడ నాలుగు వృత్తులనే గ్రహించిరి. ప్రకాశవర్షుఁడు భరతుఁడు చెప్పిన వృత్తులకును లలితయను మఱొక దానిని గూడఁ జేర్చి అది సర్వార్థ విషయమును. నానామార్గ విసారిణియు, కవిచిత్త హారిణియు నని నిర్వచించెను. కొందఱి మతమున లలిత యనునది మిశ్రవృత్తి. సింగభూపాలుఁడు మిశ్రవృత్తుల నంగీకరింపలేదు. ఉద్భటుఁడు న్యాయ చేష్టావృత్తి, అన్యాయ చేష్టావృత్తి, ఫలసం విత్తివృత్తి అను మూఁడును ప్రధానము లనియు అవాంతర భేదములచే నవి పదునా ఱగుననియు తెల్పెను. కొందఱు మధ్యమ కైశికి, మధ్యమారభటి అను మఱిరెండు వృత్తి భేదములను సూచించిరి. ఇవి ఆరభటీ కైశికీ వృత్తిభేదములేకాని ప్రత్యేక వృత్తులు కావు.

అర్థవృత్తులు మొదట దృశ్యకావ్యాశ్రయములుగనే భావింపఁబడినట్లు గానిపించును. అప్పు డవి నాట్యవ్యాపారము లగును. తరువాత నాలంకారికులు వానిని శ్రవ్య కావ్యములకుఁ గూడ నన్వయించిరి. అందు చేతనే ఆనందవర్ధనాచార్యుఁడు వృత్తులు రసాదితాత్పర్యముచే సన్నివేశితములై నాట్యమునకును గావ్యమునకును అనిర్వాచ్యమైన శోభ నాపాదించునని వేఱువేఱుగాఁ జెప్పియుండెను. విద్యానాథుఁ డితరాలంకారికులవలె వృత్తులకు ప్రయోక్తృ నైపథ్య భాషాదులు తెలిపియుండక పోవుటచే వానిని శ్రవ్యకావ్య సంబంధులుగానే భావించునట్లు కనిపించును.

"ఈషన్మృద్వర్థ సందర్భ" యని విద్యానాథుఁడు భారతి కిచ్చిన నిర్వచనము. ఇంచుక మృదువైన అర్థ సందర్భము కలది భారతియని అతని యభిప్రాయము. భరతుఁడు దీనిని వాగ్వ్యాపారమని పేర్కొనెను, రీతులుకూడ వాగ్వ్యాపారములే. అవి పదరచనాశ్రయములు. అవి వృత్తులను స్ఫుటీకరించును. కావున వైదర్భి గౌడి, పాంచాలి అను మూఁడు రీతులకును మూఁడే వృత్తు లుండునని చెప్పుట యుక్తముగా నుండుననియు, వాగ్వ్యాపారమైన భారతీవృత్తియే మూఁడు రీతులయ్యెనని భావించుట సమంజస మనియు శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిలవారి అభిప్రాయము.

1. కైశికి : అత్యర్థ సుకుమారార్థ సందర్భము కలది కైశికి. ఇది అత్యంత సుకుమారములైన శృంగార కరుణ రసములందు ప్రయోగింపఁబడును ఇది రుచిర వస్త్రాలంకారాది భూషితము. కామోపభోగ జన్యము. వివిధ నృత్త గీతసముపేతము. స్త్రీ పాత్రయుక్తమునైన లాస్యాంగము.

ఉదా॥ "తిన్ననిమేను, గన్నుఁ గవ తేటలుఁ, దేనియ లొల్కు మాటలున్
సన్నపుఁ గౌనుఁ, గుందనపుఁ జాయలు దేఱు మెఱుంగుఁ జెక్కులున్
గ్రొన్నెలవంటి నెన్నుదురు గుబ్బచనుంగవ తళ్కుచూపులున్,
జెన్నెసలారఁ గన్య నరసింహునిఁ జూచె విలాస ధన్యయై"

2. ఆరభటి: అత్యుద్ధతార్థ సందర్భము కలది ఆరభటి. ఇది అత్యుద్ధతములైన రౌద్ర బీభత్సరసము లందు ప్రయోజ్యము. ఇది మాయా యుద్ధ దంభోక్తి సంయుతమైన తాండవాంగము,

ఉదా॥ "ప్రతిపక్ష క్ష్మాప వక్షః ఫలక విదళన ప్రౌఢగాఢ ప్రతాప
ప్రతిధా సంరంభ గుంభ ప్రబల సుబల శుంభ న్నృసింహోగ్రరంహో
యుతమై కల్పాంత దృప్యద్ద్యుమణి ధగధగ ప్రోద్యత జ్వాలజ్వాల
ప్రతికూల ప్రక్రమంబై పరఁగు నరసభూపాల దోఃఖడ్గ మాజిన్."

3. సాత్వతి : ఈషత్ప్రౌఢార్థ సందర్భము గలది సాత్వతి. ఇది ఈషత్ప్రౌఢములైన వీర భయానకములందుఁ బ్రయోగింపఁదగినది. ఇది హర్షాతిశయ విలసితము. సాత్త్వికాభినయ భూయిష్ఠమునై విలసిల్లును.

ఉదా॥ "ఉభయర గండ తావకరణోగ్ర జయానకముల్ గుభుల్ గుభుల్
గుభులని మ్రోయఁగా భవదకుంఠిత వీరభటుల్ ప్రభుల్ ప్రభుల్
ప్రభులని శత్రు భూపతులపై జొరఁ బాఱునెడన్ విభుల్ విభుల్
విభులని సంభ్రమింపుదురు వేడ్క నఖర్వసుపర్వ భామినుల్"

4. భారతి : ఈషన్మృద్వర్థ సందర్భము గలది భారతి. ఇది హాస్య శాంతాద్భుతములందు ప్రయోజ్యము. ఇది స్త్రీ రహితము, వాచికాభినయ ప్రధానము. సంస్కృత పాఠ్య ప్రధానమునై యొప్పారును. ఇది శబ్దవృత్తి.

ఉదా॥ "సిరిమలకేఁగి, యీశు దరిశించి, సముంచిత భక్తిమైఁ దులా
పురుషము తూఁగి, విప్రజనముం బరితుష్ట మొనర్చి, మల్లికే
శ్వరకరుణా కటాక్షరస వాహినిఁ దోఁగిన వీరరుద్ర భూ
వరుఁడు మహేశభక్తులకు భక్తుఁడుగా నతికెక్కె నెల్లడన్"

ఆంధ్ర పురాణము

స్థూలముగాఁ జూచినప్పుడు వృత్తి రీతు లభిన్నములుగనే తోఁపవచ్చును. కాని వాని స్వభావమునందుఁ జాల భేద మున్నది. అర భావ రసాశ్రయములై సాక్షాద్రస వ్యంజకములైనవి వృతులు. అర్థభావ వివేకమున్నఁగాని వీనిని నిర్ణయించుటకు వీలు లేదు. అర్థభావాపేక్ష లేకుండనే పదాశ్రయ గుణ సంకలన రూపములై పరంపరగా రసమును వ్యంజింపఁ జేయునని రీతులు. కేవల పద సంఘటనను బట్టియే వీనిని నిర్ణయింప వచ్చును.

## 4. శయ్యాపాకములు :

శయ్య యనఁగా పడక (సెజ్జ) అని సామాన్యార్థము. శయ్యానిమ్నోన్నతములు లేక సరిగా నున్నచో మానవ శరీరమునకు సౌఖ్య మొసంగును. అట్లే కావ్య శరీరమని చెప్పఁదగిన శబ్దముల కూర్పు కూడ విషమము గాక సముచితముగా నుండుచో కావ్యమునకు సౌందర్యము చేకూర్చును. పదములకుఁ గల యుత్కృష్టమైన పరస్పర మైత్రి శయ్యయని విద్యానాథుఁడు శయ్యను నిర్వచించెను. (యా పదానాం పరాన్యోన్య మైత్రీ శయ్యేతి కథ్యతే) పదముల పొందికకే శయ్యయని పేరు. ఏపదముల తరువాతనే పదములను వాడినచో శ్రవణ సుభగత్వమును అర్థవైశద్యమును కలుగునో వానివి వాడినప్పుడే సముచితమైన శయ్యయేర్పడును. అందు చేతనే భామహుఁడు "మాలాకారుఁడేపూవు తరువాతనే పూవు గ్రుచ్చినచో సుందరముగా నుండునో లెస్సగా గ్రహించి మాలను గ్రుచ్చునట్లే కవి కావ్యమందు కూడ నవహితమతితో పదములను గూర్పవలయు" నని చెప్పి యున్నాఁడు * కొన్ని శబ్దముల తరువాత కొన్ని శబ్దములను వాడినప్పుడే కూర్పు సుందరముగా నుండును. అర్థము సమానమే కదా యని పర్యాయపదముల నిచ్చవచ్చినట్లు వాడినచో నా సౌందర్యమునకు భంగ మేర్పడును. నిందు

---

*మా లాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యే ష్యవహితధియా తద్వదే వాభిధానమ్

మనంబు, పాదపల్లవములు ముఖ పద్మము అను వానిని క్రమముగా పూర్ణమనంబు, పాద కిసలయములు, ముఖ నాళీకము అని చెప్పినచో నర్థమునందు మార్పులేక పోయినను కూర్పు నందలి సౌందర్యము తగ్గుచున్నది. దీనిని బట్టి పరివృత్తి సహింపని పదముల కూర్పు వలన శయ్య యేర్పడునని చెప్పవచ్చును. మల్లినాథుఁ డేకావళీ వ్యాఖ్యలో పదముల పరివృత్తి వైముఖ్యమును, వినిమయాసహిష్ణుతయు శయ్య యని చెప్పఁ బడునని తెల్పియుండెను.

గుణసమష్టి రూపమే రీతి యని యిదివరకుఁ జెప్పఁబడినది. పరివృత్తి సహింపని విధమున గుణములను గూర్చుటయే శయ్య యగును. ఈ విధముగా శయ్యను రీతి ధర్మమని చెప్పవచ్చును. కాని రీతియొక్కొ-క్కప్పుడు పదపరివత్తిని సహించును; శయ్య సహింపదు. ఆ రెండింటికిని గల భేద మిదియే. శయ్యను శబ్దపాకమని చెప్పవచ్చును. "కావ్యవేత్తలు ఛాయ, ముద్ర, ఉక్తి, యుక్తి గుంఫన, మున్నగు వానిని శబ్దాలంకారము లందురు. అభిప్రాయ విశేషముచే కవిశక్తిని వివరించుచు నానందము నొసంగునది ముద్ర. మామతమునదే శయ్య" అని అగ్ని పురాణము చెప్పుచున్నది. నన్నయభట్టు తన కవిత్వమున నుండునవి చెప్పిన అక్షరరమ్యత శయ్యకు సంబంధించినదే. పింగళి సూరన్న "పొసఁగ ము తెపు సరుల్ పోహళించిన లీలఁ దమలోన దొరయు శబ్దములు కూర్చి" అని చెప్పుట కూడ శయ్యాసౌభాగ్యము కొఱకే. ఆంగ్లేయ విమర్శకులు కూడ నీశయ్య నంగీకరించిరి, వారు దీనిని పద ప్రయోగ సౌష్ఠవము (Felicity of expression) అందురు. వర్డ్సువర్తు సరియైన పదములను సరియైన స్థలమున వాడుటయే కవిత్వమని చెప్పియుండెను.

శయ్యను విద్యానాథుఁ డొక్కఁడు మాత్రమే పేర్కొని యుండెను. దండి వామన మమ్మట విశ్వనాథ జగన్నాథాదులు దానిని వేఱుగాఁ జెప్పియుండలేదు. విశ్వనాథుఁడు దానిని రీతులందే అంతర్భావింపఁజేసెను.

పాకములు :

శయ్య శబ్ద ధర్మమైనట్లు పాకమర్థ ధర్మము. అర్థగంభీరిమ పాకమని విద్యానాథుని నిర్వచనము. శృంగారాదుల ఆస్వాద్య మానతా విశేషమని కుమార

స్వామి సోమయాజి దీనికి వ్యాఖ్యానము చేసెను. కావ్యార్థములైన శృంగారాది రసముల ఆస్వాదము అవ్యవహితముగా జరుగవలెనన్న ఆ యర్థమును వ్యక్తము చేయు పదములు సరళసుందరములై యుండవలెను. అవి యట్లు లేనియెడల రసాస్వాదము విలంబితముగా జరుగును. రసోచిత శబ్దార్థ నిబంధనము పాక మని ఏకావళీ కారుని మతము. శ్రవణ సుధాస్యందిని యైన పదవ్యుత్పత్తి పాక మని కొందఱును. పదముల పరివృత్తి వైముఖ్యము పాకమని కొందఱును భావించుచున్న ట్లన్యమతములను గూడ నాతఁడు సూచించెను పరివృత్త్యసహిష్ణువుగా పదములను గూర్చుటయే పాకమైనచో శయ్యకును దీనికిని భేదమే లేదని చెప్పవలసి వచ్చును. శయ్య కేవలము పదముల కూర్పునకు సంబంధించినది. పాకము పదముల కూర్పువలన బోధపడు నర్థముల ఆస్వాదమునకు సంబంధించి నది. నానా వస్తువుల కలయిక వలన పాకమునకు (వంటకు) లేక పానకరసము నకు రుచి భేద మేర్పడునట్లు గుణరీతి వృత్తుల సంయోగము వలన పాకమేర్పడును.

విద్యానాథుని మతమున ద్రాక్షా పాకము, నారికేళ పాకము, అని పాకము రెండు విధములు. బహిరంతః స్ఫురద్రస మైనది ద్రాక్షాపాకము. అంతర్గూఢ రసోదయ మైనది నారికేళ పాకము ద్రాక్షాఫలము నాస్వాదించుటకు మనము ఎట్టి క్లేశమును బొంద నక్కఱలేదు. ఫలముకోసి వెంటనే నోటిలో వేసికొని తద్ర సమునాస్వాదింప వచ్చును. అందు పరిహరింప వలసినది కూడ నేమియు నుండదు మాధుర్యగుణ, వైదర్భీ రీతి కైశికీ వృత్తుల సంయోగముచే నిది యేర్పడును. నారికేళ ఫలము నాస్వాదించుట కొంత క్లేశకరము. చెట్టెక్కి ఫలమును గోసి పీచుతీసి కాయ పగులఁగొట్టి అందలి పదార్థమును బాగుగా నమిలినప్పుడు కాని తద్రసాస్వాదము కలుగదు. ఇందు పరిహరింప వలసిన దెక్కువగా నుండును. ఓజోగుణ గౌడీరీత్యారభటీ వృత్తుల సంయోగమున నిది యేర్పడును. విద్యానాథుఁడీ రెండు పాకములనే పేర్కొని మధుక్షీరాది పాకాంతరములను యథా సంభవముగా నూహించుకొన వలెనని చెప్పెను. కుమారస్వామి కదళీ రసాలాది పాకము లూహ్యములని చెప్పెను. పండితరాయలు పిచుమంద, బదరీ, మృద్వీకా, వార్తాక, తింత్రిణీ సహకార, క్రముక, త్రాపుష, నారికేళపాకములు తొమ్మిదింటిని పేర్కొనెను ఈ విధముగా లోకమునందలి ఫలాదులను రుచి భేదములను బట్టి పాకభేదములను నిర్ణయించుచో వాని కానంత్యము కలుగును.

అందుచే ద్రాక్ష, నారికేళ, కదలీ పాకములు మూఁడింటిని గ్రహించుట యుక్తము కదలీ ఫలము నాస్వాదించుట ద్రాక్షఫలాస్వాద మంత సుకరము కాని, నారికేళ ఫలాస్వాద మంత క్లేశకరము కాని కాదు, ఫలము కోసి తొక్క తీసి దాని నాస్వాదింప వచ్చును. ఇందు పరిహరింప వలసినది తక్కువ. ప్రసాద గుణ, పాంచాలీ రీతి, సాత్వతీ వృత్తుల సంయోగముచే నిది యేర్పడును. మూఁడు గుణములకు మూఁడు రీతులకు, మూఁడు వృత్తులకు అనుగుణముగా మూఁడు పాకములను గ్రహింప నగును.

### ద్రాక్షాపాకమునకు ఉదాహరణము :

"వాలికలై వెలిదమ్మల
పోలికలై చందమామ పులుగులకును దా
మేలికలైన నిరీక్షణ
మాలికల నృసింహుఁ జూచె మదపతి వేడ్కన్"

పై పద్యములో వలె శబ్దాలంకారము గాని ప్రాస వైలక్షణ్యము గాని లేక వోయినను భావము సులభముగా గోచరించు నే పద్యమైనను ద్రాక్షాపాకమున కుదాహరణముగా గ్రహింపవచ్చును.

### నారికేళ పాకమునకు ఉదాహరణము :

"వరభూషాదులపై మనం బిడక దృగ్వ్యాపార మెంతేఁ బర
స్పర సందర్శన నాతిభిన్నమయి చూపట్టంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలతనీ సాంగత్యముం గోరిమా
హరిణీలోచన యాత్మయందు నరసింహా నిన్నే భావించెరా"

ఇందలి భావము క్లిష్టమై విలంబితముగా బోధపడుచున్నది.

### కదళీ పాకమునకు ఉదాహరణము :

"ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీ లోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ
వ్రేలం దొక్కని పాధరేణువులు పై వేష్టించినం జాలదే"

ఇందలి భావ మించుక క్లిష్టమై యున్నది. భాగవ.

## 5. దోషములు :

శబ్దార్థ గుణరీతి వృత్త్యలంకార రసభావాదుల నన్నిటిని కావ్యసామగ్రి యని చెప్పవచ్చును. ఇవన్నియు నిర్దోషములై యుండినప్పుడు కాని కావ్య పరమ ప్రయోజనమైన రసానందము చేకూరఁజాలదు. దీపము ప్రక్కనే నీడ యుండు నట్లు పైని పేల్కొనఁబడిన కావ్యాంశము లన్నింటిని అంటి దోషములు ప్రవర్తిల్లు చుండును ఆదోషములను తొలఁగించి కావ్యము ననవద్యముగా నొనరించుటకు వాని స్వరూపమును గూడ చక్కగా నెఱుంగ వలసి యున్నది. ప్రాచీనులు కొందఱు అదోషములు, సగుణములు, సాలంకారములు నైన శబ్దార్థములు కావ్య మనియు, అదోషము గుణవంతము నైనది కావ్యమనియు కావ్యమును నిర్వచించి యుండిరి. వారియుద్దేశమున గుణసాహిత్యము వలెనే దోషరాహిత్యమును కావ్య మునందు తప్పకయుండ వలయును. దండి "కావ్యమున నల్పమైన దోషమును గూడ నుపేక్షింపరాదు శరీరమెంత సుందరమైనను ఒక్క బొల్లిమచ్చ యున్నచో దుర్భగమగు" *నని పల్కి కావ్యమున చిన్నదైన దోషము కూడ నుండ రాదని సూచించెను. ఇది కొంత అతివాదము. ఏలయన దోషములేని కావ్యము లోకమున నుండనే యుండదు. మహాకవుల కావ్యములందుఁ గూడ నచ్చటచ్చట దోషములు గోచరించును. అంత మాత్రమున నవి కావ్యములు కాకపోవు. వానియందా దోషములను మఱుఁగుపుచ్చు రసపుష్టిముండును. దీనిని బట్టి రసమున అపకర్ష కలిగింపని దోషముల వలన కావ్యత్వము భంగము వాటిల్ల దనియు రసాపకర్షకము లగునవే నిజమైన దోషములనియుఁ దెలియ వచ్చును. అందుచేతనే సాహిత్య దర్పణ కారుఁడు రసమున కపకర్ష కలిగించునవి దోషములు (రసాపకర్షకా దోషాః) అని దోషములను నిర్వచించి యుండెను.

భరతుఁడు గుణములను నిర్వచించుచు దోష విపర్యయములు గుణములని చెప్పెను. వామనుఁడు ఆ నిర్వచనమును తలక్రిందులు చేసి గుణవిపర్యయాత్మకములు దోషములు (గుణవిపర్యయాత్మానో దోషాః) అని వ్యక్తము చేసెను కాని గుణ విపర్యయ రూపములే కాక కేవలం దోషములు కూడఁ గొన్ని యున్నవి. అందుచే వామనుని నిర్వచనము సమగ్రమైనది. కాదు విద్యానాథుఁడు కావ్యాపకర్ష హేతువు దోషమనియు (దోషః కావ్యాపకర్షస్య హేతుః) నది

---

* తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యాద్వపు స్సుందర మపి శ్విత్రేణై కేన దుర్భగమ్.

శబ్దార్థ గోచర మనియు వ్రాక్రుచ్చెను. శబ్దార్థ గతమైన దోషమే కావ్యాపకర్ష హేతువగు నపుడు రసగతమైన దోషము కావ్యమున కపకర్ష కలిగించునని వేఱుగాఁజెప్పనక్కఱలేదు. నిజమునకు రసాపకర్షక మైనదే దోషము. అది కావ్యమున నవశ్యము పరిహరింప దగినది.

శబ్ద పరివృత్తిని సహింపని దోషము శబ్దదోషము. ఇచ్చట దోశము శబ్దమునందే యుండును. ఆ శబ్దమును దొలఁగించి దాని స్థానమున సమానార్థకమైన మఱొక శబ్దము నుంచినచో నాదోషము తొలఁగును. అర్థదోషము శబ్ద పరి వృత్తిని వహించును. అనఁగా నొక శబ్దమును దీసివైచి దాని స్థానమున సమా నార్థకమైన మఱొక శబ్దము నుంచినను ఆ దోము తొలఁగదు.

అర్వాచీనులైన లాక్షణికులు కొందఱు ముఖ్యార్థహతి దోషమని తలంచిరి. ముఖ్యార్థ మనఁగా నేమి యని చర్చించి వారు కావ్యమున కాత్మ భూతమైన రసమే కాక దాని కాశ్రయ మగుటచే వాచ్యార్థమును ముఖ్యమే యని నిర్ణయించిరి రసవంతమైన కావ్యమున ఉద్దేశ్యము రసము. నీరసమైన కావ్యమున చమత్కారమును కలిగించు వాచ్యార్థమే ఉద్దేశ్యము. హతి యనఁగా నపకర్షము ఉద్దేశ్యములైన రస వాచ్యార్థముల కపకర్ష కలిగించునది దోషములగుటచే పైవివచనము ఉద్దేశ్య ప్రతీతి విఘాతుకము దోషమను రీతిని సవరింపఁబడినది. ఈ యపకర్షము రసవాచ్యార్థములందు వలెనే తదుపకారములైన శబ్దములందును వర్ణములందును రచన యందును గూడ నుండవచ్చును. అందుచేతనే సాహిత్య దర్పణమున దోషములు పదమునందు, తదంశమునందు, వాక్యమునందు, రస మునందుఁ గూడఁ బ్రవర్తిల్లు చుండునని చెప్పఁబడినది.

దోషము లెన్నియను విషయమున మత భేదము లున్నవి. భరతుఁడు దోషవిపర్యయములు గుణములని దోష ప్రాధాన్యము నుగ్గడించుచుఁ జెల్పి శబ్దార్థ గత విభాగము చేయక మొత్తము పదిదోషములను బేర్కొనెను. దండి కూడ నట్లే పది దోషములను జెప్పెను. కాని భరతుఁడు పేర్కొన్న దోషములకును అతని దోషములకును నామములందే కాక లక్షణ నిర్వచన మందును గొంత భేదము కనఁబడును. వామనుఁడు దోషములు కావ్య సౌందర్యాపకర్షకములని సూచించి మొత మిరువది దోషములు నిరూపించినాఁడు,అందు పదదోషములైదు

పదార్థదోషములైదు, వాక్యదోషములు మూఁడు, వాక్యార్థదోషము లేదు, భామహుఁడు భరతుఁడు చెప్పిన పది దోషములకు మఱి పదకొండు దోషములు చేర్చి మొత్తమిరువది యొక్క దోషములను వివరించెను. రుద్రటుని మతమున దోషములు శబ్దగతములు, అర్థగతములు అని ప్రధానముగా రెండు విధములు. శబ్ద దోషములలో పదగతము లాఱు. వాక్యగతములు మూడు. అర్థదోషములలో అర్థదోషములు తొమ్మిది. ఉపమా దోషములు నాలుగు మొత్తమిరువది రెండు.

పూర్వులు శబార్థ దోషముల నలంకార దోషములతోఁగలిపి వివరించి నట్లు కనిపించును. ధ్వని మతము ప్రచురమైన పిమ్మట గుణములు రసోత్కర్ష కును దోషములు రసాపకర్షకును హేతువులను నభిప్రాయము వ్యాపించెను. అర్వాచీనులు శబ్దార్థదోషములతోపాటు రసదోషములను గూడ గుర్తించి ఈ మూఁడు విధములైన దోషములను రసభంజకములని నుడివిరి. అందు కొందఱు మఱియు సూక్ష్మ విభాగము కావించి పద, పదాంశ, వాక్యార్థ, రస దోషములని దోషములనైదు విధములుగా వింగడించిరి. ప్రతాపరుద్రీయమున మొత్తం మఱువది దోషములు వివరింపఁబడినవి. అందు పరదోషములు 17. అర్థ దోషములు 18, వాక్య దోషములు 24 రసదోషము (రసభావాదులకు స్వశబ్ద వాచ్యత) 1. కావ్య ప్రకాశము ననుసరించి పధదోషములు 17, వాక్యదోషములు 16, అర్థదోషములు 23, రసదోషములు 10. మొత్తము దోషము లఱువది యాఱు సాహిత్యదర్పణము ననుసరించి పద వాక్యదోషములు 16, వాక్యామాత్రదోషములు 23, అర్థదోషములు 21 రసదోషములు 15, ఈ 75 దోషముల తోపాటు కొన్ని అలంకార దోషములు కూడ నందు చెప్పఁబడినవి ఇవి గాక వేఱుదోషములు కూడి కనఁబడినచో వానిని గూడ నెఱుంగ వలెననియు నౌచిత్యము ననుసరించి కొన్ని దోషముల కదోషత్వమును, గుణత్వమును, అనుభయాత్మకత్వమును గ్రహింపఁ దగుననియు సాహిత్య దర్పణకారుఁడు నుడివి యున్నాఁడు.

దోషములన్నియు నిత్యములనియు ననిత్యము లనియు రెండు విధములు నిత్యదోషము లెప్పుడును దోషములే. (చ్యుతసంస్కారాదులు) వీని నేవిధమునను సమర్థించుటకు వీలులేదు. అనిత్యదోషము లెల్లప్పుడు దోషములు కానేరవు. కొన్నియెడల నవి గుణములే యగును. పరుషము శృంగారాదు లందు దోషమే యయ్యును రౌద్రాదులందు గుణమె. అట్లే అప్రయుక్తాదులు శ్లేషాదులందు దోష

ములు కావు. ఇట్టివి అనిత్య దోషములు. లాక్షణికులు చెప్పిన పెక్కు దోషములనిత్యములే.

సాహిత్యదర్పణము పేర్కొన్న దోషములిచ్చటఁ బేర్కొనఁబడుచున్నవి. వీని లక్షణముల నందుండియే గ్రహింపఁ దగును.

పదవాక్య దోషములు 16 : 1. దుశ్శ్రవత్వము 2. మూఁడు విధములైన అశ్లీలత 3. అనుచితార్థము 4. అప్రయుక్తత 5. గ్రామ్యత 6. అప్రతీతత్వము 7. సందిగ్ధత 8. నేయార్థత 9. నిహతార్థత 10. అవాచికత 11. క్లిష్టత్వము 12. విరుద్ధమతి కారిత్వము 13. అవిమృష్ట విధేయాంశత 14. విరర్థకత 15 అసమర్థత 16. చ్యుత సంస్కారత్వము.

వాక్యమాత్ర దోషములు 23 : 1. అక్షర ప్రతికూలత్వము 2. లుప్త విసర్గత్వము 3. అహత విసర్గత్వము 4 అధిక పదత్వము 5. న్యూన పదత్వము 6. కథిత పదత్వము 7. అహతవృత్తత 8. పతత్ప్రకర్షత్వము 9. సంధివిశ్లేషత 10. అశ్లీలత 11. కష్టత్వము 12. అర్థాంతరైక పదత్వము 13. సమాప్తపునరాత్తత 14. అభవన్మతసంబంధము 15. అక్రమత్వము 16. అమతపదార్థత 17. వాచ్యానభిధానత్వము 18. భగ్నప్రక్రమత 19. ప్రసిద్ధి త్యాగము 20. అస్థానస్థ పదత్వము 21. అస్థానస్థ సమాసత్వము 22. సంకీర్ణత 23. గర్భితత్వము.

అర్థదోషములు 21 : 1. అపుష్టత్వము 2. దుష్క్రమత 3. గ్రామ్యత 4 వ్యాహతత్వము 5. అశ్లీలత్వము 6. కష్టత్వము 7. అనవీకృతత్వము 8. నిర్హేతుత్వము 9. ప్రకాశిత విరుద్ధత 10. సందిగ్ధత 11. పునరుక్తిత్వము 12. ప్రసిద్ధవిరుద్ధత 13. విద్యావిరుద్ధత 14. సాకాంక్షత 15. సహచరభ్రష్టత 16. అస్థానయుక్తత 17. అవిశేష విశేషత్వము 18 అనియమనియమత్వము 19. విశేషావిశేషత్వము 20. నియమానియమత్వము 21 నిర్ముక్త పునరుక్తత్వము.

రసదోషములు 15 : 1. రసమును స్వశబ్ద వాచ్యము చేయుట 2. స్థాయి భావమును స్వశబ్ద వాచ్యము చేయుట 3 సంచారి భావమును స్వశబ్ద వాచ్యము చేయుట 4. విరోధిరసముల కంగములకు విభావాదుల గ్రహించుట 5. అనుభావ విభావముల ఆక్షేపము 6. అనుభావ విభావ కష్టకల్పనము 7. అకాండ ప్రథనత 8. అకాండచ్ఛేదత 9. రసమునకు పునః పునః దీప్తి కల్గించుట 10 అంగిరసమును

పోషింప తుండుట 11 అంగిరసము కాని రసమునుకీర్తించుట 12 అంగరస మును మిగుల విస్తరించుట 13. దివ్యాదివ్య ప్రకృతి విపర్యయము 14 అర్థానౌచిత్యము 15. దేశకాలాద్యనౌచిత్యము,

దోష రహితముగాఁ గావ్యములను రచించుట అసంభవము కావచ్చును. కాని యిట్టివి దోషము లనియు సాధ్యమైనంత వఱకు దోషములను బరిహరించి రస వత్కావ్యములను రచింపవనియు నలయుఁ జెప్పుటలో దోషములేదు దోషము వన్నియుఁ బరిహరణీయములే యైనను అన్నిటికన్న అనౌచిత్యము పెద్దదోషము. అందుచేతనే అనౌచిత్యముకంటె రసభంగమునకు వేఱొక కారణము లేదని ఆనంద వర్ధనుఁడు చెప్పియుండెను.

## 6. అలంకారములు:

కావ్యాంగములలో నలంకారములకు సముచితస్థానమున్నది. భామహుఁడు స్త్రీపురుషాదుల శరీర సౌందర్యము నలంకారములు (నగలు) పెంపొందించు విధముగఁ గావ్య శరీర సౌందర్యము నలంకారములు పెంపొందించు ననియు నవియే కావ్యమున ప్రధానము లనియు నుడివెను. అతఁడు రసమును రసవదలంకారమని యొక యలంకారముగా పరిగణించెను. వామనుండు కావ్యాలంకార సూత్ర వృత్తిలో రీతి కావాత్మ యనియు, నలంకారములు కావ్యసౌందర్యమును పెంపొందించు ననియు తెలిపెను. దండి కావ్యము యొక్క అంత స్సౌందర్యమును బెంచు ప్రధానాంగములు గుణములే యనియు, నలంకారములు కావ్య బాహ్య శోభా కారణము లనియుఁ జెప్పెను ధ్వనికారుఁడు కావ్యాత్మ ధ్వని యని నిరూపించి యది వస్త్వలంకార రసరూపముగా నుండునని వ్యక్తీకరించెను. అభినవగుప్తుఁ డలంకారముల వైశిష్ట్యము నంగీకరించినను అవి రసపర్యవసాయులుగానే యుండవలెననెను. పండితరాయలుగూడ వ్యంగ్యమునకు రమణీయతా ప్రయోజకము లలంకారము లని యభిప్రాయపడెను. ఈ విధముగా భామహాని వలె నితరాలంకారికు లలంకారములకుఁ గావ్యమునఁ బ్రాధాన్యము నంగీకరింపక పోయినను అవి దానికి సౌందర్య మాపాదించు ననుటలో నేకాభిప్రాయమునే కలిగియున్నారు.

అర్థాలంకారములు లేనిచో శబ్దసౌందర్య మాకర్ష కరముగ నుండదనియు. నలంకార స్పర్శ లేకుండ నే వాక్యమైన మనోహరముగా నుండుట అరుదనియు

కొందఱి అభిప్రాయము. అగ్నిపురాణ మర్థాలంకార రహితయైన సరస్వతిని విధవతోఁ బోల్చియుండెను. (అర్థాలంకార రహితా విధవేవ సరస్వతీ) మమ్మటుఁడు కావ్యలక్షణమును జెప్పుచు శబ్దార్థము లొకప్పు డనలంకృతులైనను హాని లేదని చెప్పుటలో నవి స్ఫుటాలంకారములు కాకున్నను లోపముండ దనియే భావము. కాని అస లలంకారము లనవసరము లని యభిప్రాయము కాదు రసధ్వనుల కుపస్కారకములై యలంకారములు కావ్యములకు శోభ నాపాదించు ననుటలో విప్రతిపత్తి లేదు.

అలంకారమునకు 'సౌందర్య మలంకారః' అనునది వామనుఁ డొసంగిన నిర్వచనము. అతఁడు సౌందర్య మలంకారమని నుడివి వేనివలన కావ్యమున కా సౌందర్య మావహిల్లునో యవియు నలంకారములే యని వివరించెను. దండి కావ్య శోభాకరములైన ధర్మము లలంకారము లని పలికెను. అలంకృతియే అలంకారమనియు, *దీనిచే నలంకరింపబడును. గావున నలంకార మనియు నలంకార పదమునకు వ్యుత్పత్తులు, ఇందు రెండవ వ్యుత్పత్తినే పలువురంగీకరించిరి. దీనిని బట్టియిది యలంకరించుగదే కాని యలంకార్యము కాదు. రసధ్వను లలంకార్యములు, పండితరాయలు స్వయముగా సుందరమై అన్యమున కుపస్కారమై యుండుట అలంకారత్వమని వ్రాక్రుచ్చెను. (సుందరత్వే సతి ఉపస్కారకత్వ మలంకారత్వమ్) ప్రౌఢి ప్రసిద్ధులలో నొక దాని నవలంబించి శబ్దార్థముల నుచిత రీతి మార్చినచో నలంకారమను వ్యవహారము కలుగును.

అలంకారముల సంఖ్య విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. భరతుఁ డొక శబ్దాలంకారమును మూఁడర్థాలంకారములను బేర్కొనెను. (యమకము— ఉపమా దీపక రూపకములు) అగ్నిపురాణమున నెనిమిదియు. విష్ణుధర్మోత్తరమున పదునేడును అలంకారములు చెప్పఁబడినవి. దండి భామ హోద్భటులు వరుసగా ముప్పదియైదు ముప్పది యాఱు ముప్పదియే దలంకారములను వ్రాక్రుచ్చిరి మమ్మటు డఱువది యొక్కటియు, విద్యానాథుఁ డఱువదియాఱును, (రసవదాదులు 7 = 73) విశ్వనాథుఁడు డెబ్బది తొమ్మిదియు, జయదేవుఁడు నూటొక్కటియు. అప్పయ్యదీక్షితులవారు నూటిరువది యొక్కటియు నలంకారములను బరిగణించిరి.

---

*అలంకృతి రలంకారః— అలంక్రియతే అనేనే త్యలంకారః

శోభాకరమిశ్రుఁ డలంకారముల సంఖ్య నింకను బెంచినాఁడు. భరతుఁడు పేర్కొన్న భూషణములు, లాస్యాంగములు, నాట్యాలంకారములు, కొన్ని సంధ్యంగములు కూడ అర్వాచీనులచే నలంకారములుగనే పరిగణింపఁబడినవి. ఇవన్నియు నలంకారములే యగునా లేక వీనిలోఁ గొన్నిటియందు మఱికొన్నిటి నంతర్భవింపఁ జేయ వచ్చునా అను విమర్శ రసగంగాధరమునఁ గనవచ్చును.

అలంకారములు శబ్దాలంకారములు, అర్థాలంకారములు అని ప్రధానముగా రెండు విధములు. కొందఱ ఉభయాలంకారము లని మూఁడవ విధమును గూడఁ బేర్కొనిరి. అర్థము నపేక్షింపక శబ్దమును మాత్ర మాశ్రయించియుండు నలంకారములు శాబ్దికములు. అర్థమును మాత్ర మాశ్రయించి యుండునవి ఆర్థికములు, ఉభయాశ్రయములై యుండునవి ఉభయాలంకారములు. అనుప్రాస యమకాదులు శాబ్దికములు; ఉపమా రూపకాదు లార్థికములు; పునరుక్తవదాభాస లాటానుప్రాసాదు లుభయములు. భోజుఁడు సరస్వతీకంఠాభరణమున శబ్దాలంకారములు బాహ్యము లనియు నర్థాలంకారము లాభ్యంతరము లనియు పల్కి జాతి, గతి, రీతివృత్తి, ఛ్చాయా, ముద్రా, శయ్యాదులు కూడ శబ్దాలంకారములే యని వ్యక్తీకరించెను. ఔచిత్యము ననుసరించి చేయఁబడిన శబ్దాలంకార సంఘటనము పాఠకుల కానందము చేకూర్చును. సంస్కృత కవులు వన యుద్ధ వర్ణాదుల సందర్భమున శబ్దాలంకారములను గూర్చినారు. ఆంధ్ర కవులు గూడ వనజలక్రీడా పుష్పాపచయాదుల వర్ణనమునందు శబ్దాలంకార ప్రీతి ప్రదర్శించినారు. అసలు ఛందోయుక్తమైన రచనయే శబ్దాలంకారమని కొందఱి అభిప్రాయము. ఇంక నర్థాలంకారముల నుచితముగఁ గూర్చుట కవుల ప్రతిభా కౌశలములను సూచించును ఆనందజనకములైన భావరామణీయక చమత్కారములే అలంకారములకు మూలములు. అలంకారములు లక్షణ సమగ్రములైనను అలంకరించు గుణమునఁ గొఱవడినచో అలంకారములు కాకపోవును. అవి అలంకార్యము నలంకరింపవలె నని అలంకారికులు శాసించినారు. కాంతాదేహము నలంకరించునప్పుడే అలంకారము లన్వర్థము లగును గాని పెట్టెలో దాచఁబడి యున్నపుడ అలంకారములు కాఁజాలవు. అట్టులే రసధ్వనుల కుపస్కారకములై భావము నుద్దీపింపఁ జేయునప్పుడే అలంకారము అలంకార నామార్హములగును లేనిచో నవి కేవల మర్థచిత్రము లనదగును. కొందఱు రసము కూడ నలంకారమే యనిరి. కాని యది సమంజసము కాదు. అది దేనిని అలంకరింపదు. అవి

అప్రధానమై యన్యము నలంకరించినప్పుడే అలంకారత్వమును బొందును. అది అలంకార్యమే కాని అలంకారముకాదు.

ప్రతాపరుద్రీయమున నర్థాలంకార విభజన మిట్లు చేయఁబడినది. రూపక పరిణామ సందేహాదులు (16) ప్రతీయమానౌపమ్యములు. ఇందౌపమ్యము వాచ్యముగాఁ గాక వ్యంగ్యముగా గోచరించును. సమాసోక్తి పర్యాయో క్త్యాక్షేప పరికరాదులు (10) ప్రతీయమాన వస్తుకములు. వీనిలో వస్తువు వ్యంగ్యముగా గోచరించును. రసవత్, ప్రేమ, ఊర్జస్వి, సమాహిత, భావోదయ, భావసంధి, భావశబలతలు (7) ప్రతీయ మానరస భావములు. వీనియందు రసభావములు వ్యంగ్యముగా గోచరించును. మిగిలిన ఉపమాదులు. (40) అస్ఫుట ప్రతీయ మానౌపమ్య రసభావములు వీనిలో వస్తురసభావౌపమ్యాదు లస్ఫుటముగా మాత్రమే భాసిల్లును.

సాధర్మ్యవిరోధాదుల మూలమున నర్థాలంకారములు పండ్రెండు విధములుగా విభజింపఁబడినవి. రూపక పరిణామాదులు (7) అభేద ప్రధాన సాధర్మ్యములు. దీపక తుల్య యోగితాదులు (8) భేదప్రధాన సాధర్మ్యములు ఉపమానన్వయాదులు (4) భేదాభేద ప్రధాన సాధర్మ్యములు. ఇట్లు సాధర్మ్య మూలములు మొత్తము పందొమ్మిది. ఉత్ప్రేక్షాతిశయోక్తులు (2) అధ్యవసాయమూలములు. ఉపమేయమును వాచ్యముగాఁ జెప్పక యుపమానమును మాత్రమే చెప్పుట అధ్యవసాయము. విభావనా విశేషోక్త్యాదులు (10) విరోధ మూలములు, ఇందు కారణము లేకున్నను కార్యము కలిగినట్లు చెప్పఁబడును. యథాసంఖ్య, పరిసంఖ్యాదులు (5) వాక్య న్యాయమూలములు, వాక్యన్యాయములు మీమాంసా శాస్త్రమునకు సంబంధించినవి. పరివృత్తి ప్రత్యనీకాదులు (8) లోకవ్యవహిత మూలములు. కావ్యలింగానుమా నార్థాంతరన్యాసములు (3) తర్కన్యాయ మూలములు. కారణమాలైకావళీ మాలాదీపిక సారములు (4) శృంఖలా వైచిత్ర్యమూలములు. (గొలుసునందలి పూసలవలెఁ బూర్వాపరపద సంబంధము గలవి.) వ్యాజోక్త్యపహ్నవము లపహ్నవమూలములు, అపహ్నవమన కప్పిపుచ్చుట. సమాసోక్తి పరికరములు (2) విశేషణ వైచిత్ర్య మూలములు. మిగిలిన శ్లేషాద్యలంకారములు (13) కేవలములు, అనఁగా నెట్టి న్యాయమును అపేక్షింపనివి.

కొందఱు శాస్త్రీయాంశముల ప్రవేశమునుబట్టి అలంకారములను వ్యాకరణ మూలకములు, మీమాంసామూలకములు, న్యాయశాస్త్ర మూలకములు, వేదాంత శాస్త్ర మూలకములు అని విభజించి యుండిరి.

ప్రాచీనాలంకారికులలోఁ గొందఱుపమకును గొందఱు వక్రోక్తికిని గొందఱు శ్లేషకును ప్రాధాన్య మొసంగి యుండిరి. ఉపమ సర్వాలంకార బీజ భూతమని వామనుని మతము. అందుచే నతఁ డుపమా గర్భములైన యలంకారములనే వివరించెను. అతని తరువాత వచ్చిన యాలంకారికు లెల్లరు నాతని మతమునే యనుసరించి తమ తమ గ్రంథములలో నుపమనే యలంకారప్రకరణమున మొట్ట మొదటఁ బేర్కొని యుండిరి. దండి పెక్కుపమా భేదములను సూచించెను. అన్ని భేదముల వివరములు చూపియుండలేదు. అప్పయ్యదీక్షితుల వారు చిత్ర మీమాంసలో "ఉపమాలంకార మొక నటి. అది చిత్రభూమికా భేదములను బొంది కావ్యరంగమున నర్తించుచుఁ దద్విదుల చిత్తముల రంజించు" నని చెప్పియుండిరి.* ఇతరాలంకారములు పెక్కు దాని రూపభేదములే యని యతని యభిప్రాయము.

అలంకారము లన్నియు వక్రోక్తులే యని భామహుని మతము. వక్రోక్తి యన స్వభావవిరుద్ధము చమత్కార శోభితము నగు వికటోక్తి. అట్లు వికటముగాఁ బల్కినప్పుడే చమత్కార ముప్పతిల్లి శ్రోతల కానందము కలిగించును. వికటోక్తి రహిత మగుటచే స్వభావోక్తి నాతఁ డలంకారముగాఁ బరిగణించి యుండలేదు. కుంతకుఁడు భామహుని వక్రోక్తి వాదమును బలపఱిచి వక్రోక్తియే కావ్యజీవితమని సిద్ధాంతీకరించెను. మమ్మటుఁ డతిశయోక్తియే సర్వాలంకార బీజ భూతమని యభిప్రాయపడెను. ఇతని మతమున నతిశయోక్తి యన్నను వక్రోక్తి యన్నను నొక్కటే. "వక్రోక్తి యనఁగాఁ జారూక్తి. దీనిచే నర్థ మధికముగా భావింపఁ బడును. ఇది లేని యలంకారమే యుండదు. కవులు దీనివిషయమై యధికమైన యత్న మాచరింపవలె" నని యాతఁడు చెప్పియుండెను.* అలంకారము లన్నియు శ్లేష స్పర్శచేశోభాతిశయమును వహించు నని కొందఱి యభిప్రాయము. "శ్లేషః పుష్ణాతి సౌభాగ్యం ప్రాయో వక్రోక్తిషు స్థితమ్" (శ్లేష ప్రాయికముగా వక్రోక్తులయం దుండి సౌభాగ్యమును బెంపొందించును" అను వాక్య మందుకు నిదర్శనము.

---

* ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్
రంజయంతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః

* ఏషా సర్వైవ వక్రోక్తి రన యార్థో విభావ్యతే
యత్నోస్యాం కవినా కార్యః కోలంకా రోనయా వినా :

అలంకారముల వలనఁ గావ్యములకు ప్రౌఢత్వమును సౌందర్యమును చేకూరును. ఉపమాద్యలంకారములు కొన్ని పదార్థములం దప్రత్యక్షమై యుండు సౌందర్యమును ప్రత్యక్షము చేసి యనుభవమునకుఁ దెచ్చును. "అధరము పల్లవము వలె నున్న" దని వినఁగనే మన కధరము నందలి యారుణ్య మార్దవములు ప్రత్యక్షము లగును. ఇట్లే అలంకారము లపరిచితములైన పదార్థముల స్వరూప స్వభావములను సహృదయులకుఁ బరిచితములు గావించును. గవయ మృగమును మన మెప్పుడును జూచి యుండక పోయినను అది గోవువలె నుండు నని విన్నప్పుడు దాని స్వరూప స్వభావములు విశదము లగును. అలంకారములు చెప్పఁదలఁచిన భావమునకు స్పష్టత్వమును, నిరూపింపఁ దలఁచిన పదార్థాంశము నకు వైశద్యమును జేకూర్చి సహృదయ మనోరంజన మొనఁగూర్చును. విద్యానాథుఁడు మమ్మటుని "ఉపస్కుర్వన్తి"* త్యాది శ్లోకమును వివరించుచు కరచరణాద్యవయవ గతములైన వలయ నూపు రాదులచే నవయవి యలంకరింపఁబడునట్లు శబ్దార్థావయవ గతములైన యను ప్రాసోప మాదులచే నవయవీ భూతమైన కావ్య మలంకరింపఁబడు నని చెప్పి యున్నాడు.

అలంకారములు సౌందర్యావహములే యైనను వానిని గూర్చుటలోఁ గవులు మిక్కిలి శ్రద్ధ వహింపవలయును. లేనిచో నవి గడుప్రాయములై (కణఁతివంటివై) వికృతి చేకూర్చును. ప్రతిభావంతులైన కవు లెన్నఁడు నలంకార యోజనకై యత్నింపరు అవి అయత్నముగనే సిద్ధించును. కావ్య ప్రతి పాద్యమైన రసభావ సంపద కుపస్కారకములుగాఁ గూర్పఁబడినప్పు డవి కావ్యమున కమిత శోభ చేకూర్చును. సన్నివేశమున కనుకూలములై యలరారు నప్పుడు శబ్దాలంకారములు కూడ సౌందర్యావహములే యగును. అట్టి ఆనుకూల్యము లేనప్పు డవి పాండితీ ప్రతిభలను వెల్లడించినను ఆత్మ భూతమైన ధ్వనికిఁ గొఱఁతె కలిగించి కావ్యములను గృత్రిమములు కావించును. అట్టివానినే మనము చిత్రకావ్యములందుము.

ఆనంద వర్ధనుఁ డలంకారములను బ్రయోగించు సందర్భమున నవి రస పరములుగా నుండునట్లును. సముచిత సమయమున స్వీకృతము లగునట్లును, అయత్న సిద్ధములుగా నుండునట్లును, ఆరంభమునుండి అంతము వఱకును నుంద

* ఉపస్కుర్వన్తితం సన్తం యేంగద్వారేణ సంశ్రితాః
హారాదివ దలంకారా స్తేనుప్రా సోప మాదయః

వలె నను పట్టుదలకు ఫలములు కాకుండునట్లును, అంగములుగా నుండువట్లును జూడవలె నని చెప్పియున్నాడు. ప్రతిభావంతుఁడైన కవిరచనయం దయత్నముగనే యని యహమహమికతో వచ్చునని యతఁడే చెప్పియున్నాఁడు. మనోరంజకములైన వాక్ప్రకారము లెన్ని యుండునో యవి యన్నియు నలంకారములే. వానిని నిరూపించి నిర్ణయించుట క్లేశకరమే యైనను ప్రాచీనాలంకారికులు వాని స్వరూపలక్షణములను. వానియందలి అవాంతర భేదములను చాల కౌశలముతో వ్యక్తము చేసియున్నారు.

అలంకారము లన్నియు నభిధా రూపములని కొంద అవిరి. అవి ధ్వని కంగములై ధ్వనిసంబంధము కలిగి యుండునప్పుడే మనోహరములై యలరారును. అర్థరామణీయకమున కొక్కొక్కప్పుడు వ్యంగ్యము నిదాన మైనట్లే యొక్కొక్కప్పుడు వాచ్యమును నిదానమై యుండును. అందుచే రమణీయార్థ ప్రతిపాదన తత్పరుఁడగు కవిసర్వదా ధ్వని రక్తి నే చూపక గుణీభూత వ్యంగ్య మార్గమును గూడ ననుసరించు చుండును. సమాసోక్తి, అప్రస్తుత ప్రశంస, దీపకము, పరికరము మున్నగు నలంకారములు గుణీభూత వ్యంగ్యములే. ధ్వని అంగి, అలంకార్యము: అలంకార మంగము అది వ్యంగ్య ప్రధాన మగునప్పుడు ధ్వని భేదమే యగును, వ్యంగ్య మప్రధాన మగునపుడు గుణీభూత వ్యంగ్య మగును కవులలంకారములను ధ్వని పర్యవసాయులుగాఁ జేయుటకు యత్నింప వలయును.

అలంకారములు-ఉత్పత్తి : ఏ భాషయందైనను కావ్యగుణాలంకారాదుల బీజములు సహజముగా నుండును. అవియే కవివశమున కావ్యములందు విస్పష్టముగాఁ దలచూపి హృదయ రంజకము లగును. సామాన్య సంభాషణలయందుఁ గూడఁ బ్రయోక్తల ప్రయత్నము లేకుండనే సహజ సిద్ధములై యలంకారములు ప్రవేశించుచుండును. "వానికి వాఁడే సాటి; అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల; సూదిబెజ్జమంత నోరు, ఆకాశమంత ఆకలి; వాఁడు రాక్షసుఁడు; అది యేనుఁగు కాదు నదగొండ" మున్నగు వానిలో నలంకారములే కాక ఛందో బీజములు కూడఁ గానవచ్చు చున్నవి. సకల ప్రపంచ వాఙ్మయమునకు శ్రీకారమని చెప్పఁ దగిన ఋగ్వేదమునందు వివిధములైన కావ్యగుణములే కాక ప్రసిద్ధములైన యలంకారములు కూడ గోచరించుచున్నవి. "సూర్యుఁడను వత్సము వెనుకఁ బెట్టుకొని ఉషస్సనెడి తెల్లని గోవు వచ్చు చున్నది; తల్లి జలక మార్చి యలంకరించిన యువతి వలె నీవు నీశరీర లావణ్యము నందఱికిఁ జూపుచున్నావు" మున్నగు వాక్యములను సూర్యరుద్ర వరుణాదుల వర్ణనము

లును ఇందుకు నిదర్శనములు. నిరుక్తమునందు యాస్కాచార్యుడు "అథ ఉపమాః" అని పంద్రెండు విధములైన యుపమా భేదములను బేర్కొనుటను బట్టి చూడ నప్పటికే యలంకార శాస్త్రమావిర్భవించెనని చెప్పనగును రామాయణభారత పాణినీయాదులలో నలంకార ప్రశంస కలదు. వాత్స్యాయనుని కామసూత్రములందు చతుష్షష్టి కళలలోఁ జెప్పఁబడిన క్రియా కల్పమునకు వ్యాఖ్యాత "కావ్యాలంకార ఇత్యర్థః" అని వివరణము చేసియున్నాఁడు లలిత విస్తరమందును ఈ క్రియాకల్పకళ ప్రసక్తికలదు క్రీస్తుశకారంభ మందలి కొన్ని సంస్కృత శాసనములలో శబ్దాలంకారములును, గుణములును ప్రస్తావింపఁ బడినవి తరువాత కావ్య నాటకాదులలో శబ్దార్థాలంకారములు విరివిగా ప్రయోగింపఁబడినవి. ఆలంకారికులు వాని నన్నిఁటిని బరిశీలించి యందలి యవాంతర భేదములను నిరూపించిరి. మూఁడు నాలుగు నుండి యలంకారముల సంఖ్య కాలక్రమమున శతాధికముగా వృద్ధి నందినది.

అలంకారము లున్నను లేకున్నను కవిచాతుర్య వశమున రసము స్ఫురింప వచ్చును కొన్నిచోట్ల రసమున కలంకారములు పుష్టి కలిగించు మాట నిజమే. కాని అందుచే రసమే యలంకారములం దిమిడి యున్నదని చెప్పరాదు. శబ్దాలంకారము లొక్కొక్కప్పుడు రసమునకు భంజకము లైనను గావచ్చును. అందుచే వానిని ప్రయోగించు విషయమునఁ గవు లధికమైన జాగరూకత వహింపవలయును. ముక్తాహారాదులు కంఠాద్యంగములకు శోభ కలిగించుట ద్వారా అంగికి సౌందర్యము నాపహించుటనటే అలంకారము లంగియైన రస మున్నపుడే దాని కంగ భూతములైన శబ్దార్థములకు వైచిత్రి కలిగించి రసమునకు శోభ కూర్చును. రసము లేనిచో నవి కేవల శబ్దార్థ వైచిత్రి జనకములు మాత్రమే యగును. ఈ విధముగా నలంకారములు గుణరీతి వృత్త్యాదులవలెఁ గావ్యమున కత్యంత ప్రధానములు కావని చెప్పుటకు వీలున్నను లాక్షణికు లందఱును వాని యావశ్యకము నంగీకరించియే యుండిరి రసాదులకంటెను వ్యంగ్యము కంటెను వేఱై శబ్దార్థములలో నొకదాని నాశ్రయించి యుండి విషయితో సంబంధము కలదై యేది చమత్కృతిని బుట్టించు చున్నదో యదియే యలంకారము.

## వక్రోక్తి - అనుమానము - ఔచిత్యము :

వక్రోక్తి : కొన్న పద్యభాగములు వచన ప్రాయములుగా నున్నవనియు, కొన్ని వచన భాగములు పద్యప్రాయములుగా నున్నవనియు విమర్శకు లనుచుం

డుట మనము వినుచుందుము. దీనిని బట్టి యాపద్య భాగములందు వానివి పద్య వాచ్యములుగాఁ జేయు గుణము లోపించినదనియు నావచన భాగములందు వానిని బద్య వాచ్యము లొనర్చు విశిష్టమైన గుణము నిండారి యున్నదనియు స్పష్ట మగు చున్నది. ఆగుణమేది? అది భావములను వ్యక్తీకరించు సాధారణ విధానము కంటె విలక్షణమై పద్య గద్యతారతమ్యముఁజక్కఁగా ప్రకటించు నొకానొక ప్రత్యేక భావ వ్యక్తీకరణ పద్ధతి. క్రీ శ. 1000 సంవత్సరముల ప్రాంతమున జీవించిన కుంతకుఁడను నాలంకారికుఁడు దానిని వక్రోక్తియని పేర్కొని యదియే కావ్య జీవితమని ప్రకటించెను,

ధ్వని సిద్ధాంతము వెలువడిని పిమ్మట ప్రకటితములైన వాదములలో వక్రో క్త్యనుమా నౌచిత్య వాదములు ముఖ్యములైనవి. స్వభావవిరుద్ధము చమత్కార యుక్తమునైన ఉక్తివిశేషమునకు వక్రోక్తియని పేరు. వక్రత శ్వపుచ్ఛమువలెఁ గాక చంద్రకలవలె నుండవలెనని మంఖకుఁడు శ్రీకంఠ చరిత్రమునఁ జెప్పి యున్నాడు. రఘునాధభూపాలుఁడు శ్రీనాధుని కవిత్వమున 'హరచూడా హరి ణాంక వక్రత' గలదని వర్ణించియున్నాఁడు. వక్రోక్తియనఁగా వట్టి వంకర మాట మాత్రమే కాదు: అది వక్రత తోపాటు రామణీయకమును గూడఁ గలిగి యుండ వలెను. సహృదయుల కానందము కలిగించురీతి పదభావముల సంఘటిం చుయే వక్రోక్తియని వివరించి కుంతకుఁడు దానిని వైదగ్ధ్య భంగీభణితి యని పేర్కొనెను. రమణీయములైన శబ్దార్థములు కావ్యశరీరమనియు,నాత్మభూతమైన వక్రోక్తిలేనిచో నవికావ్య ప్రయోజనమును నిర్వహింపఁజాల వానియు నతని అభిప్రాయము. కుంతకుని పూర్వులు కూడ కొందఱు వక్రోక్తిని బేర్కొని యున్నారు. భోజుఁడు శృంగార ప్రకాశమున నీక్రిందిశ్లోకము నుద్ధరించి యున్నాఁడు.

"వక్రత్వమేవ కావ్యానాం పరా భూషేతి భామహః
శ్లేషః పుష్ణాతి సౌందర్యం ప్రాయో వక్రోక్తిషు స్థితమ్."

"వక్రతయే కావ్యముల కుత్కృష్టమైనభూషణ మనిభామహుఁడు. శ్లేష ప్రాయికముగా వక్రోక్తులయందుండి సౌందర్యమును బెంపొందించు" నని దీని యభిప్రాయము. మనోరధుఁడు "ఉత్కృష్టమైన సంఘటనయే వక్రోక్తి" యని ధ్వన్యాలోకము నిర్వచించి నట్లు చెప్పియున్నాఁడు. ఇది వామనుని రీతివాదమునకు సన్నిహితముగానున్నది. ఏలయన నిది బాహ్యమైన పదసంఘటనమును గూర్చి

యేకాని అంతరమైన ఆత్మనుగూర్చి చెప్పుటలేదు. వామనుఁడు కూడ వక్రోక్తిని వేరొక్కని యది సాదృశ్యలక్షణ యని నిర్వచించెను. అతడిచ్చిన యుదాహరణ మిది.

"ఉన్మిమీల కమలం సరసీనాం
కైరవంచ నిమిమీల ముహూర్తాత్"

"సరస్సులందు కమలము రెప్పలు తెరచెను-కలువ వెంటనే రెప్పల మూసెను" అని దీనియర్థము తమ్మియు కలువయు జడపదార్థములు అవి రెప్పలు తెరుచుట మూసుకొనుట యనునది పొసఁగదు. అందుచే వానికి కన్నులతోఁ గల సాదృశ్యమును బట్టి కమలములు వికసించె ననియు కలువలు మొగడె ననియు మన మర్థము చేసికోవలయును, ఇదే వక్రోక్తియని వామనుని అభిప్రాయము. ఇది దండి సమాధిగుణమునుబోలి ధ్వన్యర్థమును దలఁపునకుఁ దెచ్చుచున్నది.

కుంతకుఁడు వక్రోక్తి సిద్ధాంతమును నెలకొల్పినను రసధ్వని వాదములకు విరుద్ధుఁడు కాఁడు అతఁడానందవర్ధనుని యెడను అతని ధ్వని సిద్ధాంతమునెడను గౌరవము ప్రకటించి రసధ్వనులకు సంబంధించిన వివిధ సూత్రములను వక్రోక్తి భేదములలో నిమడ్చనింపఁజేసెను. అనుమాన వాదమును నెలకొల్పిన మహిమ భట్టు ధ్వని సిద్ధాంతమును ఖండించుచు ధ్వని వక్రోక్తిసిద్ధాంతములు రెండు నభిన్నములే యని నిరూపించెను. ఆధునిక విమర్శకులుకూడ పలువు రిట్లే భావించిరి. కుంతకుఁడు వక్రోక్తి యను భావమును విశాలతరము కావించి యుత్తమకవిత్వమున కుండవలసిన లక్షణముల నన్నిటిని అందుఁ జొప్పించెను.

భామహుఁడును, మమ్మటుఁడును క్రమముగా వక్రోక్త్యతిశయోక్తులకు ప్రాధాన్య మొసంగిరి, వక్రోక్తి శూన్యము లగుటచే స్వభావోక్తి క్రమ సూక్ష్మ లేశాదులను భామహు డలంకారములుగాఁ బరిగణించి యుండలేదు. అన్ని అలంకారములందు వక్రోక్తియుండుననియు నది లేనిచో నవి నీరసములై మనోరంజనము చేయఁజాల వనియు నతఁ డభిప్రాయపడెను. మమ్మటుఁ డలంకారముల న్నియు నతిశయోక్తి మూలము లనియు నతిశయమే వక్రతను గలిగించుననియు వ్యక్తము చేసెను "కవులు ముఖము చంద్రునివలె నున్నదందురు. ముఖము నిజముగా చంద్రుని వలెనున్నదా? లేదు. అందులోఁ గొంత అతిశయోక్తి కలదు ఇదే అలంకార సౌందర్యమునకు మూలకారణము" అని ఆతని యభిప్రాయము. అతిశయము. వక్రత. చారుత్వము అనున నాతని మతమున సమానములే.

. దండి వాఙ్మయ మంతయు స్వభావోక్తి, వక్రోక్తి అని రెండు విధములని తెల్పెను. (భిన్నం ద్విధా స్వభావోక్తి ర్వక్రోక్తి శ్చేతి వాఙ్మయమ్.) స్వభావోక్తి

ఉన్నదాని నున్నట్లు వర్ణించును. వక్రోక్తిదానినే వక్రముగ అనఁగా చమత్కార బంధురముగాఁ దెల్పును. కొన్ని సన్నివేశములందు స్వభావోక్తి కూడ నానంద ప్రదమే యయ్యును ఆనంద సంధాన సామర్థ్యమున వక్రోక్తితోసాటికాఁ జాలదు.

కుంతకుఁడు షడ్విధములైన వక్రోక్తులను వివరించెను. 1. వర్ణవిన్యాస వక్రత—ఇది శబ్దాలంకారప్రాయమైనది. 2. పదపూర్వార్ధ వక్రత—ఇది పదమున పూర్వార్ధములైన ప్రాతిపదికలతోఁగాని ధాతువులతోఁగాని సంబంధించినది. ఇందు మరల రూఢివైచిత్ర్య వక్రత, పర్యాయ వక్రత మున్నగు భేదము లనేకము లున్నవి. వీనిలో ఉపచార వక్రత ముఖ్యమైనది వీనిలో సమస్త ధ్వని భేదములును గ్రహింపఁబడినవి. 3. ప్రత్యయవక్రత—ఇది కృత్తద్ధిత ప్రత్యయములతో సంబంధించినది. ఆ ప్రత్యయముల సంయోగముచే నిం దధిక చారుత్వము గలుగును. 4. వాక్య వక్రత—ఇది అర్థాలంకారములచేఁ గలుగు సౌందర్యము. 5. ప్రకరణ వక్రత—ఇది రసమున కనుకూలముగా లేని కథా వస్తువును దననుకూలముగా మార్చుటవలనఁ గలుగు చారుత్వము అభిజ్ఞాన శాకుంతల మందలి దుర్వాసుని శాప మిందు కుదాహరణము 6. ప్రబంధవక్రత—ఇది కథయందలి ప్రధానరసమును మార్చి దాని నన్యరస ప్రధానముగాఁ జేయుటవలనఁ గలుగు చారుత్వము. భారతకథ శాంతరస ప్రాధాన్యమైనది. భట్టనారాయణుఁడు భారతాంతర్గతమైన వేణీసంహార వృత్తాంతమును శాంతప్రధానముగాఁ గాక వీర రసప్రధానముగా రచించుట యిందు కుదాహరణము. పై భేదము లన్నింటియందు వక్రత యనఁగా సౌందర్యమని యర్థము. దాని కొఱకై కవు లందఱును అధికముగా యత్నింపవలెనని కుంతకుని యభిప్రాయము.

అనుమానము : అభినవగుప్తుని తరువాత ధ్వని సిద్ధాంతమును ఖండించి స్వీయ వాదములను ప్రతిష్ఠింపఁ దలంచిన వారిలో మహిమభట్టొకఁడు. అతఁడు సర్వ ధ్వనులును అనుమానమునందే అంతర్భవించు విషయమును ప్రకటించుటకు వ్యక్తి వివేకమను గ్రంథమును రచించెను. ఆనందవర్ధనుఁడు అభిధ, లక్షణ, వ్యంజన అను మూఁడు వృత్తులను దెల్పఁగా మహిమభట్టు వ్యంజనావృత్తి కల్పన మన వసర మనియు, లక్షణ కూడ అనుమానములోనే అంతర్భవించు ననియుఁ దెల్పి అతఁడు చెప్పిన ధ్వని భేదము లన్నియు అనుమానాంతర్గతములే యని సిద్ధాంతీకరించెను. అతఁడు తానుతెల్పు ననుమానము ధూమాగ్న్యనుమానము వంటిది కాదనియు. నది కావ్యానుమితి యనఁబడు ననియు వివరించెను.

మహిమభట్టు ననుసరించి అర్థము వాచ్యము, అనుమేయము అని రెండు విధములు. అందు వాచ్యము శబ్దవ్యాపార విషయము. దీనికే ముఖ్యార్థమని నామాం

తరము. దీనినుండి కాని లింగభూతమైన తదనుమితమునుండి కాని యనుమానింపఁ బడు నర్థాంతర మనుమేయము. (పర్వతమున నిప్పుగలదు. ఏలయన పొగ యుండుటవలన, అను వాక్యముక పొగ లింగము (హేతువు). నిప్పు లింగి(అనుమేయము) లింగమును బట్టిలింగి యూహింపఁ బడుచున్నది (ఈ విషయము ధ్వన్యభావవాదులు ఖండన సందర్భమున వివరింపబడినది). అనుమేయము వస్త్వలంకార రసాదు లని మూఁడు విధములు. అందు వస్తువును, అలంకారమును వాచ్యములు కూడ నగును. రసాదులు మాత్ర మనుమేయములే.

మహిమభట్టు వ్యంజనావృత్తి అనవసరమని చెప్పినను ధ్వని వాదమునే మిక్కిలి పెంచి అనుమాన వాదమును నెలకొల్ప యత్నించినట్లు తోఁచును. అతఁడు కావ్యమున కాత్మ రసాది రూప మనుటలో విప్రతిపత్తి లేదని చెప్పుటచే రస ప్రాధాన్యము నంగీకరించినవాఁడే కాని తిరస్కరించినవాఁడు కాదని తెలియుచున్నది. పండితరాయలు మొదలగువారు తరువాత అనుమాన వాదమును ఖండించి వ్యంజనావృత్తి నంగీకరింపక తప్పదని నిర్ధారణ చేసిరి.

**ఔచిత్యము** : దండి సర్వాలంకారములును అర్థమున రసమును చిందించునవి వల్కి యా భారము నంతను అగ్రామ్యతయే వహించునని వివరించెను. అగ్రామ్యత యనఁగా ననౌచిత్యము లేకపోవుటయే ఈ సూచన ననుసరించియే కాఁబోలు నానందవర్ధనుఁడు "అనౌచిత్యముకంటె రసభంగమునకు వేఱొండు కారణము లేదు, ప్రసిద్ధమైన యౌచిత్యముగల కావ్యము రసోపనిషత్తే, యని తెల్పియుండెను. క్షేమేంద్రుడు డీ కారికను గ్రహించి దానిని బెంపొందించి యౌచిత్య వాదమును ప్రపంచించెను. ఉచితముయొక్క భావ మౌచిత్యము.

రససిద్ధమైన కావ్యమున కౌచిత్యమే స్థిరమైన జీవిత మనియు, నది లేనిచో బాహ్యశోభా హేతువులైన అలంకారముల వలనను మిథ్యాగుణితములైన గుణముల వలనను ప్రయోజనము లేదనియు క్షేమేంద్రుని సిద్ధాంతము. గుణాలంకారాదు లుచిత స్థలముల నుచితముగాఁ గూర్పఁబడినప్పుడే శోభాకరము లగునని యతని యభిప్రాయము. అతఁ డౌచిత్యము. పద వాక్య ప్రబంధ గుణాలంకార రసాదులం దుండునని తెల్పి వాని కన్నిటికి నుదాహరణము లొసంగెను. అతఁడు వేఱేయౌచిత్యవాదమును నెలకొల్పినను ధ్వని వాదమునకు విరుద్ధుఁడు కాఁడు.

లక్షణ విభాగము సంపూర్ణము.

# సాహిత్యసోపానములు సవరణ పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 11 | రార్యము | కావ్యము |
| 6 | 8 | విమర్శనకు | విమర్శకునకు |
| | 20 | మొగమాటము | మొగమోట |
| 7 | 21 | సుగుణము | సగుణము |
| 10 | 3 | సాధర్మము | సాధర్మ్యము |
| | 19 | బహిరోక | బహిర్లోక |
| 12 | 11 | మానయే | మానవే |
| 18 | 22 | సుగుణము | సగుణము |
| 20 | 2 | monner | manner |
| | 8 | జాన్ తేబెల్ | జాన్ కేబెల్ |
| | | సిద్దాంతము | సిద్ధాంతము |
| 23 | 11 | ప్రతిభయ | ప్రతిభయు |
| 27 | 17 | పూర్వార్ధ | పదపూర్వార్థ |
| | 19 | అనుమతీ | అనుమితీ |
| 28 | 17 | సమ్మతము | సమ్మితము |
| 32 | 23 | హీవాః | హీనాః |
| 33 | 5 | రుచిని | రుచినిఅరుచిని |
| | | రూపస్వభావ | దానిరూపస్వభావ |
| | 11 | యుద్ధమని | యుద్ధమునే |
| 34 | 23 | నిర్వచనములు | నిర్మాణములు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 37 | 16 | వ్యంగ | వ్యంగ్య |
| | 17 | కాకపోవును | వక్రోక్త్యతిశయోక్త్యుత్ప్రేక్షల నందుజొప్పించిన చోనది చరిత్రయే కాకపోవును. |
| 40 | 7 | నీతితత్వోపదేశము | నీతిధర్మతత్వోపదేశము |
| 41 | 12 | గవివశాగత | గథావశాగత |
| | 26 | విశ్వసింతురు | విన్యసింతురు |
| 42 | 26 | పద్యోభయమముగా | పద్యోభయమయముగా |
| 49 | 1 | నాశ్రయించియో | నాశ్రయించియే |
| 51 | 19 | సహాయములు | సహాయులు |
| 52 | 22 | తుశల | కుశల |
| | | ప్రహసమున | ప్రహసనమున |
| 54 | 18 | అగ్రిమక్షమున | అగ్రిమక్షణమున |
| | 23 | భేదదముల | భేదముల |
| 55 | 17 | ఉద్పాద్యము | ఉత్పాద్యము |
| 62 | 26 | ఇందుకై | ఇందుక్తి |
| 64 | 23 | హరికథ | పరికథ |
| 68 | 15 | 2 | 20 |
| 74 | 11 | ప్రాధ్యాన | ప్రాధాన్య |
| 76 | 20 | సత్త్వము | సత్త్వము |
| 82 | 25 | శ్రీశంకుని | శ్రీశంకుకుని |
| 85 | 10 | విభాదులందే | విభావాదులందే |
| 87 | 6 | తెలగింపఁ | తొలగింపఁ |
| | 19 | వేళాదత్తాముసు | వేళాదత్తములు |
| 94 | 18 | గావవచ్చుచున్నది | గానవచ్చుచున్నది. |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 105 | 11 | గలిగించు | గలిగించుచు |
| 108 | 23 | ప్రేమరసమును | ప్రేమోరసమును |
| 109 | 15 | సంపర్గముచేఁ | సంసర్గముచేఁ |
| 111 | 22 | మీమాంసలో | మీమాంసకులలో |
| 118 | 17 | అవిషత్వము | అనిమిషత్వము |
| 119 | 3 | వ్యంజములైన | వ్యంజకములైన |
| 123 | 27 | విష్ణవందు | విష్ణువందు |
| 125 | 1 | బడునున్నది | బడుచున్నది |
| 129 | 10 | వారికి | వారివి |
| 130 | 20 | నాట్యములందు | వాక్యములందు |
| 134 | 23 | లక్ష్యార్థము | లక్ష్యార్థము |
| 135 | 7 | లక్షణాంతర్భావుల | లక్షణాంతర్భావుల |
| 136 | 20 | సుణీతభూత | గుణీభూత |
|  | 21 | ,, | ,, |
| 138 | 24 | మైచదను | మైనదమ |
| 140 | 4 | వాచ్యయే | వాచ్యమే |
|  | 24 | రభావ | రసభావ |
| 143 | 5 | ప్రకాశించున్నాడు | ప్రకాశించుచున్నాడు |
|  | 11 | విశేషణములు | విశేష్యవిశేషణములు |
|  | 27 | ప్రసకియేలేదు | ప్రసక్తియేలేదు. |
| 146 | 20 | రొసంగెను | లొసంగెను |
| 147 | 3 | అలావణ్య | అలాణవ్య |
| 148 | 1 | జందునంబు | జందనంబు |
| 151 | 11 | వదేవాక్యాత్మ | వదేశావ్యాత్మ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 152 | 4 | పక్తముచేయ | వ్యక్తముచేయ |
| | 21 | దానిలేమిచే | గానిలేమిచే |
| | | పరుపాక్షరముల | పరుషాక్షరముల |
| | 25 | దంభావర్గళదుః | దంభానర్గళదుర్గ |
| 154 | 27 | వివయమున | విషయమున |
| 157 | 7 | అఃభార | అర్థభావ |
| | 13 | నిఘ్నోన్నత్ | నిమ్నోన్నత |
| 158 | 8 | గూర్చుచుటయే | గూర్చుటయే |
| 172 | 29 | కొన్న | కొవ్ని |